# భారతి



సాహిత్య మాసపత్రిక

[illegible]

---

వెల ఒక రూపాయి

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

జనవరి 1961

సంపుటము 38 : : సంచిక 1

విడిపత్రిక వెల ఒక రూపాయి

సంక్రాంతి విడుదల!







అన్నపూర్ణా వారి...

# వెలుగు నీడలు

నిర్మాత: D. మధుసూదనరావు B.A. • దర్శకుడు: ఆదుర్తి సుబ్బారావు



నవయుగ

# విషయానుక్రమణిక

## జనవరి 1961



## ఫిబ్రవరి సంచికలో

# స్వ విష యము

ఇరవయ్యవ శతాబ్దం షష్ట్యబ్దపూర్తి చేసుకొని ఒకరీతి పరిణతిని సమీపిస్తున్నది. దీనికి ఆశాసూచనగా, ఈ పరిణతి ప్రభాంకురాలు విశ్వసాహిత్యంలోను, మన సాహిత్యంలోను మొలకెత్తుతున్నవనవచ్చు.

తెనుగు సారస్వతశాఖ సృజనాత్మక శాఖ కొత్తరెమ్మలు వేసి, కొత్తకావ్య కుసుమాలు పూచింది. వీటిలో మహాసేనోదయం, మధూదయంవంటి ప్రాచీన ఫక్కీవి; వికాస భారతంవంటి చారిత్రకాలు; సినీవాలి, యుగేయుగే, మనోభూమికలువంటి నూతనాధివాస్తవికాలు; అమ్మతో ముచ్చట్లు వంటి ఆధ్యాత్మికాలు ఉన్నాయి. కథానికలు ముందుకన్నా వైవిధ్యంతో, జీవితానికి సన్నిహితంగా, సహజసుందరంగా వికసించాయి. నవలఅన్న ఉపశాఖగూడ వెల్లువలో పూచిన పువ్వులు, జీవనగంగవంటి వాటిని వెలయించడం ముదావహం. నాటికలూ, సంగీత రూపకాలూ కొంత నూతనత్వంతో చిగిర్చాయి.

ఇక విమర్శశాఖ ముందుకన్నా కొంత ముందంజ వేసింది. సాహిత్య అకాడెమీ ఏర్పాటు చేసిన పోటీవల్ల నన్నెచోడునిపై నాల్గైదు గ్రంథాలు వెలువడ్డాయి. ద్రోణ ప్రశస్తివంటి చర్చాగ్రంథమూ వెలువడింది. కాని, సమకాలికరచనలపై విమర్శగ్రంథాలు అంతగా వెలువడ లేదనే చెప్పాలి.

భాషాశాస్త్ర విమర్శలో చెప్పుకోదగిన గ్రంథాలు ద్రవిడియన్ కంపేరిటివ్ వకబులరీ, వృత్తి పదకోశంవంటివి కొన్నే.

చరిత్ర పరిశోధన తెలంగాణా శాసనాలు, సిద్ధేశ్వర చరిత్ర ప్రచురణలతో కొంత ముందుకు సాగింది.

తెలుగు మెరుగులను ఇతర భాషల వారికి తెలియజేయడానికి జరిగిన ప్రయత్నమూ ఎన్నదగిందే. ఉర్దూ - తెలుగూ అకాడెమీ, దక్షిణభాషా పుస్తకసంస్థ ఈ ప్రయత్నానికి దోహదం చేస్తున్నవి. సాహిత్య అకాడెమీ చేస్తున్నకృషీ, దాని తెలుగు కావ్యమాల పేర్కొనదగినవి.

ఎప్పటిలాగే అనువాద సాహిత్యం ఏరాళంగా వస్తున్నది. మారిస్ కారన్ ఫోర్త్ థియరీ అఫ్ నాలెడ్జి, డెకార్టెస్ సిద్ధాంతం తెనుగులోకి రావడం ప్రశంసనీయమే.

తెనుగువారి ప్రతిభ ఖండన ఖండఖాద్య సహస్రిక, పూర్ణపాత్రంవంటి సంస్కృత కావ్యాలలోను ప్రతిఫలించింది.

ఈ జ్ఞానసేతు నిర్మాణంలో ముప్పయి యేండ్లునిండిన భారతికూడా దేశోద్ధారకుని ఆశయమే లక్ష్యంగా ఉడుతాభక్తితో సేవ చేస్తున్నది. నిరుడు కాటయవేముని అన్నవర దానశాసనంవంటి అపూర్వవిషయాలను పాఠకులకు అందించింది; ఈ సేతుబంధంలో అందరి సహకారమూ ఉండగలదనే ఆశిస్తున్నది.

# భా ర్గ వి !

## శ్రీ విశ్వనాథసత్యనారాయణ

కవితాణాత్కార గర్భభేదన మహోగ్ర ప్రౌఢ సంతాపిత
జ్వాలనమ్మంటుకపోవఁ బోయెడి ప్రపంచ మ్మింత దుర్గాతిమై
దల దాశాంత శరన్నిశాముఖ సముద్యచ్చంద్రరేఖా సుశీ
తల నేత్రాంచల కాంతి నా డెసను సంధానింపవే భార్గవీ !

ఈశారాధన, మాత్మవస్తువిచయం, బీ జన్మ పారంపరీ
క్లేశం బేదు ప్రయత్న, మన్నిటికి తల్లీ ! స్వస్తి చెప్పంబడెన్;
దేశం బొక్కటి మానవాళికి నుపాదేయమ్ముగాఁ బొల్చె సం
ధ్యా శీతాంశు మనోజ్ఞహా కరుణ సంధానింపవే భార్గవీ !

తమ యింకేదియు పట్టరానిదగు సిద్ధాంతమ్ముగా జీవలో
కము తీర్మానముచేయు పూరణ మహోగ్రస్ఫూర్తి యేపారెడున్
కమలాంతర్మృదు కేసరాభ నయనాగ్ర స్వాదులేఖా మృదూ
త్తమ కారుణ్య పయః పృషల్లవము సంధానింపవే భార్గవీ !

ఊర్వీరాజ్యము కోరువా, ర్తదనుయాయుల్, వారి సిద్ధాంతముల్
పర్వెన్ లోకమునన్ మరేది యయినన్ ప్రాణానికిన్ తెచ్చెడున్
పర్వేందూజ్జ్వల బింబకాంతి నికురుంబస్వాదు దీప్తాస్యసా
పర్వశ్రీ విగళత్కృపాపథము సంబాళింపవే భార్గవీ !

పరగన్ విప్లవహేతువాక్యమె కవిత్వం బద్ది సాహిత్య మ
స్థిరమైపోయె, త్రయీ సరస్వతికి వచ్చెన్ కష్టకాల, మ్మశీ
సర మందానిల వీచికాభనయనాంతప్రాంశు చంద్రాంశు సుం
దర కారుణ్య పయః పృష౩ల వము సంధానింపవే భార్గవీ !

# తెలుగు మఱుఁగులు

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

'తెలుగు మఱుఁగులు' అను శీర్షిక క్రింద గడచిన సెప్టెంబరు నెల భారతిలో నేను చర్చించిన యంశములు పలువురు విద్వాంసుల దృష్టి నాకర్షించుట మిక్కిలి ముదావహము. ముఖ్యముగా 'వారణ సేయ' యన్న శ్రీనాథుని పద్యమునకు మాతృకను దెలిసి శ్రీ బులుసు వెంకట రమణయ్యగారు మొదలగు విద్వద్వరేణ్యులు నావంటి జిజ్ఞాసువుల కృతజ్ఞతకు పాత్రులయిరి. నవంబరు నెల భారతిలో పూజ్యులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు నేను చర్చించిన యంశములపై దమ యభిప్రాయములను బ్రకటించుట మాత్రమే గాక భారతము, నృసింహపురాణము అను గ్రంథములలోని పద్యములకు సంబంధించి పెక్కు విశేషములను దెలిపి లోకమునకు మహోపకారము గావించిరి. ఇట్లే యీ వ్యాసంగము నింకను పెంచి తెలుగు మఱుఁగులు వెలికి తెచ్చుట వాంఛనీయమని కూడ సూచించిరి. వారన్నట్లు ఒకరి యభిప్రాయములను మరొకరు తెలిసికొనుటకును, పదార్థములు మొదలగు మిక్కిలి గహనము లయిన విషయములను జర్చించుకొనుటకును నేఁడు సాహిత్య గోష్ఠులందును, చర్చావేదికలందును సంతగా నవకాశము లేకపోవుటచే నట్టి విషయములను గురించి కూడబలుకుకొనుట కిదియొక్కటే మార్గమై యున్నది. ఈ వ్యాసంగమిట్లే పెరిగి భాషా రహస్యములును, సాహిత్య మర్మములును నెన్నో లోకమునకు వెల్లడి కావలయుననియే నా యాశయము కూడ. శ్రీ అనంతకృష్ణ శర్మగారు తమ వ్యాసమునందు దడవిన యంశములనుగూర్చి నా యభిప్రాయములను కడపట మనవి చేసికొందును. ఇపు డిందు ప్రాచీన కావ్యములలోని మరికొన్ని పద్యములయందలి విశేషములను జర్చింతము.

ఇటీవల ఎఱ్ఱాప్రెగడ విరచితమైన హరివంశమును శ్రీ వావిళ్ల వారు ముద్రించి ప్రకటించిరి. మహావిద్వాంసులు శతావధానులు నగు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగా రామహాగ్రంథమును బరిష్కరించిరి. అఱువది సంవత్సరములకు మును పెప్పుడో క్రీ. శ. 1901 లో వెలువడిన యీ మహాగ్రంథ మీనాటికైన ద్వితీయముద్రణ మంది లభించుచుండుట మన భాగ్యమనియే భావింప వలయును. పూర్వ ముద్రణములోని పెక్కు దోషములను సవరించి శ్రీ శివరామ శాస్త్రిగా రీ ముద్రణమును సుసంపన్నము గావించినారు. కాని యందు గూడ గొన్ని పద్యముల యర్థము అన్వయము కుదురక చిక్కు గొలుపుచున్నవి. హరివంశములోని కృత్యవతరణిక యందలి పద్య మిది:

ఉ. చుట్టు నిజప్రభాపరిధిపోఁడున నర్వదివేలు శైలముల్
గట్టి పసిండియై తనకుఁ గాంచనభూధ్రము లొప్పఁ బాత్రమై
చుట్టము లెల్ల నాత్మసమశోభితసంపద నొంద నొప్పఁగాఁ
జుట్టపు మేరు వన్వినుతి సొంపున వేమనరేంద్రుఁ డున్నతిన్.

హరి. 1 ఆ. 20 ప.

ఇది వేమభూపాలుని బంధుప్రీతిని, బంధుసత్కారమును నభివర్ణించు పద్యము. వేమనరేంద్రుఁడు తన బంధువుల నెల్లఁ దనయంతవారలఁ జేసి 'చుట్టపు మేరు' వనఁదగి యున్నాఁడని యిందలి భావము. ఈ 'చుట్టపు మేరు' వను పదమును తిక్కన కూడ నుద్యోగపర్వములో సంజయరాయబారఘట్టమునఁ బ్రయోగించి యున్నాఁడు. ఈ క్రిందిపద్యమును జూడుఁడు:

ఉ. పెట్టనికోట నీకు హరి భీముఁడు నర్జునుఁడున్ రణంబునన్
దొట్టినమంట లాకొలఁది యోధుల సాత్యకియున్ విరాటుఁడున్
జుట్టపు మేరు వుగ్రరణశోభితుఁ డీ ద్రుపదుండు నిన్ను ని
ట్టట్టన వచ్చునే శివున కైనను నొల్లవు గాక చివ్వకున్.

భార - ఉద్యో -

తిక్కన వాడిన యీ పదమునే గ్రహించి ఎఱ్ఱాప్రెగడ తన పద్యములో దానికి సార్థకతను గూడఁ

చేకూర్చినాఁడు. ఇట్లు భావము సుగమముగాఁ దెలియ వచ్చుచున్నను ఎఱ్ఱనపద్యములో నన్వయము సరిగాఁ గుదురుట లేదు. 'తనకు' అనఁగా ఎవరికి? వేమభూపాలునికా? వేమభూపాలునికిఁ గాంచన భూధ్రము లొప్పుట యేమి? లేక 'తనకు' అనఁగా మేరువునకా? అయినచో 'కాంచనభూధ్రములు' లనుమాట కర్థ మేమి? దానిని దేనితో నన్వయింప వలయును? 'తనకు' అను దానని 'తనగు' అని పఠింపవలయునా; అప్పుడు మాత్ర మేమి లాభము కలదు! మొత్తముమీఁద నన్వయము కుదురక పద్యము గందరగోళముగా నున్న దనుటకు సందేహము లేదు. పాఠాంతరముల సహాయ మేమైన నిందుఁ బనికివచ్చునేమో యని చూడఁగా మూఁడవ పాదమున మాత్రము 'చుట్టును నెల్ల నాత్మసముశోభిత భంగిఁ దనర్ప నొప్పి' ననుపాఠ మొకటి మాత్రము కానవచ్చుచున్నది. ఇది పద్యార్థము కుదురుట కేవిధముగాను సహాయకారి యగుట లేదు. పూర్వముద్రణము నందుఁ గూడ నీపద్యపాఠ మిట్లే యున్నది. కనుక మనమే యుపజ్ఞతో నూహించి యవసర మగుచోట నెక్కడో యొక చిన్న సవరణ చేసికొని పద్యాన్వయము కుదుర్చుకొని యర్థము చెప్పుకొనవలసియున్నది. వ్రాఁతప్రతిలోనో, వ్రాతప్రతిని జూచి ముద్రించుటలోనో జరిగిన యొకచిన్న పొరపాటువలన నీ పద్యమింత గల్లంతైన దని నాయభిప్రాయము. 'కాంచనభూధ్రములు' అనుటలో దీనికీలకమంతయు నిమిడియున్నది. కాంచనభూధ్రము లెన్నో లేవు, ఉన్నది యొక్కటే. అది మేరుపర్వతము. ఈ దృష్టితో నందలి బహువచనము లేఖకప్రమాదమని త్రోసిపుచ్చి 'లొప్ప' యనుచోట నొక చిన్న సవరణ చేసికొనినచోఁ బద్యార్థము చక్కఁగఁ గుదురఁగలదు. అచట 'కాంచనభూధ్రముఁ బోల్పఁ బాత్రమై' యని—'లొప్ప' స్థానమున 'బోల్ప' అని యుండఁదగును. వ్రాఁతప్రతిలో నాచోట 'బొల్ప'అని యుండఁగా నర్థము కుదరక పండితులెవరో యర్థము మాట మఱచి దానిని 'లొప్ప' యని దిద్దివేసి గణము సరిపోవుచున్నది గదా యని సంతోషించి ముద్రించి యుందురు. అర్థము కుదురని పట్టుల నవాలోచితముగా దిద్దివేయుటలోని యీ తొందరపాటే మనకింత చిక్కు తెచ్చి పెట్టినది. 'తనకు' అనుచోట 'తనగు కాంచన...' అని యొక చిన్న సవరణ చేసికొనినచో పద్యార్థము మఱింత సుగమము కాఁగలదు. ఈ సవరణ చేసికొన్నను నర్థమునకు గలుగు భంగమంతగా నుండదు. ఇవ్విధి సవరణలతోఁ బద్యపాఠ మిట్లుండఁదగును.

ఉ. చుట్టు నిజప్రభాపరిధి సోఁ
కున నర్వదివేలు శైలముల్
గట్టి పసిండియై తనగు కాం
చనభూధ్రముఁ బోల్పఁ బాత్రమై
చుట్టములెల్ల నాత్మసముశో
భితసంపద నొంద నొప్పెఁ దాఁ
జుట్టపు మేరు వన్వినుతి సొం
పున వేమనరేంద్రుఁ డున్నతిన్.

చుట్టున్=తన చుట్టును (మేరుపర్వతమునకు), నిజ=తన దైన, ప్రభా = కాంతియొక్క, పరిధి = పరివేషము యొక్క, సోఁకునన్ = స్పర్శముచే, అర్వదివేలు శైలముల్=అఱువదివేలు కొండలు, గట్టిపసిండి=ముద్దబంగారము, ఐ = అయి, తనగు = ఒప్పునటువంటి, కాంచనభూధ్రమున్ = బంగారుకొండను (మేరుపర్వతమును), పోల్పన్=పోల్చుటకు, పాత్రము=అర్హుఁడు, ఐ=అయి ........ఇత్యాదిగా నన్వయము కుదురుచున్నది.

హరివంశమునందే శ్రీకృష్ణుని బాలక్రీడాభివర్ణనము లోనిది యీ క్రింది పద్యము :

గీ. మన్ను రొంపియుఁ బెండయు మసటు వట్టి
పాంసుసంక్రీడఁ దన మేను భాసురముగ
హరి యనేక ధాతుచ్ఛటా వ్యక్తమైన
శైలకుంజర కలభంబువోలె నొప్పె.

హరి. పూ. 5 ఆ. 195 ప.

పాంసుసంక్రీడచే బాలకృష్ణుని మేన మన్ను, రొంపి, పెండ, మసటు పట్టినదని యిందుఁ జెప్పఁబడినది. మన్ను, రొంపి—సరే. పెండ యేమి? 'మసటు' అనుటకు అధోజ్ఞాపికలో 'మనలు' అని యొక పాఠాంతర మొసఁగఁబడి యున్నది. తమిళములో 'మణల్' అనగా ఇసుక. అదే తెలుఁగున 'మనలు' అయినది. ఎఱ్ఱన కాలమున నీపద మిట్లు వ్యవహారములో నుండి యుండవచ్చును. నేఁడు వాడుకలో నుండి జాఱిపోయిన 'మనలు' అనుపదమున కర్థము తెలియక 'మనలు'ను దాని కించుక దగ్గఱగా నుండునని, యర్థముకూడ నించుమించుగా సరిపోవునని యూహించి పండితులు 'మసటు' అని దిద్దియుందురు. అర్థావగతి కడ్డురాకుండుటచే 'మసటు' అను పదమునకే మన మర్థము

చెప్పుకొని సంతసమందుచున్నాము. కాని యందుఁ జేర్కొనఁబడిన యీ పాఠాంతరమువలన 'మసలు' అను పద మా కాలమున నిసుక యనునర్థములో వాడుకయం దుండినట్లు తెలియుచున్నది. ఇఁక 'పెండ' యేమి? పెంటయా? అది 'పెండ' కాదు. పెంటయుఁ గాదు. 'పేఁడ'. 'పేఁడయు' అనుటను వ్రాఁతప్రతులలో 'పేండ్డయు' అని వ్రాయుదురు. క్రిమిదష్ట మగుటచే నందలి దీర్ఘము కానరాక పోవుటచేతనో యేమో ముద్రాపకులు దానిని 'పెండ'గా పఠించి, యర్థము మాట చూచుకొనక 'పెండ' యనియే ముద్రించిరి. బాలకృష్ణుఁడు పాంసుసంక్రీడ చేయఁగా నతని శరీరమున మన్ను, రొంపి, పేఁడ, యిసుక యనునవి యంటి పెక్కు ధాతురాగములతో నొప్పు చిన్నగుట్టవలె నాతని శరీరముండెనని భావము చక్కఁగా నవగత మగుచున్నది. ఇపుడీ పద్యపాఠ మిట్లుండఁదగును.

గీ. మన్ను రొంపియుఁ బేఁడయు మసలు పట్టి
పాంసు సంక్రీడఁ దన మేను భాసురముగ
హరి యనేకధాతుచ్ఛటా వ్యక్తమైన
శైలకుంజర కలభంబు వోలె నొప్పె.

* * *

మంచన కేయూరబాహు చరిత్రము నందలి కృత్యాది పద్యమిది :

శ్రీ వసియించుఁగాత సుఖసిద్ధి
వహించి యనేక బంధుహం
సావళియుం బ్రహృష్ట రసకాంతి
సముత్కర షట్పదంబునై
జీవన మెప్పుడుక్ సుకవిసేవ్య
మనం బొగడొందు సర్వ పు
ణ్యావహమైన గుండ సచివా
గ్రణి గేహ సరోవరంబునక్.

1—1 ప.

ఇందుఁ గృతిపతి యగు గుండమంత్రి గృహ మొక సరోవరముతోఁ బోల్పఁబడినది. అతనిబంధువు లందలి హంసలు. ప్రహృష్టరసకాంతి సముత్కరము? తుమ్మెదలు. అందలి జీవనము (గేహపక్షమున జీవితము, సరోవరపక్షమున జలము) సుకవిసేవ్యము (గేహపక్షమున కవీశ్వరులచే సేవింపఁదగినది; సరోవరపక్షమున నీరుకాకులను జలపక్షులచే సేవింపఁదగినది.)

ఇట్లిందు గేహమునకు సరోవరముతోడి సామ్యము తక్కిన యన్నింటఁ గుదురుచున్నను తుమ్మెదలతోడి సామ్యము గేహమునందు దేనికిఁ జెప్పఁబడినదో స్పష్టమగుటలేదు. ప్రహృష్ట రసకాంతి సముత్కర మనఁగా నేమి? దానికిఁ దుమ్మెదలతోటి సామ్య మెట్లు? మంచనకవి తన కృత్యాది పద్యమం దీ యఖండయతిని బ్రయోగించె నందుమా? ప్రయోగించెనే యనుకొందము. ఆ సమాసమున కర్థమేమి? యను సందేహాలు మనల బాధించును. బంధువులు హంసలతోను, కవీశ్వరులు జలపక్షులతోడను బోల్పఁబడుటచే నా క్రమసామ్యము ననుసరించి గుండమంత్రి యింటికి వచ్చిపోవుచుండు యాచకులు సరోవరమునకు వచ్చి పోవుచుండు షట్పదములని యూహించుట సమంజసము. కవిహృదయముకూడ నట్టే యుండఁదగును. ఈ దృష్టితో 'ప్రహృష్ట రసకాంతి సముత్కర' మను చోట నా యర్థమున కనుగుణముగా నేదేని చిన్ని సవరణ చేసికొని సామ్యము సరిపఱచు కొనవలసి యున్నది. 'ప్రహృష్ట సరసార్థి సముత్కర' మనియో, 'ప్రహృష్టరసికార్థి సముత్కర' మనియో సవరించు కొన్నచో నర్థము సుగమము కాఁగలదు. మఱియుఁ బ్రాచీనకాలపు వ్రాఁతలో 'సరసార్థిక' అని యుండఁగా లేఖకులో మఱి యెవ్వరో తప్పుగా 'రసకాంతి'యని యాచోట వ్రాసికొనియుండుట సంభావ్యము. ఈ పట్టున మన కిందలి సామ్యమునకు సరిపడు పాఠాంతర మేదేని లభించుదాఁక నిట్టిసవరణ యొకటే మనకు శరణ్యము.

* “ *

నన్నిచోడుని కుమారసంభవమునందలి యష్టమాశ్వాసములో నాశ్వాసాది పద్యమునకుఁ దరువాతి వచన మిది—

వ. ఇట్లు పరమేశ్వరుండు మహోదర్శనం బుండె నంత హిమవంతంబునకుఁ గూఁతుగతులు సనిన మునిగణంబు మగిడివచ్చి తదాస్థానరంగంబుం జొచ్చి—

ఇచట మదరాసు విశ్వవిద్యాలయమువారి ప్రచురణలో 'కూఁతంగతులు సనిన' అని యున్నది. మానవల్లి వారి ప్రతిలో నిచట "కూఁతుంగదులు సనిన" అని యున్నది. మానవల్లివారి పాఠమున నర్థము కుదురుట లేదను భావముతో యూనివర్సిటీవారు దానిని 'కూఁతంగతులు సను'అని సవరించినట్లు తోఁచుచున్నది. అంటే కడపట లఘుటిప్పణిలో 'కూఁతంగతులు సనిన కూఁతవేటుదూరములో నున్నట్లు పోయిన' అని సంపాదక

లర్థము తెలిపి యున్నారు. కాని యాయర్థ మచటి సందర్భమున కేమాత్ర మతుకునట్లు కానరాదు. అంతకు మునుపు సప్తమాశ్వాసమున నీ మునిగణము పరమేశ్వరునిచే 'శీతగిరీశ్వరుపాలి కేఁగి మ, త్ప్రేరణయు కార్య మోజ గొనిఁబల్కి రయంబున రండు గ్రమ్మఱఁగ' అని యనుజ్ఞాతులై బయలుదేరి యోషధి ప్రస్థపురముఁజేరి యందు హిమవంతునిఁ గాంచి '(త్రిజగన్మాన్యుఁడు మన్మ్మనీ కడకుఁ బుత్తేరంగ నాస్వామి కద్రిజ నిచ్చి మడుగంగ వచ్చితి మమాదేవిన్ లసత్కన్యకా వ్రజ చూడామణి నిమ్ము శంభునకు' అని పలికిరి. అట్లు శివునికై కూఁతుఁ నడుగఁబోయిన మునిగణమే యపుడు వచ్చినది. అట్టివారిని గూర్చియే 'కూఁతుంగంతులు సనిన మునిగణంబు' అని యచట ప్రస్తావింపఁబడినది. ఈ సందర్భమునుబట్టి కూఁతుంగంతులు సనుట యను ప్రయోగము కూతు నడుగఁబోవుట యనునర్థమున నే నన్నిచోడఁడునిచేఁ బ్రయోగింపఁబడినదని యూహించుట సమంజసము. అంతేగాని యున్న ప్రయోగమును సవరించి 'కూఁతెం గతులు సనిన' అని మార్చి కూత వేయుదూరములో నున్నట్లు పోయిన యని యర్థము చెప్పుకొనుట తగదు. కూఁతెంగతులుసనుట యనుటకు కూఁతివేటు దూరములో నున్నట్లు పోవుట యను నర్థము మాత్ర మెట్లు చెప్పుకొనవచ్చునో దురూహ్యము. 'కూతుంగంతులు సనుట' యొక వింతప్రయోగము. దీని నితఁడు తప్ప మఱి యేకవీశ్వరుఁడును వాడినట్లు కానరాదు. ఇతఁడైనను నిచట నొక్కచోట మాత్రమే దీని ప్రయోగించి యున్నాఁడు. అయినచో 'కూఁతుంగంతులు' అనుపదమున కర్థమేమి యని మనకు సందేహము కలుగును. నన్నిచోడఁ డిందలి 'గంతు' అనుపదమును మాత్రము మఱొక్కచోఁ బ్రయోగించి యున్నాఁడు. ఈ క్రింది పద్యమును జూడుఁడు :

ఎత్తుగీతి. నీరినడుము దెంప నెలను దే మొండిచె
వెల్పఁ గలియఁ(దచ్చి వెన్నఁ గొనఁగఁ
గడవ నేర్పు గలిగి కందువు మానెఁడై
కత్తిగొంటు లయిన యత్తగంతు.

8 ఆ. 135 ప.

ఇందు 'అత్తగంతు' అనగా వేశ్యామాతల సమూహ మని యర్థము. లఘుటిప్పణిలో 'లంజతల్లుల గుంపు' అని యర్థ మొసఁగఁబడి యున్నది. (4) తంజావూరు రఘునాథ నాయకుని వాల్మీకి చరిత్రములో నిదే యర్థమున గంతె అను పదము ప్రయోగింపబడియున్నది. 4 శబ్దాలంకారముగఁగూడ నది యిందు బ్రయోగింపబడి యుండుట విశేషము. రగడ : కలికి కలికి లతలను దుమ్మెద గంతుగంతులు చూడు వాల్మీకి—3–114 ప. అట్లే యిందును 'కూఁతుంగంతులు' కూఁతు కొఱకైన గుంపులు–అని చతుర్థీతత్పురుషము చేసికొని కూఁతు నడుగఁబోయిన గుంపులని యర్థము చెప్పుకొనఁదగును తరువాత దానికి 'చను' ధాతువు చేరఁగా, శబ్దపల్లవ క్రియయై యది 'కూఁతు నడుగఁ బోవుట' యను నర్థము నొసఁగుచున్నది. కనుక నీ చర్చవలన 'కూఁతుం గంతులు సను' అను మానవల్లి వారి పాఠమే సమంజసమనియు విశ్వవిద్యాలయ ప్రచురణములోఁ జేయఁబడిన 'కూఁతెం గతులు సనిన' యను సవరణయు, దానికొసఁగబడినఁ యర్థమును నంగీకార యోగ్యములు కావనియుఁ దేలుచున్నది.

మఱియు 'అత్తగంతు' ప్రయోగమునకై యిచ్చిన యెత్తు గీతి కూడఁ జర్చనీయమే. ఆ సీసపద్యములో లంజ తల్లులగుంపు ఎట్టి యసాధ్య కార్యములు నైనను జేయఁగలరని వరుసగా నా యసాధ్య కార్యములు పేర్కొనఁబడినవి. నీరినడుమును తెంచుట, చందమామను తెచ్చుట, మొండిచేతితో వేల్చుట?, కలి(త్రచ్చియందుండి వెన్నగొనుట యనెడి యసాధ్య కార్యములను గూడ నా యత్తగంతు చేయఁజాలి యుండెనట! ఇందలి ప్రథమపాదమున మానవల్లి వారి ప్రతిలో 'నేలఁ దెన్నుండిచే వెల్ప' అని యున్నది. అదియు నర్థమగుటలేదు. దానికంటె యూనివర్సిటీ పాఠమే కొంత సుగమముగా నున్నది. నీరినడుమును తెంచుట, నెలను తెచ్చుట, కలి(త్రచ్చి వెన్నగొనుట సరే. 'మొండిచే వెల్ప' యనుమాట కర్థమేమి? ఏ యసాధ్య కార్యమందుఁ బేర్కొనఁబడినది? మొండి చేతితోఁ జేయుటకు సాధ్యముకాని కార్యమేది? ఇచట (వ్రాఁత(ప్రతి పాఠము 'నెలందెనుండి చెవెల్ప' అని ప్రకరణమునుబట్టి యర్థావగతి కనుగుణముగా మనము దానినూహింపవలసి యున్నది. 'మొండిచే వెల్ప' అనుటను 'మొండిచే వేల్వ'నని సవరించుకొన్నచో నర్థము చక్కఁగా సరిపడును. మొండి చేతితో హోమము చేయుటకు సాధ్యము కాదు గదా! (వ్రాఁత(ప్రతిలోని 'వెల్ప'ను 'వేల్వ' యని మనము పఠించినచోఁ బద్యార్థ మంతవఱకుఁ జక్కగాఁ గుదురుచున్నదని మనము సంతోషింపవచ్చును. కాని 'గడవ నేర్పుగలిగి కందువు మానెఁడై' యనుట కర్థమేమి

యను సందేహ మింకను మిగిలియే యున్నది. లఘు టిప్పణిలో 'కందువు' అనుటకు మోసము, చమత్కారము, సామర్థ్యము అని యర్థమొసఁగఁబడి యున్నది. శ. ర. లో కందువు - పెనము, నూలుబంతి, పాకశాల, వంటయిల్లు (కే.ని) అని యర్థము లొసఁగబడియున్నవి. వ్రాఁతప్రతిలోని పాఠము 'కండువు' అని కాని 'కందువు' అని కాని స్పష్టముగాఁ దెలియుటకు వీలు లేక యున్నది. ఇవి యేవి కాని పద్యార్థమును సుగమము చేయుటలేదు. ప్రకరణమును బట్టి యూహింపఁగా నిచట 'గొలువ నేర్పుగలిగి కుంచెఁడు మానెఁడై' అని పఠింపఁదగునని తోఁచును. కాని యది ప్రకృతపాఠమునకు సుదూరమైన సవరణ.

విజయరాఘవనాయకుని మీఁది యీ క్రింది పద్యములోని యిట్టిదేయగు ప్రయోగము నిట నను సంధించుకొనఁదగును.

చ. కులికెద వేటికే చెలియ!
కుంచెఁడు మానెఁడు గాను నెల్ల వా
రలు వినినారు వే
విజయరాఘవరాయఁడు నిన్ను గూడుటల్

కుమార సంభవము తంజాపూరులో దొరకుట, యచటివారెవరో విజయరాఘవ నాయకుని మీఁది పద్యములో నట్టిపలుకుబడినే ప్రయోగించుట యనునవి పయి తెలుఁగు పాఠసంస్కారమునకు నిశ్చాయకమై యున్నది. విజ్ఞులు దీని నింకను బరిశీలింపగలరు.

* * *

శ్రీనాథుని హరవిలాసమునందలి చిఱుతొండనంబి కథలో వర్ష వర్ణన సందర్భమున నీ క్రింది పద్యము కలదు.

'గ్రహసిద్ధాంత కళావిదుల్ సలిల నక్షత్రంబు నీ హార రు
క్సహవాసంబున నభ్రవీథిఁ బరివేషస్థాయి యై యుండుటన్
బహువర్షం బట కల్గునంచుఁ దమలో భాషింపఁగాఁ గంచిలో
గృహమేధుల్ భయమంది రింధన తృణక్లేశంబు చింతించుచున్.'

ఇందుఁ బేర్కొనఁబడిన 1 'సలిల నక్షత్ర' మేదో మనకుఁ దెలియవచ్చుటలేదు. ఆ నక్షత్రము చంద్రుని సహవాసమునఁ బరివేషస్థాయి యై యుండుటను గాంచి జ్యోతిషులు బహువర్షము కలుగునని నిర్ధరించిరఁట! కనుక నా నక్షత్రమేదో వర్షకారకమయిన నక్షత్రముగా నుండవలయును. నిఘంటువులలో సలిల నక్షత్రము ఫలానా యని పేర్కొనఁబడలేదు. వర్షమునిచ్చు నక్షత్రములు పెక్కు కలవని చెప్పుదురు. వానిలో నిందు శ్రీనాథుఁడు దేని నుద్దేశించెనో తెలియదు. శబ్దరత్నాకరములో 'నీటిరిక్క' యని యొక పద మొసఁగఁబడి యున్నది. దానికి 'పూర్వాషాఢా నక్షత్రము' అని యర్థ మొసఁగఁబడి యున్నది. కాని దానికిఁ బ్రమాణముగాఁ బ్రయోగ మేదియుఁ జూపఁబడ లేదు. సూర్యరాయాంధ్ర నిఘంటువులోఁ బ్రయోగ మేదైన నిచ్చిరేమో యని చూడఁగా నందు 'పూర్వాషాఢా నక్షత్రము. శ.ర' అని శబ్దరత్నాకరమునే ప్రమాణముగాఁ జూపినది. శబ్దరత్నాకరకారుల కాయర్థ మొసఁగుట కాకర మేదో తెలియరాదు. ఆంధ్రనామ సంగ్రహమునందును, ఆంధ్రభాషార్ణవమునందును 'నీటిరిక్క' యను పదము లేదు. ప్రకృతమునకు 'నీటిరిక్క' యను నీ పదమునే శ్రీనాథుఁడు 'సలిల నక్షత్ర' మని సంస్కృతీకరించెనేమో యని తలఁపఁదగి యున్నది. అప్పుడు శ్రీనాథునకు 'నీటిరిక్క' కాకరమయిన ప్రయోగము లభించి యుండుట సంభావ్యము కాఁదగును. పూర్వాషాఢా నక్షత్రమునకు చంద్రుఁడు వచ్చినపుడు బహువర్షము కలుగుననుటకుఁ బ్రమాణ మెట్టిదో జ్యోతిషులు చెప్పవలెను. ఎవరికైనను విపరీతముగా విరేచనము లగునపుడు 'పూర్వాషాఢ ఉత్తరాషాఢ అయిన' దని చెప్పుట మనలోఁ గలదు. ఈ జాతీయము కూడ పూర్వాషాఢ బహువర్షకారక మనుటను స్ఫురింపఁజేయును.

* * *

ఇఁక పూజ్యులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు తమ వ్యాసములోఁ బ్రస్తావించిన యంశములను గూర్చి యొకింత ముచ్చటింతును. నాచనసోముని పద్యమును గూర్చి చర్చించుచు శ్రీ అనంతకృష్ణశర్మగారు 'మరి పై పద్యము నాల్గవ పాదమున 'గడివోయినవా ఱుమ్మడువంగ వచ్చునే' అను పాఠము శ్రీ కోదండరామయ్యగా రిచ్చినారు. అది ముద్రణ దోషమేమో. కాదేని అర్థమేమో తెలియదు. 'కడిపోయిన వేఁడ ముడువంగ వచ్చునే' అను పాఠము ఇదివరకు ముద్రితమైనది. సుగ్రహము కూడ' అని వ్రాసిరి. 'కడి

పోయినవాళ్' అనుపాఠము నే నిచ్చినది కాదు. ముద్రణదోషమును కాదు. శ్రీ ప్రభాకర శాస్త్రిగా రిచ్చినపాఠ మది. 1937 లో శ్రీ వావిళ్లవారిచేఁ బ్రచురింపఁబడిన ఉత్తర హరివంశము శ్రీ ప్రభాకర శాస్త్రిగారిచేఁ బరిష్కరింపఁబడినది. అందు 'కడి పోయినవా ళ్ళుడువంగ వచ్చునే' యను పాఠమే ప్రధాన పాఠముగా నొసఁగఁబడి యున్నది. 'కడిపోయిన వేఁడ్' అనుపాఠ మధోజ్ఞాపికలో నొసఁగఁబడినది. దీనిఁబట్టి శ్రీ ప్రభాకరశాస్త్రి గారికి 'కడి పోయిన వాళ్' అనుపాఠమే యిష్టమయినట్లు స్పష్టమగుచున్నది. వారిపీఠికలోఁ గూడ 11 వ పుటలో 'వాళ్' అనుపాఠమే యొసఁగఁబడినది. కడి పోయినవాళ్ అనఁగా వాసన కోలుపోయిన వాడుపూవులు. ఇచట. 'వాళ్' అనుపదము 'వసి వాళ్వాఁడు' అనుపదములో వలెఁ బ్రయోగింపఁబడినది. విశేషణములే నామవాచకము లగుట మనకుఁ గలదుకదా. బెట్టిదములు ఇత్యాదులు. అట్లే వాడుపూవులు - వాఁడులు, వాళులు, వాళ్ అయియుండు నని, అదియే సరియైన పాఠమని శ్రీ ప్రభాకర శాస్త్రిగారు దానివిషయమై మిక్కిలి యభినివేశముతోఁ జెప్పుచుండువారు. శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు కూడ శ్రీ అనంతకృష్ణ శర్మగారి వలెనే 'కడిపోయిన వాళ్' అను పాఠముకంటె 'కడి పోయినవేఁడ్' అనుపాఠమే పరిగ్రాహ్యమని తమ యభిప్రాయముగాఁ దెలిపిరి. నేను శ్రీ ప్రభాకర శాస్త్రిగారు తెలిపిన విషయములను మనవిచేసికొంటిని. అంత వారు 'వాళ్ అనగా వాడుపూవులు సరే. వాడినపూవు లనఁగానే వాసన లేనివి కదా! అట్టిచో 'వాసనపోయిన వాడుపూవు' లన్నచో విశేష మేమి కలదు? పునరుక్తి యగునుకదా! సోమన యట్టి కూర్పు చేయునా? కడిపోయినవేఁడ్ అనుపాఠ మిట్టి చిక్కెదియు లేక సుగమముగా నుండలేదా? యని ప్రశ్నించిరి. సోమన యట్లొక యపూర్వప్రయోగము చేసినాఁడని శ్రీ ప్రభాకరశాస్త్రిగారి భావము. చచ్చిన శవము - ఇత్యాదిగా మనము ప్రయోగించుచుంటిమి కదా! అట్టిదే 'కడిపోయినవాళ్' కూడ నని మనము భావింపవచ్చును కదా! యంటిని. వారును సమ్మతించి నట్లే కానవచ్చెను.

శ్రీ అనంతకృష్ణ శర్మగారు నన్నిచోడుని పద్యములోని 'నోరఁ గొలఁదుల్' అను ప్రయోగమును గూర్చి చర్చించుచు 'నోరన్ + కొలఁదుల్' అని వ్యస్తముగా గదా పై ప్రయోగమును గ్రహింపవలయును. నోరన్ అనఁగా నోటియందు. సరి. కొలఁదుల్ అనుమాట కే మర్థము? మిత మైనపలుకు లని తాత్పర్యమా? అప్పటికి 'పురికొల్పఁగ' అనుపదమునకు సార్థక మేమి? ....కనుకనే 'నోటికొలఁదుల్' అనురూపము యూనివర్సిటీముద్రణమందు పరిగ్రహింపబడినది. ...., కనుక నోటి కొలఁదుల్ అను సవరణకంటె 'నోరి కొలఁదుల్' అని యుండుట యుక్తతరము ... ...నా కేమో 'నోరి కొలఁదుల్' అను పాఠమే ఉచితతరముగా కాన్పించుచున్నది.' అని వ్రాసిరి. 'నోరఁగొలఁదుల్' అను ప్రయోగమును వ్యస్తముగా గ్రహింపవలయునని నాయాశయము కాదు. సమస్తపదముగానే దాని గ్రహింపవలయునని నాతాత్పర్యముకూడ. "నోటికొలఁదు" లనుట నేటి రూపము. "నోరికొలఁదు" లనుట ప్రాచీనరూపమే కాఁగలదు. 'నోరికొలఁదు' లన్న యర్థములోనే నన్నిచోడుడు 'నోరగొలఁదు' లని యపూర్వప్రయోగము చేసినాఁడని నాయాశయము. అందుకే యాప్రయోగమును బోలినదే యయిన తాళ్లపాక చినతిరుమలాచార్యుని 'నోరఁబోఁడు' అను ప్రయోగమును సామ్యమునకు జూపితిని. 'నోరఁగొలఁదు' లనుట నన్నిచోడుని వింతప్రయోగమని స్థాపించుట కొకింత వివరింతును. 'ఎలజవ్వనంబున విలసనంబు' అను సమస్తపదములో నగాగమసిద్ధికై వ్యాకర్తలు ప్రత్యేకసూత్రమును విరచించిరి. ఎలజవ్వనముయొక్క విలసనమని విగ్రహము చేసికొని షష్ఠీతత్పురుష మను భావములో నందు నగాగమమును సాధింపవలయును గనుక "షష్ఠీసమాసంబులందు గొండొకచో నగాగమంబు చూపట్టెడి"నని బహుజనపల్లి సీతారామాచార్యులవారు సూత్రించిరి. అక్కడనే శ్రీ సీతారామాచార్యులవారు పొరబడిరని, మనలనెల్ల దప్పుదారిపట్టించిరని నాయభిప్రాయము. నేను జెప్పునది యేమనగా 'ఎలజవ్వనము నందలి విలసనము' అనుటకు ఎలజవ్వనంబునన్ + విలసనము—సమాసములో ద్రుతలోపము జరిగి ఎలజవ్వనంబున విలసనమయినది. కనుక దీని యపూర్వతను గుర్తించుట కుపలబ్ధవ్యాకరణములతో గాక—యార్వాచీన ప్రయోగములతో—వ్యవహారముతో గాక వేఱుదృష్టితో దీని జూడవలయునని నాయభిప్రాయము. ఎలజవ్వనంబున విలసనము అను ప్రయోగమెట్టిదో 'నోరఁగొలఁదు' లను ప్రయోగముగూడ నట్టిదే. అర్థము నోటికొలఁదు లనియే. "నోటికొలఁదు" లనుటకు ప్రాచీనరూపము

'నోరఁగొలఁకు' లని వాడుదురు. ఇక చినతిరుమలాచార్యుని 'నోరఁదోఁడు' అను ప్రయోగమును గుఱించి. వావిళ్లకడి 'ఓరఁదోఁడు' అని కొక నోరఁదోఁడు అనియే తోఁచుచున్నది. నన్నిచోఁడని 'నోరఁగొలఁకులు' కది సజాతీయమని నా యభిప్రాయము. అర్థవివరణము నాకును శక్తిగాలేదు. నోటికివచ్చినట్లు అనుటకు 'నోటి తోఁడుగా' అనెడివారేమో తెలియదు. ఆనోటితోఁడు నకు ప్రాచీనరూపమే నోరఁదోఁడు. ఆయభిప్రాయముతోనే యందలి తోఁడులోని యరసున్నను బరిహరించితిని.

మఱియు నాపద్యమును గూర్చిన చర్చలోనే 'చీకు లావుకం ద్రొక్కినయట్లు' అను సామెతయు నాపాలికి టీకాసాపేక్షమే—లావుక అనఁగా ఏ పక్షియో, గ్రుడ్డివాఁడు దాని నేల త్రొక్కవలెనో, త్రొక్కిన నేమగునో, దీనివలన మనము గ్రహింపవలసిన సామాన్య న్యాయ మేదో నే నెఱుఁగను'—అని వ్రాసిరి. లావుక యనఁగా ఏ పక్షియో నేనును ఎఱుఁగను. శబ్దరత్నాకరములో లావుక—వై. వి. ఒకానొక పక్షియని 'కెరలి నెమ్ములు సేయు కేకార వమ్ములు, లావుక లెత్తు నీలలరవాళి' చంద్రా. 2 ఆ. అను ప్రయోగము ప్రమాణముగా జూపఁబడి యున్నది. ఈ ప్రయోగమును బట్టి నెమలికేకవలె లావుక యూల ప్రసిద్ధమని తెలియుచున్నది. కుమారసంభవమునందే ప్రథమాశ్వాసమున నొకచోట సతీ పరమేశ్వరుల విహారము నభివర్ణించు పట్టున 'కేకికల ధ్వానగిరి కందరంబుల, లావుకనినదలీలాతలములు' నని లావుక పక్షియు, దాని నినాదమును బ్రస్తావింపఁబడి యున్నది. యూనివర్సిటీవారి ముద్రణములో లఘుటిప్పణియందీ సందర్భమున 'చీకు లావుకం ద్రొక్కినయట్లు - అంధ లావుక న్యాయము. ఈ భావము కన్నడకవుల ననుసరించినదే. కురుడం లావుగెయ్యం మెట్టిదంతె. క. జీవసంబోధిని' అని యొకింత వివరింపఁబడి యున్నది. దీనిఁబట్టి యీ న్యాయము ప్రాచీనమైనదే యని తెలియుచున్నది. గ్రుడ్డివాని చేతిరాయి యను జాతీయమును బోలిన దీన్యాయము. యాదృచ్ఛికమని భావము. గ్రుడ్డివాని చేతిరాయి తగిలిన తగులును. లేకున్న లేదు. రాయి తగిలి పండు రాలినంత మాత్రమున గ్రుడ్డివానికి చక్కని గురి, లక్ష్య జ్ఞానము ఉన్నదని చెప్పఁజాలము కదా! శ్రీ అనంతకృష్ణశర్మగారు 'గ్రుడ్డివాఁడు దాని నేల త్రొక్కవలెనో? త్రొక్కిన నేమగునో' యని ప్రశ్నించిరి. గ్రుడ్డివాని చేతిరాయి—అనునప్పుడు గ్రుడ్డివాఁడు రాతి నేల విసరవలెను? అని మనము ప్రశ్నింపము కదా! ఇచట భావార్థము మాత్రమే ప్రధానము. గ్రుడ్డివాఁడు—అతనికి గన్నులు తెలియవు. లావుక పక్షి యాకాశమున కెగురునదైనను సకృత్తుగా నేలపై వ్రాలునను కొందము. దాని యూల విని గ్రుడ్డివాఁడు పట్టఁదలచినను నది యతనికి సాధ్యముకాదు. అట్టిచో నాతఁడది నేలపై వ్రాలి యుండినపుడు దానిని దనకే తెలియక యదాటుగా త్రొక్కుటతటస్థించినచో నది యాదృచ్ఛికమే కదా! అంత మాత్రమున గ్రుడ్డివానికి లావుకను ద్రొక్కఁగల పాటి శక్తి కలదని మనము నిర్ధరింపఁజాలము కదా! అట్లే కుకవి నోటికి వచ్చినట్లు పలికిన పలుకులలో నేవో కొన్ని చక్కఁగా నున్నంత మాత్రమున నాకవికిఁ గవితా సామర్థ్యము కలదని కాని యతనికృతి సత్కృతి యని కాని చెప్పఁజాలము కదా! దీనివలన మనము గ్రహింప దగిన సామాన్య న్యాయమిట్టి దని నాయభిప్రాయము.

'వారణ నేయ' అన్న పద్యమును గూర్చి యొకటి రెండు మాటలు వ్రాసి ముగింతును. శ్రీ అనంతకృష్ణశర్మ గారు మూలమునకు శ్రీనాథుడు చేసిన యనువాదమును గూర్చి, యా పద్యములు గూర్చి వారు చేసిన చర్చలో బ్రస్తావింతురేమోయని యూహించితి. కాని వారు వివరమునకుఁ బోక 'శ్రీనాథుని తెలిగింపు స్వతంత్రమే కాని మూలమునకు పరవశము కాదనుట విస్పష్ట విషయమే' యని సూచించి వదలిపెట్టిరి. శ్రీ బులుసు వెంకటరమణయ్య గారు మూల శ్లోకమునకు ధ్వన్యాలోకములోఁ దెలుపఁ బడిన ధ్వన్యర్థముల నెల్ల మిక్కిలి వివరముగాఁ దెలిపిరి. అట్లు పలువురికిఁ బలు అర్థములను ధ్వనింపఁ జేసిన యాశ్లోకమునకు శ్రీనాథుఁడు చేసిన తెలిఁగింపులో ప్రకరణము మారుటబట్టి యావ్యంగ్యార్థము లన్నియు స్ఫురించు చున్నవాయని నా యనుమానము. మూలశ్లోకములో లేని 'నీ విభుం డారసి నీ నిజం బెఱుగునంతకు నంతకు నోర్వ నెచ్చెలీ!' యనుటతోఁ బద్యమును, భావమును గూడ మఱికొంత సాగఁదీయుటవలన మూలశ్లోకము వలన స్ఫురింపదగు వ్యంగ్యార్థము లెల్ల సమసిపోయినవని నా యభిప్రాయము. శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు గారు మూలశ్లోకమును శ్రీనాథుడు మిక్కిలి మనోహరముగాఁ దెలిగించెనని ప్రశంసించిరి. పద్యము మిక్కిలి మనోహరమయిన దనుట కెట్టి సందియమును లేదు. కాని యది మూల విధేయమయిన యనువాదమేనా యని చూచినప్పుడు కాదని, మూలములోని వ్యంగ్యార్థావగతి యిందు సమసిన దని యంగీకరింపక తప్పదు.

# రంగుటద్దాలు

శ్రీ 'వాచస్పతి'

డియర్ పద్మా!

నీ ఉత్తరం వ్రాసి యిప్పటికి సరిగ్గా సంవత్సరం పైగా అయిందను కుంటాను. నీ పెళ్ళికి రమ్మని రాశావు. రాలేనంటూ ఉత్తరం రాశాను కదూ? తర్వాత ఎన్నోసార్లు నీకు ఉత్తరం వ్రాయాలను కున్నాను. కానీ రాయడం పడలేదు. పద్మా! నీకు గుర్తుందో లేదో మన పరిచయమైన తొలి రోజుల్లో "నీ కళ్ళెప్పుడూ కలలు గంటూ ఎక్కడికో తేలిపోతుంటాయి రుక్కూ!" అన్నావు. గుర్తుందా? ఆ రోజు నేనిచ్చిన జవాబేమిటి? 'నా ఆశల విమానాల్లో - నా ఆశయ సౌధాల్లోకి తేలిపోతుంటాయి!' అన్నాను. కదూ? ఈరోజు నా ఆశల విమానాలను తుపాకుల్తో నిర్దయగా కాల్చేశారు. నా ఆశయ సౌధాలు నాఅందు బాటులో లేవు. ఈరోజు నాకళ్ళల్లో నీవు చూసిన కలలు లేవు పద్మా? బహుశః ఈ రోజు నన్ను చూసినా నువ్వు గుర్తుపట్టలేవేమో! ప్రపంచంలోని నిరాశా-నిలం నన్ను దహించి వేస్తుంది. నా ఎమ్. ఎ, ఎమ్ ఇడి డిగ్రీ మాటమాటికీ గుర్తుకొచ్చి నన్ను వెక్కిరిస్తుంది. ఈ విశాలప్రపంచంలో ఎంత వెతికి చూసినా నన్ను సానుభూతితో అర్థం చేసుకోగల స్నేహితురాలవు నువ్వొక్కదానివే కనిపిస్తున్నావు. శుక్రవారం మెయిల్లో వస్తున్నాను. స్టేషను కొస్తావుగదూ?

నీ

'రుక్కు'

ఉత్తరం మడిచి టేబిలుమీద పెట్టి బరువుగా నిట్టూర్చాను. నాకు తెలియకుండానే కళ్ళు చెమర్చాయి. రుక్కు సుందర విగ్రహం, కలలు గనే కళ్ళు కళ్ళముందు మెదిలాయి. "ఎక్కణ్ణుంచి ఉత్తరం?" అప్పుడే హాల్లోకొచ్చిన అక్కయ్య అడిగింది.

"రుక్మిణి దగ్గరినుంచి"

"ఏ రుక్మిణి? నీ రుక్కా?" అక్కయ్య కళ్ళు నవ్వు తున్నాయి.

"ఊ......"

"ఏమిటి విశేషాలు?"

నా కెదురు కుర్చీలో కూర్చుంటూ అడిగింది అక్కయ్య.

"చెప్పను! నా చేతకాదు! చదువుకో"

అక్కయ్య ఓ నిముషంలో జాబు చదివి టేబిలు మీద పడేస్తూ సన్నగా నవ్వింది.

"ఎందుకూ?" కనుబొమలు ముడిచి అక్కయ్య కేసి చూస్తూ విసుగ్గా అన్నాను.

"యీ మధ్య చదువుకున్న వాళ్ళకంతా యిదో జబ్బు పట్టుకుంటుంది! దీనికి మరో మందు లేదు. త్వరగా పెళ్ళి చేసుకోడమే!" క్రీగంట నావైపు చూస్తూ అంది అక్కయ్య.

"రమా!" బాధగా అన్నాను.

"ఏమిటో కానీండి!" రమ పెద్దగా నవ్వింది.

"రుక్మిణిని తప్పుగా అర్థంచేసుకొన్నావు."

"బి. ఎ లో నా మెయినేమిటో తెలుసా?" మోచేతుల్లో గడ్డం పెట్టుకుని నాకేసి చురుగ్గా చూస్తూ అంది రమ.

నేను నవ్వాను.

"నువ్వు నవ్వినా నాకేం చిన్నతనంలేదు. ఇంతెందుకు రేపుసాయంత్రానికల్లా రుక్మిణివస్తుంది. రుక్మిణి నోటిగుండానే చెప్పిస్తాను!"

బల్ల గుద్ది అంది అక్కయ్య.

"ఏమని?"

యిదంతా భగ్నప్రేమ తాలూకు నిరాశని!"

అంతబాధలోను నాకు నవ్వొచ్చింది,

"సరే! అలాగే చెప్పిస్తువుగాన్లే!"

"మీ శ్రీవారుగాబోలు పిలుస్తున్నట్లుంది!"

ఉత్తరంతీసి డ్రాయర్లో పెట్టి మేడమీద కెళ్ళాను.

## 2

ప్లాట్‌ఫామ్ టిక్కట్టుకొని లోపలికెళ్ళగానే ట్రెయిను అరగంట లేటని అనుకుంటున్నారు ప్రయా-

జీవులు. ఏమీతోచక యింగ్లీషు పత్రికొకటికొని తిర గేయ్యసాగాను. రుక్మిణి కథొకటుంది. చదువుకొనే రోజుల్లో రుక్మిణి కథలు రాస్తుండేది. తెలుగులోకన్నా యింగ్లీషులో వ్రాసేందుకు రుక్మిణి ఎక్కువ యిష్ట పడేది. రెండు మూడు యింగ్లీషు కథలు అచ్చయ్యాయి. అయితే ఆకథల్లో రుక్మిణికలలే ఎక్కువగా కనిపిస్తుం డేవి. పుస్తకం తీసుకుని లేడీస్ వెయిటింగ్ రూంలోకి వెళ్ళి కథ చదవడం పూర్తి చేశాను. నన్నెక్కువ ఆశ్చర్య పరిచింది ఆరోజు రుక్మిణికన్న కలలు. ఆశయాలు, అనన్యమైన రుక్మిణి ఆశావాదము యీ కథలో కూడా కనిపించదేమీ!

ప్రపంచంలోని నిరాశంతా తనకు దహించి వేస్తుందన్న రుక్మిణేనా యిది రాసింది?

పోటిలేని తన ఆశావాదంతో నూతనోత్సా హాన్నిస్తున్న రుక్మిణి నిరాశా నిస్పృహాల్లో ములమల మాడిపోవలసిందేనా? ఎందుకు రుక్మిణి ఇలాగ మారింది? అక్కయ్యన్నట్లు భగ్న ప్రేమ కాదుగదా? గుండె దడదడ కొట్టుకుంది. దూరంలో ఎక్కడో రైలు కూత కూసింది.

పుస్తకం చేత్తో పటుకుని ప్లాట్‌ఫాంమీద కొచ్చాను.

రెండు నిముషాల్లో రైలువచ్చి ప్లాట్‌ఫాంమీద ఆగింది.

నా కళ్ళు ఆత్రంగా రుక్మిణికోసం వెతికాయి.

“పద్మా!”

ముందుకు చూశాను. సెకండ్‌క్లాస్ కంపార్ట్ మెంటు దిగి సూట్ కేసుతో నిలుచున్నది రుక్మిణి. సంతోషంతో రుక్మిణి వైపుగా నడిచాను. ఎంత మార్పు! ఒడ్డాలేసుకోవడంవల్ల మనిషి పూర్తిగా మారి నట్లు కనిపించింది నాకు.

“చాలా మారిపోయావు రుక్కూ!”

రుక్మిణి చేతిని నా చేతిలోకి ఆప్యాయంగా తీసు కుంటూ అన్నాను.

“నీ కన్నానా?”

“నే మారానా? కాస్త లావెక్కావనుకో!”

“నేనూ కాస్త చిక్కాననుకో!”

యిద్దరం నవ్వాము.

“ఏమిటి విశేషాలు? ఆ వుత్తరమేమిటి? హడలి పోయాను సుమా?”

రుక్మిణి ఓ క్షణం నాకేసి చూసి చూపు ఇంకొకవైపు తిప్పుకుంది.

రుక్మిణి చెప్పింది నిజం! కలల్లో తేలిపోతున్న ఆ కళ్ళు ఇప్పుడు బాధతో బరువుతో వాలిపోతున్నాయి. పచ్చని ఒంటిరంగు కొంచెం నలుపు తిరిగింది. నల్లని జుట్టులో అక్కడొకటి అక్కడొకటి తెల్లని వెంట్రుక కనిపిస్తుంది.

“ఏమిటలా చూస్తావ్? మింగేస్తావా?” నేను నవ్వి బయటకు దారితీశాను. వాకిట్లోనే చిరునవ్వుతో స్వాగతం చెప్పింది అక్కయ్య.

“చాలా మారావు సుమా!”

కాఫీ కప్పులు టేబిలుమీద పెడ్తూ అంది అక్కయ్య.

“మార్పు సహజమే గదండీ!”

హేలగా నవ్వి అంది రుక్మిణి.

రుక్మిణి కంఠంలోని బాధలసుడులు నా గుండెల్ని బ్రద్దలు చేశాయి.

“ముందు కాఫీ తీసుకో రుక్కూ! తర్వాత మాట్లాడుకోవచ్చు”

కాఫీ కప్పు చేతిలోకి తీసుకుంటూ అన్నాను. అక్కయ్య నే తెచ్చిన పత్రిక తిరిగేస్తూ రుక్మిణిని పరీక్షగా చూసింది. ఆ నఖశిఖ పరీక్షకు రుక్మిణి కాస్త విసుక్కున్నట్టే కనిపించింది.

“రమా! రేపటినించి ఓ అరకప్పు కాఫీలో ఓ అరకప్పు ‘ఆశావాదాన్ని’ కలిపి యిస్తుండు! లేకుంటె రుక్మిణి యిప్పుడిప్పుడే కోలుకొనేటట్లు కని పించడంలేదు!” అక్కయ్యదృష్టిని నావైపు తిప్పు కొనేందుగ్గాను అన్నాను,

అక్కయ్య నవ్వి తలూపింది.

“పాపం! ఎన్నాళ్ళకో కలుసుకున్నారు ప్రాణ స్నేహితులు! మాట్లాడుకోండి! వంట ఎంతవర కయిందో చూసొస్తా” అంటూ లోపలికెళ్ళింది.

“రుక్కూ!”

“ఊఁ...”

“చూడు. ఎమ్. ఏ. ఎమ్. ఇడి. పూర్తిచేశావు. ప్రిన్సిపాల్‌గా పని చేస్తున్నావు. నలుగురు యీర్ష్య చెందేటటువంటి స్థానంలో యీరోజున్నావు. ప్రపంచం లోని నిరాశంతా నిన్ను దహించి వెయ్యవలసినంత

అవసరమేమొచ్చింది రుక్కూ?" పాలిపోయిన రుక్మిణి ముఖంకేసి చూస్తూ అన్నాను.

"నా నిరాశా నిస్పృహలకు జీవిత వైరాగ్యానికి కారణాలు చెప్పమంటే నా చేత కాదు పద్మా! బహుశః నా చదువే ఇందుకు కారణమేమో!"

కిటికీలోనుండి ఎటో సుదూర లోకాల్లోనికి చూస్తూ అంది రుక్మిణి.

నేను గతుక్కుమన్నాను.

వాకిట్లో బూట్లు చప్పుడయింది.

"మా శ్రీవారు రుక్కూ!"

"నమస్తే!"

"ఈవిడ తెలుసుగా?"

"తెలీక పోవడమేంటి? నీ డియరెస్టు ఫ్రెండ్! రుక్మిణి గారు... కాలేజీలో ప్రిన్సిపాల్ గా పని చేస్తున్నారు. ప్రయాణం కులాసాగా సాగిందాండీ!" నవ్వుతూ రుక్మిణివైపు చూసి అన్నారు.

రుక్మిణి తలూపింది.

నాకు నవ్వొచ్చింది.

"మీ కథలు రెండు మూడు చదివాను. ఇంకొంత పరిశ్రమ చేస్తే కథారచయిత్రిగా బాగా రాణించగలరు."

బూట్లు విప్పుకుంటూ అన్నారాయన.

"శ్రమ పడాలని లేదు." నిరాశా గానం రుక్మిణి కంఠంలోనుండి లీలగా వినిపించింది. ఆయన తలెత్తి ఆశ్చర్యంగా రుక్మిణి ముఖంలోకి చూసి మళ్ళీ బూట్లు విప్పుకోసాగారు.

లోపలికెళ్ళి కాఫీ తెచ్చి టేబిలుమీద పెట్టాను.

కాఫీ త్రాగి బాత్ తీసుకొని ఓ గంటలో వస్తానంటూ బైటకెళ్ళారు.

అక్కయ్యవచ్చి రుక్మిణి కెదురుగా కుర్చీలో కూర్చుంది.

తన అర్థంలేని ప్రశ్నలతో రుక్మిణి మనసును బాధ పెడుతుందేమోనని నా గుండె దడదడలాడుతూంది. "ఏం మాట్లాడాలో - ఎలా మాట్లాడాలో తెలీక కొండల్లోకి వెళ్తున్న సూర్యునివైపు చూస్తూ కిటికీదగ్గరే నిల్చున్నాను.

కూనిరాగం తీసుకుంటూ రత్తి లోపలికొచ్చి - ఒళ్ళోవున్న సన్నజాజిపూలు టేబిలుమీద గుమ్మరించింది.

"ఇంత ఆలస్యమైందేం? యిప్పటిదాకా ఏం చేస్తున్నావ్?" అక్కయ్య గద్దించింది.

"రికార్డులు పెడుతుంటే వింటున్నాను. కొత్త కొత్త పాటలు! మొన్న మనం వెళ్ళేదమ్మగోరూ!.. కొత్తసినిమా..." రత్తి ఉత్సాహంతో చెప్పుకు పోతూంది.

"చాల్లే! కాఫీగ్లాసులు వేసున్నాయి. వెళ్ళు తోము."

రత్తి తమాషాగా నవ్వుకుంటూ లోపలికి పరిగెత్తింది.

"రత్తిని చూస్తుంటే నాకు అసూయ కలుగుతూంది. ఎంత సంతోషంగా వుంది!"

బరువుగా నిట్టూర్చి అంది రుక్మిణి.

"నిన్నుమటుకు అంత సంతోషంగా వద్దంటున్నారా?"

అక్కయ్య నవ్వుతూ అంది.

"ఎలావుంటాను? తెచ్చి పెట్టుకున్న సంతోషం ఎంతసేపుంటుంది?"

నేను మెల్లిగావెళ్ళి రుక్మిణిప్రక్కగా కూర్చున్నాను. అక్కయ్య దారంతెచ్చి పూలు అల్లుతూంది. రుక్మిణి ఫ్లవర్ వాజ్ వేపు పరిశీలనగా చూస్తూంది.

"పిచ్చిపిచ్చి వూహాల్తో మనసు పాడుచేసుకోకు రుక్కూ!" రుక్మిణి చెయ్యి నాచేతిలోకి తీసుకొని ప్రార్థనాపూర్వకంగా అన్నాను.

రుక్మిణి అదో రకంగా నవ్వింది.

అక్కయ్య పూలు కట్టడం ఆపి రుక్మిణికేసి చూస్తూ—

"రుక్మిణీ! నేనొకమాట చెప్తాను. ఏమనుకోవు గదూ?" అంది.

"అనుకొనేదేముంది? చెప్పండి!"

"నీకు చెప్పేపాటిదాన్ని నేను కాననుకో! నాకు పద్మ ఎలాంటిదో నువ్వూ అలాంటిదానివే రుక్మిణీ! అందుకే చెప్పాలనిపిస్తుంది. చూడు-మనం చూసే సినిమాల్లాగ-చదివే నవల్లాగ-లేక నువ్వు రాసే కథల్లాగ నిత్యజీవితం వుండదు రుక్మిణీ!"

రుక్మిణి ఔనన్నట్లు తలూపింది.

"ప్రతివ్యక్తికీ కొన్ని ఆదర్శాలుంటాయి. కాదనను. అయితే ఎల్లకాలం నీ ఆశయ సౌధాల్లో కలలుగంటూ గడపలేవు.

దురదృష్టవశాత్తూ భూమ్మీద నడవాలిసి వస్తుంది. నీ ఊహాలోకానికి-ఈ లోకానికి మధ్యనున్న అఘాతం లాంటి భేదం నగ్నంగా కళ్ళముందు కనబడగానే గిజగిజ లాడతావు. ప్రత్యేకంగా కవితాహృదయం కల్గిన నీ బాధ వర్ణనాతీతం! నువ్వెంత బాధపడుతున్నావో నాకు తెలుసు రుక్మిణీ!"

అక్కయ్య ఆగి రుక్మిణి ముఖవైఖరిని గమనించసాగింది. తలవంచుకుని పొడవాటి వ్రేళ్ళతో టేబిలుమీద పిచ్చిగీతలు గీస్తున్న రుక్మిణి అక్కయ్య మాట్లాడ్డం ఆపగానే తలెత్తిచూసి-

"ఊ...కానీండి!" అని మళ్ళీ తన పనిలో మునిగిపోయింది. అక్కయ్య నావైపు చూసింది పూర్తిచెయ్యనా అన్నట్టుగా. నేను అంగీకార సూచనగా తలూపాను.

"ఇంట్లో ఎలుకలున్నాయని యింటికి నిప్పు పెట్టుకుంటామా రుక్మిణీ! నీ ఆదర్శ పూరితమైన ఊహాలోకానికీ జీవితానికి పోలికేలేదని జీవించడమే మానుకోవడం అవివేకంకాదూ? నువ్వు కన్నకలలు కరిగిపోయి వుండవచ్చు. నీ ఆశయసౌధాలు కూలిపోయి ఉండవచ్చు. మళ్ళీ వినూత్న ఆశయ సౌధాలు కట్టుకో..."

"నాలో యింక శక్తిలేదు" తలొంచుకునే గొణిగింది రుక్మిణి.

"రుక్కూ! ఏం మాటలవి" నెమ్మదిగా మందలించాను.

"అవును పద్మా! ఈ రోజు నేను బ్రతుకుతున్నానంటే అది అమ్మకోసమే! జీవితంమీద మోజు ఏరోజో తీరిపోయింది" బాధగా అంది రుక్మిణి.

"నీ ఆశలకు, ఆశయాలకు అనుగుణంగా జీవితాన్ని మార్చుకోనేందుకు ప్రయత్నించాలిగానీ."

"అదీ అయింది" నిట్టూర్చి అంది రుక్మిణి.

"రోడ్డంతా గతుకులమయమని ప్రయాణం మానుకుంటామా? ఎన్నో కష్టనష్టాల కోర్చి ప్రయాణం సాగిస్తేనే ఊరు చేరుకొంటాము. రోడ్డు బాగాలేదని అక్కడే కూర్చోవడం పిరికిపందల లక్షణం. నువ్వు హృదయాన్నిచ్చినా కఠినాత్ముడెవడో నిరాకరించి వుండవచ్చు! అంతేనా?"

"లేదు లేదు. అలాంటి తెలివితక్కువ పని నేను చెయ్యలేదు" విసురుగా తలెత్తి అంది రుక్మిణి.

నేను అక్కయ్యవైపు సగర్వంగా చూశాను. తొందరెందుకూ కాసేపు ఆగు అన్నట్లు చూసింది అక్కయ్య.

"బహుశః నువ్వు ఊహించుకొన్న నీ కథానాయకుడు ఈ లోకంలో లేకపోవచ్చు....."

"అంటే?" రుక్మిణిగొంతు తీవ్రంగా వుంది.

నేను కంగారుగా అక్కయ్య ముఖంలోకి చూశాను.

"అంటే ఏంలేదు. సద్గుణసంపన్నుడు కవి, చిత్రకారుడు, గాయకుడు, యింకా యింకా...అంటే మానవలక్షణాలు లేకుండా ఏ దేవతావరప్రసాదమో అయినట్టి వాడు తరచుగా మనకు కనిపించడు"

"ఊ......అయితే?"

రుక్మిణి పిచ్చిగీతలు గియ్యడం మానేసి అక్కయ్య కేసి ప్రశ్నార్థకంగా చూసింది.

"అంటే నీకథల్లోలాంటి కథానాయకుడు కనిపించక, కనిపించినా అందుబాటులో లేక......"

"పొరపడ్డారని చెప్పేందుకు విచారిస్తున్నాను"

రుక్మిణిగొంతులో కాఠిన్యం కదలాడింది.

"కాదు రుక్కూ! నువ్వు కలలుగన్నంతటి మంచితనం ఈ లోకంలో లేకపోవచ్చు. అలాగని జీవన కుసుమాన్ని చేజేతులా నలిపేసుకుంటారా? చదువుకొనే రోజుల్లో అబ్బ! ఎంత చురుగ్గా చలాకీగా తిరుగుతుండేదానివి! అప్పుడు జీవన ప్రవాహమే నీరూపంలో సాక్షాత్కరించిందేమో ననుకునేదాన్ని!"

బాధగా అన్నాను.

"ఆరోజులు వేరు పద్మా! నా ఆశయాల కోసమే బ్రతుకుతుండేదాన్ని. పెద్దపెద్ద చదువులు చదివి డిగ్రీలు తీసుకోవాలనీ, లోకాన్నంతా మరమ్మత్తు చేయాలనీ, ఏమో ఏమో అ యి పో వా ల ని -ఏవిటో పి చ్చి పి చ్చి ఆ లో చ న లు...... నా ఆలోచనలకు నాకే నవ్వొచ్చేది...స్వచ్ఛమైన ఆనందాన్ని ఇవ్వలేని ఈ డిగ్రీలు ఎందుకు పద్మా? చెప్తే నమ్మవుగానీ—ఈ రోజు నేను బాధపడేది విచారించేది ఒకే ఒక విషయానికి! ఎందుకు చదువుకున్నానా అని! ఒక్కొక్క డిగ్రి ఎక్కేకొద్దీ అర్థంగాని మనుషులతో, తీరని సమస్యలతో, అందుకోలేని ఆదర్శాలతో జీవితం దుస్తరమై పోతుంది. నేనూ రత్తి

లాగ వుంటే!...అబ్బ!...ఎందుకు పుట్టాం? మన జీవనగమ్యమేమిటి? మృత్యువెందుకొస్తుంది? విరుద్ధమైన జీవనగమ్యాలను నిర్ణయించడంలో భగవంతుని ఉద్దేశ్యమేంటి? అసలు భగవంతుడున్నాడా? వుంటే ఎక్కడుంటాడు? ఎలా వుంటాడు? మనక్కనిపిస్తాడా? ఇలా మనల్ని కీలుబొమ్మల్ని చేసి ఆడించడంలో అతని కానందం కల్గుతుందా?—ఇలాంటి అర్థంలేని ప్రశ్నలు రత్తి నే రోజన్నా బాధిస్తాయా పద్మా?"

రుక్మిణి సజలనయనాలు బాధతో గిలగిల లాడుతున్నాయి.

"రత్తినే కాదు రుక్మిణీ! అలాంటి అర్థంలేని ప్రశ్నలు నన్నుగూడా బాధించవు. ఇంకా చెప్పాలంటే పద్మను గూడా బాధించవేమో! జీవన ప్రవాహంలో మునిగితేలే మాకు అలాంటి అర్థంలేని వ్యర్థ ప్రశ్నలను, సమస్యలను గురించి ఆలోచించేటందుకు సమయమేదీ? నా నలుగురి పిల్లల్ని గురించి ఆలోచించనే నాకు సరిగ్గా సమయంలేదు" సన్నగా నవ్వుతూ అంది అక్కయ్య. అక్కయ్య వేళ్ళు చకచకా పూలదండ అల్లేస్తున్నాయి.

రుక్మిణి కిటికీలోనుండి దూరంగావున్న కొండల వైపు చూస్తూంది. బహుశః అక్కయ్య చెప్పిన మాటల్లోని సత్యాన్ని గురించి ఆలోచిస్తూందేమో. అదే మంచి తరుణమని నేను గొంతు సవరించుకొన్నాను.

"అవును రుక్కూ! అక్కయ్య చెప్పింది ఒక విధంగా నిజమే ననిపిస్తుంది. ఏదో ఒక లక్ష్యాన్ని పెట్టుకో! అప్పుడు జీవితంలో ఇంత నిరాశ వుండదు. ఆ గమ్యాన్ని చేరుకొనే పోరాటంలో నిరాశా నిస్పృహలకంతగా తావుండదేమో."

రుక్మిణి నావైపు ప్రశ్నార్థకంగా చూసింది.

"పెద్దదాన్నో చిన్నదాన్నో చెబుతాను. నా మాటవిని పెళ్ళి చేసుకో! అప్పుడు భర్త, బిడ్డలు, సంసారం, అన్న తాపత్రయం ఏర్పడుతుంది. ఇలాంటి పిచ్చి ఆలోచనలకు నీకు తీరికేవుండదు."

అక్కయ్య రుక్మిణి ముఖంలోకి చూస్తూ అంది.

"నన్ను మీరెవ్వరూ అర్థంచేసుకోలేరు" గద్గద కంఠంతో అంది రుక్మిణి.

"పోనీ రుక్కూ! గొప్ప రచయిత్రివి కావాలని నీ లక్ష్యంగా ఎందుకు పెట్టుకోరాదు?"

"రచయిత్రినా? ఎందుకు? దానివల్ల లాభమేమిటి?"

దానికేం జవాబు చెప్పను? ఓ నిముషంసేపు నాలుగ్గోడల వంకా చూశాను జవాబు తోచక!

"ఎందుకేమిటి? అందరు ఎందుకు రాస్తారు?" జవాబు చెప్పడం చేతగాక ఎదురు ప్రశ్న వేశాను.

"అందరి సంగతి అటుంచు - నా రచనలవల్ల వీళ్ళేమన్నా మార్తారా? ఎందుకు లేని పోని ప్రయాస పద్మా?"

"అదే వద్దన్నది. మారరని ఎందుకనుకోవాలి? పోనీ వాళ్ళు మారకున్నా తాత్కాలికంగానన్నా ఆనందాన్నిస్తున్నావుకదా" చిరుకోపంతో అంది అక్కయ్య.

"అర్థం పర్థంలేని ఆ క్షణికానందాన్ని ఇచ్చేందుకు నా జీవితాన్ని బలిగా ఇవ్వాలా? ఇంతకు మునుపంటే లేని వుత్సాహాన్ని తెచ్చుకుని ఏవో పిచ్చి గీతలు గిలుకుతుండేదాన్ని. ఇంక రాయదలచుకోలేదు" మోచేతుల్లో తలను దాచుకుని బరువుగా అంది రుక్మిణి.

"పోనీ అర్థం కలదాన్ని - నీ కానందాన్నిచ్చే మరో లక్ష్యాన్ని ఎన్నుకో రుక్కూ!" ఆశగా రుక్మిణి కళ్ళల్లోకి చూస్తూ అన్నాను.

"ఏముంది? అంతా మిథ్య! దేనికోసం ఇంక నేను ప్రాకులాడలేను పద్మా!" చీకటి తెరలు క్రమ్ముకొంటున్నాయి. నేను లేచి లైటు వేశాను.

అక్కయ్య జాజిదండ కట్టడం పూర్తి చేసి మూడు మాలలుగా చేసి నాకొకటి రుక్మిణికొకటి ఇచ్చి తనొకటి తీసుకుంది.

రత్తి అంట్లు తోమడం పూర్తిచేసి కూనిరాగం తీసుకుంటూ హాల్లోకొచ్చింది.

"వెళ్ళొస్తానమ్మగోరూ!" అంది మా ముగ్గురి వైపు చూస్తూ.

"రత్తీ! ఇలా రా!" రుక్మిణి పిల్చింది.

రత్తి టేబిలు దగ్గరగా వచ్చింది.

"ఈ పూలు పెట్టుకో."

"నేనిస్తా నువ్వు పెట్టుకో రుక్మిణీ!" అంది అక్కయ్య.

"కాదు. ఇవి రత్తి తల్లో వుంటే, రత్తి లాగ కిలకిల నవ్వుతాయి. పెట్టుకో రత్తీ!"

రత్తి నావైపు చూసింది.

"తీసుకో" నవ్వుతూ అన్నాను.

రత్తి పూలు తీసుకుని ఛంగున లేడి పిల్లలా పారిపోయింది!

రుక్మిణి కన్నార్పకుండా రత్తిపోయినవైపే చూస్తూంది.

"సంతోషంగా వుండాలన్నా పెట్టిపుట్టాలి పద్మా! కాదంటావా?" సాలోచనగా అంది రుక్మిణి.

నే తలూపకుండా వుండలేకపోయాను.

## 3

ఓ వారం రోజులు గడిచిపోయాయి. అక్కయ్య ఎనలేని వుత్సాహం గానీ, నా నిరంతర బోధనలు గానీ రుక్మిణిని పీసమంతయినా మార్చలేకపోయాయి. రుక్మిణి పరధ్యానాన్ని మగోవిధంగా భావించి వారప్పుడప్పుడూ తమాషాగా విసున్నా అన్నా, రుక్మిణి ఏం పట్టించుకునేది గాదు. సన్నగా నవ్వి ఎటో చూస్తూ వుండిపోయేది. రుక్మిణి యింక మారదేమోనన్న ఆలోచన కలగగానే—నిలువెల్లా కంపించి పోయేదాన్ని.

ఓరోజు మధ్యాహ్నం కాఫీ తీసుకొనే సమయంలో రుక్మిణికి టెలిగ్రామొచ్చింది.

"మదర్ సీరియస్! స్టార్ట్ యిమీడియేట్ లీ" అని వుంది.

"వెళ్ళాలి" కన్నీటి పొరగుండా నావైపు చూసి అంది.

"ఇప్పుడెలా వెళ్తావ్? ఏ బండీ లేదే" ఆత్రంగా అన్నాను.

"వేకువన నాలుగ్గంటల కో బండి వుంది. దాని కెళ్ళాల్సిందే" అంది అక్కయ్య.

"బయల్దేరేటప్పుడు అమ్మ కేమన్నా జబ్బుగా వుందా?"

"లేదు. అప్పుడప్పుడూ గుండెనొప్పి అంటుంది"

గదిలోకి వెళ్ళి తన బట్టలన్నీ సర్దుకుని బయల్దేరింది.

"రుక్కూ! ఏమిటది? ఇప్పుడెలా వెళ్తావ్? ఏ బండీ లేదు" వచ్చే ఏడ్పును మింగి అన్నాను.

"అలాగా" రుక్మిణిచూపులుపిచ్చిగా వున్నాయి.

అక్కయ్య చిత్రంగా వాకేసి కళ్ళల్లోకిచూసింది.

"ఉదయం ఇద్దరం వెళ్దాం. నేనూ వస్తాగా" అతి కష్టంమీద రుక్మిణి నెలాగో ఆప గలిగాను.

ఏ అపరరాత్రో, సూట్ కేసు చేతబట్టుకొని వెళ్తుందేమోనని ఆ రాత్రంతా రుక్మిణికి కాపలా కాశాను. ఎంతసేపు బతిమాలినా పండుకోలేదు. ఆకాశంలోని నక్షత్రాలవంక చూస్తూ కిటికీదగ్గర నిల్చుంది.

ఆ రాత్రంతా ఇద్దరం జాగరం చేశాం. అక్కయ్య వద్దనడంచేత నేను రుక్మిణితో వెళ్ళలేకపోయాను.

రావడం లేదేమని రుక్మిణి అడగనూ లేదు.

ఇద్దరం కలిసి స్టేషను కెళ్ళాము.

"వెళ్ళగానే అమ్మ కెలా వుండేది జాబురాయి" అన్నాను. రైలుకూతలో రుక్మిణి జవాబు వినిపించలేదు.

రుక్మిణిని తీసుకొని రైలు మెల్లిగా కదిలిపోయింది.

## 4

రుక్మిణి వెళ్ళి నెలరోజు లయిపోయింది. ప్రతి రోజూ రుక్మిణి దగ్గర్నించి జాబుకోసం ఎదురు చూస్తాపే! జాబు వ్రాసేవిషయంలో రుక్మిణి ఎంత సోమరో తెలిసినా జాబుకోసం ఎదురు చూడకుండా వుండలేకపోయాను. పోస్టుమన్ వుత్తరం లేదని చెప్తే అతనిమీద కలిగే కోపం అంతా యింతా కాదు! ఓ అరగంటసేపు కుర్చీలో కూర్చుని ఆ కోపాన్నంతా మెల్లిగా రుక్మిణిమీదకు మళ్ళించేదాన్ని! నేను చిరాగ్గా వుండడంచూసి అక్కయ్య నవ్వుకునేది. ఇక రుక్మిణి దగ్గరనుండి వుత్తరంరాదని ఆశ నిరాశ చేసుకొన్నాను. తర్వాత పదిరోజులకు ఓ రోజు నే నతన్ని అడక్కపోయినా పోస్టుమన్ వుత్తరంతెచ్చి నా చేతిలో పెట్టాడు. కవరుచింపి ఆత్రంగా జాబు చదివాను.

డియర్ పద్మా!

రాత్రి ఆకాశంలోని చుక్కల్ని లెక్క పెడుతుంటే ఎందుకనో చటుక్కున నువ్వు స్ఫురించావు. ఉదయాన్నే ఈ జాబు రాస్తున్నాను. అమ్మ ఈ లోకాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయింది పద్మా! కాగితం పువ్వులాంటి ఈ జీవితం నన్నాకర్షించలేకపోయింది. ఈ రోజు నేను బుద్ధగయలో వున్నానంటే నువ్వు ఆశ్చర్య పడవనుకుంటా పద్మా! జీవితంలో ప్రశాంతత

అంటే ఏమిటో నాకీ రోజు తెలుస్తూంది. నీ అనురాగాన్ని, అప్యాయతని ఏ రోజూ మర్చిపోలేను. సెలవు.

నీ

'రుక్కు'

చదివింది అర్థంకాక మళ్ళీ మళ్ళీ చదువుకున్నాను. నాకు తెలియకుండానే కళ్ళు చెమ్మగిల్లాయి. పెరట్లో మల్లెమొగ్గలు కోస్తున్న అక్కయ్య దగ్గరకు పరిగెత్తాను.

"ఏమిటి పద్మా?"

"రుక్కు బుద్ధగయకు వెళ్ళిపోయిందట!"

"కరెక్ట్! నే నేనాడో చెప్పాను. పిరికిపాలు జాస్తని..."

"పాపం! వాళ్ళమ్మ పోయిందట."

"బహుశా రుక్మిణి ఆ సంఘటనకోసమే ఎదురు చూస్తున్నదేమో!"

అదోరకంగా నవ్వింది అక్కయ్య. నాకు అక్కయ్యామీద ఎక్కడలేని అసహ్యం వేసింది.

"రమా! నోటికేమొస్తే అది మాట్లాడ్డమేనా?"

"సర్లెండి! ఇంతకూ తమరనే దేమిటి? రుక్మిణి చేసినపని మంచిదంటారా? ఒకొక్క మల్లెమొగ్గే తుంపుతూ మెల్లగా అంది.

అక్కయ్య కంఠంలో వ్యంగ్యం వుట్టిపడుతూంది.

"ఎన్ని జన్మల సంస్కారాల ఫలితమో కాకుంటే అలా ఈ వ్యామోహాలనుండి తప్పించుకొని నువ్వూ, నేనూ పొమ్మంటే పోగలమా?"

నా గుండెల్లో గూడుకట్టుకొన్న విహ్వలభావం గొంతులోకి ఎగదట్టింది.

"ప్చ్! మరే! ఇంతకూ ఏమంటావ్? నువ్వు నీ రుక్కు దగ్గరకు వెళ్తానంటావా? పూలుకోయడం ఆపి జవాబుకోసం నా ముఖంలోకి పరిశీలనగా చూసింది.

"వెళ్ళగలిగే శక్తే నాలోవుంటే అలా అంటావేమిటి? చెప్పాను గా నువ్వూ, నేనూ పోవాలనుకున్నా మనలోని బలహీనతలు అడుగు ముందుకువెయ్యనివ్వవు. వాటిని జయించి పోయే శక్తి మనకులేదు. రుక్మిణిలోని మహత్తర శక్తిని నువ్వు గుర్తించలేకపోయినా నేను గుర్తించగలను రమా! భగవంతుడు నాకా శక్తి ఇచ్చాడు." చివరి వాక్యం నొక్కి నొక్కి పలికాను.

"ఏమిటా మహత్తర శక్తి? పిరికితనానికి మరో పర్యాయపదం! తనవ్యూహ లోకానికి విరుద్ధంగా వుందనే గా—ఈ పరిసరాల్లో నుండి పారిపోవడం. అర్థంపర్థం లేని ఆ అమరత్వానికన్నా అందుకోగల్గిన ఈ మానసత్వం లోనే నాకు మహదానందం లభిస్తుంది. నేను రుక్మిణిలాంటి పిరికిపందను కాదు. వెళ్ళగలిగితే నువ్వు వెళ్ళు" అని పూలసజ్జను పూపుకుంటూ విసురుగా లోపలికి వెళ్ళింది అక్కయ్య.

ఈ ప్రపంచం మా ముగ్గురికి మూడు విధాలుగా కనిపిస్తోంది. తెలుగుపండిట్ అటుండేవారు. జన్మజన్మాలుగా సంపాదించిన సంస్కారమంతా దైవదత్తమయిన ప్రసాదితమైన రంగుటద్దంలాంటిది. దాన్లో నుండి ఏ వస్తువును చూసినా అదే రంగులో కనిపిస్తుందట! అంతేగాబోలు! అక్కయ్యని, రుక్కుని, ప్రక్కప్రక్కన బెట్టి పోల్చుకుంటూ ఓ అరగంట సేపు అలాగే మల్లె పందిరి కింద నిలబడ్డాను! అంతే ఆతర్వాత ప్రవహిస్తున్న జీవనవాహిని ఉధృతంగా నన్ను ముంచెత్తింది!

# ఆధునిక భాషాశాస్త్రము: తులనాత్మకపద్ధతి

శ్రీ పి. యస్. సుబ్రహ్మణ్యం

ఆధునిక భాషాశాస్త్రము పాశ్చాత్య పండితుల కృషితో సర్వతోముఖాభివృద్ధి నొందినది.[1] మానవుల స్వాభిప్రాయావేదనకు సాధకతమమైన కరణము భాష. అది యభిప్రాయావేదన కెట్లుపకరించును? ఒక భాషలోని వర్ణము లెట్టివి? పదము లెట్టివి? వానికా భాషలోఁగల పరస్పర సంబంధ మెట్టిది? ఒక భాష మూల స్వరూప మెట్లుండెడిది? దాని కితరభాషలతో నెట్టి సన్నిహిత సంబంధముగలదు? అది యనాది కాలమునుండియు నెట్టి పరిణతులను బొంది ప్రస్తుత కాలపు భాషగా రూపొందెను?—అను నిట్టి విషయములనుగూర్చి చర్చించుటయే భాషాశాస్త్ర ప్రయోజనము. ప్రయోజన భిన్నతనుబట్టి భాషాశాస్త్రము నంతటిని మూఁడు ముఖ్యభాగములుగా శాస్త్రజ్ఞులు విభజించిరి. ఒక కాలమునందలి యొక భాషలోని వర్ణములనుగూర్చియుఁ, బ్రకృతి ప్రత్యయములను గూర్చియు, వాక్యాంగములగు పదముల పరస్పర సంబంధమును గూర్చియు వివరించునది వర్ణనాత్మక భాషాశాస్త్రము (Descriptive Linguistics). ఒక భాష యే భిన్న కాలములలో నెట్టి పరిణతులను బొందెనను విషయమునుగూర్చి చర్చించునది చారిత్రక భాషాశాస్త్రము (Histor.cal Linguistics). ఒక భాషా కుటుంబమునకే చెందిన కొన్ని భాషలను పరస్పరము పోల్చి వాని మూల భాషాస్వరూపమును నిర్ణయించి ప్రత్యేకముగా వాని పరిణామదశలను నిరూపించునది తులనాత్మక భాషాశాస్త్రము (Comparative Linguistics).

ఈ తృతీయ భాషాశాస్త్ర విభాగమునుగూర్చియు నందుపయుక్తములగు పద్ధతులను గూర్చియు సవిస్తరముగఁ జర్చించుటయే ప్రస్తుత వ్యాసప్రయోజనము.

పైనఁ జెప్పిన విధముగఁ దులనాత్మక భాషాశాస్త్రమొక భాషాకుటుంబమునకే చెందిన వివిధభాషల పరస్పర సంబంధమును గూర్చి చర్చించును. కొన్ని భాష లొకే భాషా కుటుంబమునకుఁ జెందినవని నిర్ణయించుటకు రెండు ముఖ్యములగు నాధారము లుండవలెను. అందు మొదటిది—ఆ భాషలలో నర్థమునందును వర్ణసమూహమునందును నెక్కుడు సాదృశ్యముగల సమానపదములు (cognates) బహుళముగా నుండుట.[2] అట్టి పదములు బహుళముగా నుండుటయే కాక యవి మానవునకు నిత్యావసరములగు వస్తువులు, దేహభాగములు, వృత్తములు, పశుపక్ష్యాదులు, సర్వసామాన్య క్రియలు మొదలగువానిని బోధించునవి యైనచో నిట్టివి

1. ఈ వ్యాసమునకుఁ బ్రధానాధారములైన యాంగ్ల గ్రంథములు, వ్యాసములు :—

I, Leonard Bloomfield, "Language" chap. 18 , 1933.

2. Edward sapir, "Language" 1921.

3. H. M. Hoenigswald, "Sound change and Linguistic structure" Language Vol 22.

4. H. M. Hoenigswald, "The principle step in comparative grammar" Language Vol 26.

5. G. Bonfante, "On reconstruction and Linguistic method" Vol. 1,

2. ఇట్టి పదములలో నర్థమునమునందును, వర్ణములందును సంపూర్ణ సాదృశ్య ముండనక్కఱలేదు. ఒక భాషలో నర్థవిపరిణామ ప్రక్రియవలన నర్థమునందు మార్పుగలుగుటకు వీలుండును. ఉదాహరణకు సంస్కృతములోనుగల 'విద' ధాతువును గైకొనవచ్చును. దీనికి లాటినులోఁ 'జూచుట' యనియు సంస్కృతములోఁ 'తెలిసికొనుట' యనియు నర్థములు గలవు. ఈ యర్థములు పరస్పర భిన్నములైనను వానిలో సాదృశ్యముండుటచే నీపదము లొకే మూలరూపమునుండి యుద్భవించినవని విశ్వసింపవచ్చును. అట్లే యిట్టి పదములలోని వర్ణములన్నియుఁ గూడ సమానముగా నుండనక్కఱలేదు. విలయనఁగా రెండు సోదరభాషలలోని సమాన పదములలో భేదించు వర్ణముల చరిత్ర కనుఁగొనుటయే కదా తులనాత్మక భాషాశాస్త్ర ప్రయోజనము.

సాధారణముగా వేఱొకభాషనుండి యెరవు తెచ్చి కొనఁబడవు గనుక నాభాషల యేకకుటుంబతె నివి స్థిర పఱుపఁజాలును. దీనికన్న ముఖ్యమైన రెండవ యాధారము, ఆ భాషలలోఁ గ్రియారూపములు, నామరూపములు, విశేషణములు మొదలగువాని నిర్మాణమునందు సామ్యముండుట. ఈ యాధారమే యొకభాష యేభాషా కుటుంబమునకుఁ జెందినదియు నిదమిత్థముగా నిర్ణయింపఁ గలదు. ఏలయనఁగా భిన్నభాషా కుటుంబములకుఁ జెంది భౌగోళికముగా సన్నిహితముగానుండు రెండుభాష లొకదానినుండి మఱియొకటి శబ్దములనే గ్రహించునుగాని యన్యభాషలోని పద నిర్మాణమునందలి పద్ధతులను గ్రహించుట యరుదు. ఈ విషయమును నిరూపించుటకై యుదాహరణమునకు ద్రావిడభాషలను సంస్కృతమును గైకొందము. ద్రావిడభాషలను తమిళము, మళయాళము, తెలుఁగు మొదలగు వానిలోనికి సంస్కృత శబ్దములు వేలకువేలు వచ్చి చేరినవి. అయినను ద్రావిడ భాషలలోఁ గ్రియానిర్మాణము, నామవాచక నిర్మాణము మొదలగువాని పద్ధతులయందించుకయు మార్పు కలుగలేదు. ద్రావిడభాష లన్నిటిలో వ్యతిరేకార్థమును జెప్పుట కొక ప్రత్యేక క్రియారూప ముపయుక్తమగును. ఉదా. త. కాణేన్; తె. చూడను, మొ. ఇట్టి వ్యతిరేకార్థక క్రియారూపములు సంస్కృతములోఁ గాని మఱియే ఇండో—యూరపియను భాషలలోఁ గాని లేవు. ఆ భాషలలో సాధారణ క్రియారూపమున కొక వ్యతిరేకార్థక శబ్దమును జేర్చుటచేత నే వ్యతిరేకార్థము చెప్పఁబడును. ఉ. సం. 'న పశ్యామి' మొ. తత్సమ తద్భవశబ్ద బాహుళ్యమువలనఁ గలిగిన ద్రావిడభాషలును సంస్కృత జన్యములే యను నపోహను దొలఁగించుటకీ వ్యతిరేక క్రియారూపములవంటి ద్రావిడభాషా విశిష్ట పదనిర్మాణము లత్యంతోపయోగులుకదా !

కొన్నిభాష లొకే భాషా కుటుంబమునకుఁ జెందినవనుటలో నుద్దేశ మా భాషలన్నియు నత్యంత ప్రాచీనకాలమున నొకభాషగానే యుండిన వనుటయే. ఇట్టిభాష నే మూలభాష (Proto-language) అందురు. ప్రపంచభాష లన్నిటిలోఁ గొన్నిభాషలకే యీ మూలభాషలు గ్రంథస్థములై లభ్యము లగుచున్నవి. ఉత్తర హిందూస్థాన భాషలగు హిందీ, అస్సామీ, మరాఠీ, ఒరియా మొదలగు భాషలకు మూలభాషయగు సంస్కృతభాష సర్వవిదితము. అట్లే ఇటాలియను, ఫ్రెంచి, స్పానిషు మొదలగు భాషల మూలభాషయగు లాటినుభాష నేఁడును గ్రంథస్థమై లభ్యమగుచున్నది. కాని తమిళము, మళయాళము, కన్నడము, తెలుఁగు మొదలగు ద్రావిడభాషలకు మాత్రము వాని మూలభాషను గుఱించి తెలుపు గ్రంథాద్యాధారములు లేవు. అట్లే సంస్కృతము, లాటిను, గ్రీకు మొదలగు ఇండో-యూరపియను భాషల మూలభాష స్వరూపమును దెలుపు నాధారములును నిపుడు లభ్యములు కావు. అయిన నిట్టి భాషలను బరస్పరము తులనాత్మక పద్ధతి సాహాయ్యమునఁ బోల్చి వాని మూలభాషల స్వరూపమును వీలైనంతవరకు భాషా శాస్త్రజ్ఞు లెఱుఁగఁ గలుగుచున్నారు. మూలభాషలు లభ్యములగు నధునాతన భాషలలో నీ పద్ధతి నుపయోగించుట వలన గలిగిన ఫలితములు సత్యములని తెలియుటచే మూల భాషలు లభ్యములుకాని సోదరభాషలలోఁగూడఁ దన్మూలభాషా స్వభావ జ్ఞానమున కిది పరమ సాధనమని శాస్త్రజ్ఞులు నమ్ముచున్నారు. ఈ తులనాత్మక భాషా శాస్త్ర భాగమునం దుపయుక్తములగు పద్ధతులనుగూర్చి చర్చించుటకు ముందుగా నొక భాష భిన్నభాషలుగా మాఱుటకు హేతువేద్ది? ఈ మాఱుటలో నేదియైన క్రమము గలదా? లేదా? అను విషయములను గూర్చి యించుక పరిశీలింతము.

ఏ భాషయైనను జాలమందిచే వ్యవహరింపఁ బడును గాన నది యేకకాలమునందైన నొకేవిధముగా నుండదు. మఱియు నొక భాషను మాటాడువారు విశాల భూభాగము నాక్రమించికొని యున్నచో నా భాషలోనే యీషద్భేదములు గల మాండలికములు తలలెత్తును. కావున భాషాసహజములగు మాండలికములు మూల భాషలోను నుండెడివని మన మంగీకరింపవచ్చును. కాల క్రమమున నొక మూలభాషను వ్యవహరించువారి సంఖ్య యభివృద్ధి నొంది వారు కొన్ని తెగలై దూర ప్రదేశములకు వలస పోఁగాఁ బూర్వ మప్రధానములై యున్న మాండలిక భేదములే యపుడు ప్రధానములుగా వృద్ధి నొందుటచేతనే కాక మఱి కొన్ని క్రొత్త పరిణామములు గూడ వారివారి భాషలలోఁ బ్రత్యేకముగా గలుగుటచేత గూడ వారిభాషలు పరస్పర భిన్నములుగా మాఱిపోవును. అయిన నొకభాష భిన్నభాషలుగా మాఱునప్పు డది నియమరహితముగా మాఱునని తలఁపరాదు. కొన్ని భాషలు మూలభాషా స్థితినుండి భిన్నములుగా రూపొందునప్పు డొక్కొక్క భాష

యొక్కొక్క పరిణామక్రమమును నవలంబించి మారును. ఈ పరిణామ క్రమమునే యాంగ్లమున (Drift) అందురు. భాషా పరిణామ క్రమమును (Drift) గూర్చి (Edward Sapir) చెప్పిన యీ క్రింది వాక్యములు మన ప్రస్తుత విషయమున కనుసంధింపఁ దగినవి.

"భాషా పరిణామ క్రమమున కొక నియమితమైన మార్గముండును. ఒకే నిర్ణీతమార్గము ననుసరించు కొన్ని పరిణామముల సమూహము మాత్రమే యొకభాష పరిణామ క్రమమగును. ఒక భాషలోని పరిణామక్రమము తద్భాషా వ్యవహర్తలు వారికిఁ దెలియకుండనే యాప్రయత్నముగాఁ ప్రాధాన్య మిచ్చిన తుల్యములైన కొన్ని మార్పుల స్వరూపమున నుండును. ఒక భాషలోని పరిణామక్రమపు మార్గము నా భాష ప్రాచీన చరిత్రను బట్టి స్థూలముగా నూహింపవచ్చును. ఒక భాష పరిణామక్రమమున కనుగుణమైన యొక స్రోతోమార్పు మొదటఁ జాలకాలముగా నొకఁ గొద్దిమంది యాప్రధానులైన జనుల వ్యవహారములోనే వారి ప్రత్యేకతగా నుండియున్నను గాలక్రమమున నది యా భాషయంతటికి వ్యాపించును."3

ఈ పైవాక్యములనుబట్టి యొక భాషలోఁ ప్రాచీనకాలమునుండియు వచ్చు పరిణామములన్నియు నొకేపద్ధతిలో నుండునని తెలియుచున్నది. కావున మూలభాషలోని యొకవర్ణ మర్వాచీనభాషలలో మారినయెడల నొక్కొక్క భాషలో నొక్కొక్క వర్ణముగానే మారును గాని యొక భాషలోనే యది రెండు విధములుగా మారదు. రెండు సోదరభాషలలో నర్థవర్ణ సామ్యముగల పదములలోని వర్ణములసంబంధము సత్యముగా నుండుట కిదియే హేతువు. ఇట్లు ప్రతి భాషయు నొక ప్రత్యేక నియమమునకుఁ గట్టువడి మారుచుండుటచేతనే యర్వాచీనభాషలపైఁ దులనాత్మక పద్ధతులఁ ప్రయోగించి వాని మూలభాషా స్వరూపమును భాషాశాస్త్రజ్ఞు లూహింపఁగలుగుచున్నారు. భాషలు మారుటలో నొక క్రమమే లేనియెడల వాని మూలరూపమిదియని నిర్ణయించుటయే దుష్కరముగదా! ఇఁక నీ మూలభాషాస్వభావాన్వేషణమున కుపయోగించు తులనాత్మక భాషాశాస్త్ర పద్ధతులనుగూర్చి చర్చింతము.

## మూలభాషా స్వరూప నిర్ణయ పద్ధతి

(Comparative Method)

ఈ మూలభాషా స్వరూప నిర్ణయ పద్ధతిని గొన్ని సోదర భాషలలోని సమానపదములపై నుపయోగించుచుండగా పదము లన్యభాషాపదములు కావని నిశ్చయించికొనుట ముఖ్యము. సోదరభాషలలోఁ గూడ నొక భాషకు సహజముగాఁ జెందిన పదము లితర భాషలలోని కెరవు తెచ్చికొనఁబడుచుండును. అట్టి పదములను మనము గ్రహించినచో మన సిద్ధాంతము లా భాషల కంతకుఁ బూర్తిగ నన్వయింప నేరవు. కావున నట్టి పదములను ముందుగాఁ బరిహరించుట యావశ్యకము. సాధారణముగా సామాన్య ధ్వని సూత్రములకు లొంగని పదము లొకభాషలో నున్నప్పుడు వాని నన్యభాషా శబ్దములుగఁ బరిగణించుట పరిపాటి. ఒక భాషలోని యిట్టి యన్యభాషాపదములు సాధారణముగ నల్ప సంఖ్యాకములై యుండును.

1. సోదర భాషలలోని సమానపదములలోఁ దుల్యములుగానుండు వర్ణములన్నియు మూలభాషలో నుండియుండు ననుట మూలభాషా స్వరూప నిర్ణయ పద్ధతిలోని ముఖ్య సూత్రము.

| తమిళము | మళయాళము | కన్నడము | తెనుఁగు |
|---|---|---|---|
| కణ్ | కణ్ | కణ్ | కన్ను |
| కాల్ | కాల్ | కాల్ | కాలు |
| కట | కటక్క | కడె | కడచు |
| తేళ్ | తేళ్ | తేళ్ | తేలు |
| తేఱు | తేఱుక | తేరు | తేఱు |

ద్రావిడభాషలనుండి గ్రహించిన పై యుదాహరణలలో నాద్యక్షరములను బరిశీలించిన మొదటి మూఁడు పదములలోను నాద్యక్షరముగ 'క' వర్ణ మన్ని భాషలలోను సమానముగనే యున్నది. అట్లే చివరి రెండుదాహరణములలోను బదాది వర్ణముగ 'త' కార మన్ని భాషలలోను గలదు. కావున మూలద్రావిడమునఁగూడ మొదటి మూఁడు మాటలలోను బదాదిని 'క' వర్ణమును దరువాతి రెండుమాటలలోఁ బదాదిని 'త' వర్ణమే గల

3 Edward Sapir Language P. 155

4. కొన్ని సోదరభాషలలోని సమాన (అర్థ వర్ణ సామ్యముగల) పదములలోని ధ్వనుల పరస్పర సంబంధమును దెల్పు సూత్రములే ధ్వని సూత్రములు. రెండు సోదరభాషలలోని సమాన పదములలోఁ బదాది నొక భాషలో 'క' యను ధ్వని యున్నచో రెండవ భాషలో 'గ' యను ధ్వని యుండును—ఇట్టివే ధ్వని సూత్రములు.

దనియు నీ సూత్రమువలన మనము చెప్పవచ్చును. ఇట్లు తులనాత్మక పద్ధతిచే నూహింపఁబడిన మూలభాషా వర్ణములును పదములును నివి యూహింపఁబడినవే గాని వీనికి గ్రంథాది నిదర్శనములు లేవని తెలుపుటకు వీని ముందొక నక్షత్రపు గుర్తు నుంచుదురు. ఉదా. *క, *తి.

2. ఇఁక సోదర భాషలలోని సమాన పదములలో భిన్నములుగా నున్న వర్ణములలో నేది మూలభాషలో నుండెడిదో యూహించు పద్ధతిని గూర్చి చర్చింతము.

| కన్నడము | తెనుఁగు |
|---|---|
| కనలు | కనలు |
| కెను | చెను |
| కీగు | చీగు |
| చిమ్ము | చిమ్ము |

పై నాలుగుదాహరణములలోను సాదృశ్యక్రమములను బరిశీలించిన యెడల మొదటి జంటలోను నాల్గవ జంటలోను సాదృశ్యక్రమములు తుల్యములుగా నున్నవని తెలియును. కావున మూల ద్రావిడభాషలోఁ 'గనలు' అను దాని మూలరూపమునఁ బదాదిని 'క' కారమే కలదనియుఁ, 'చిమ్ము' అను దాని మూలరూపమునఁ బదాదిని 'చ' కారమే కలదనియు మనము చెప్పఁగలము. ఇఁకే మధ్యనున్న రెండు జంటలలోను కన్నడములో 'క' కారమును తెనుఁగులో 'చ' కారమును బదాదిని గానవచ్చుచున్నవి. ఇట్టి చోటుల మూల భాషలోని వర్ణము 'క' కారమా 'చ' కారమా? యను విషయమును నిశ్చయింపవలెను. మొదట మూలభాషలోని వర్ణము 'చ' కారమే యనికొని చూతము. ఇట్లనికొనినయెడల మనమీ క్రింది విషయములను జెప్పవలెను. మూలభాషలోని 'చ' కారము తెలుఁగులో 'చ' కారముగానే యుండును; కన్నడములో నది 'క' కారముగా మారును. కాని మూలభాషలోని 'చ' కారము కన్నడములో 'చ' కారముగానె యుండునని చివరి జంటవలన మనకుఁ దెలియఁగలదు. (ఇట్టి జంటలింకను గన్నడము తెలుఁగులలో ననేకములు గలవు.) దీనినిబట్టి మధ్యనున్న జంటలలోఁ బదాదిని 'చ' కారమే మూలమున్న యెడల 'చ' కారము కన్నడములోఁ గొన్ని పదములలో 'చ' కారముగనే యుండఁగా మరికొన్ని పదములలో నది 'క' కారముగా మారునని చెప్పవలయును. ఇది భాషా పరిణామక్రమమును గూర్చి మనమనికొన్న సిద్ధాంతమునకు విరుద్ధము. మూలభాషాధ్వని యొక భాషలో నొక ధ్వనిగానే పరిణమించును గాని రెండు ధ్వనులుగా మారదని కదా మన భాషా పరిణామ క్రమ సిద్ధాంతము. కావున మూలభాషా 'చ' కారము కన్నడములో 'చ' 'క' లుగా గాన నగుననుట మన మూల సిద్ధాంతమునకు విరుద్ధము. ఇదియే గాక మూల భాషలోని 'చ' కారము కన్నడములో మధ్యనున్న రెండు జంటలలోను 'క' కారముగా మారినదనుటవలన వేరొక యనర్థము గూడఁ గలదు. ఒక వర్ణము కాలక్రమమున వేరొక వర్ణముగా మారుటలో సమీప వర్ణముల ప్రభావము కొంతయుండును. అనఁగా నొక వర్ణము సమీప వర్ణము నుచ్చారణ స్థానమునకు మారుట లేక దానికి సమీపముగా వచ్చుట మొదలగునవి సాధారణముగా బహు భాషలలోఁ గాననగును. అట్టి హేతువును 'చ' కారము 'క' కారముగా మారినదనుటకుఁ జూపలేము. తాలవ్యాచ్చగు 'ఇ' కారము పరముగా నుండఁగాఁ దాలవ్యమగు 'చ' కారము కంఠ్యమగు 'క' కారముగా మారుటకు హేతువేమి చెప్పఁగలము? కావున నీ రెండు జంటల మొదట మూలభాషలో నున్న వర్ణము 'చ' కారము కాదని నిరసించి, 'క' కారము మూలమని కొని యపుడు గలుగు ధ్వని పరిణామములను గూర్చి చర్చింతము.

'క' వర్ణ మిందు మూలమన్నచో మూలభాషా 'క' కార మీ రెండు భాషలలోను నిల్చియున్న యుదాహరణములును గలవు కదా యను సందేహము పొడమవచ్చును. కాని యా జంటలకును నిట్టి జంటలకును నించుక భేదము గలదు. మూలభాషా 'క' వర్ణ మీ రెండు భాషలలోను 'క' వర్ణముగానే నిలిచినచోటులలోని ప్రక్కయచ్చులు—అ ఆ, ఉ ఊ, ఒ ఓ లు మాత్రమే. కన్నడములో 'క' కారముండి తెలుఁగులో 'చ' కారమున్న యిట్టి జంటలలోని ప్రక్కయచ్చులు—ఇ ఈ, ఎ ఏ లు. కావున నిట్టిచోటులలో మూలభాషలోని వర్ణము 'క' వర్ణమనుటకు విప్రతిపత్తియుండదు. పైఁ యనఁగా నీ మతమున మూలభాషా 'క' వర్ణము తెలుఁగులో 'క' 'చ' అను రెండు వర్ణములుగా మారినది యన్నను నిట్టి పరిణామభేదము భిన్న పరిస్థితులలో నున్నది గాన నది యొక్క పరిణామము వంటిదియై మనమూల సిద్ధాంతమునకు విరుద్ధముగా నుండదు. (స్పష్టతకై క్రింది మూఁడవ సూత్రమును జూడుఁడు.) ఇక 'క' కారము 'చ' కారమగుటకు హేతువును జెప్పనగుయు సులభమే. కంఠ్యమగు 'క' కారము తాలవ్యాచ్చులగు ఇ ఈ, ఎ

పి ల సాన్నిహిత్యముచేఁ దాలవ్య 'చ' కారముగా మాఱినదనుటకు విప్రతిపత్తియేమి? ఇట్టి కారణమును 'చ' కారమే 'క' కారముగా మాఱినదనుటకుఁ జూపఁ జాలము. ఈ రెండు కారణములనుబట్టి యిట్టి జంటల లోను 'క' కారమే ప్రాచీనవర్ణమని మనము నిశ్చయింప వచ్చును. ఎక్కువ ద్రావిడభాషలలో 'క' కారమే యుండె తమిళము, మళయాళము, తెలుఁగు — అను నీ మూఁడు భాషలలోనే యిట్టి సందర్భములలో 'చ' కారము కానఁగుటను విషయముగూడ మన యీ నిశ్చయమును బలపఱుపఁగలదు.

3. భిన్న పరిసరములలోనున్న యొకభాషలోని యొకవర్ణమునకు సమానముగా వేఱొక సోదరభాషలో రెండు భిన్నవర్ణములున్నచో నాయీ రెండును మూలభాష లోని యొకవర్ణమునుండియే యుద్భవించినవని చెప్ప వలయును. ఇట్టియెడ నా మూలభాషా వర్ణ మొక భాషలో నన్ని పరిసరములలోను నొకటిగానేయున్న వర్ణమగునని స్పష్టము.

| తమిళము | తెనుఁగు |
|---|---|
| కఱువు | కడుగు |
| నీఱిల్ | నీడ |
| పొఱుతు | ప్రొద్దు |
| పొఱుల్ | ప్రోలు |

పై యుదాహరణమునను బరిశీలించిన యెడలఁ దమిళములోని 'ఱ' కారమునకు సంబంధించి తెనుఁగులో మొదటి రెండు జంటలలోను 'డ' కారమును జివరి రెండు జంటలలో రేఫమును గలవని తెలియఁగలదు. ఈ రెండు రకముల ధ్వని సంబంధములను మనమీ క్రింది విధముగా నేర్పఱుపవచ్చును.

1 $\frac{\text{ఱ}}{\text{డ}}$ (త)/(తె) 2 $\frac{\text{ఱ}}{\text{ర}}$ (త)/(తె)

ఇటఁ జూపిన రెండు ధ్వని సంబంధములకు మూల ధ్వనులు క్రమముగా 'డ' 'ర' లని చెప్పుటకు వీలు లేదు. వీలయినఁగా మూల భాషలో * ట వర్ణమే గాని * డ వర్ణము లేదని మన మితరాధారములవలన జెప్పఁ గలము. ఆ * ట వర్ణ పరిణామమునకు మన ప్రస్తుత విష యమునకు నెట్టి సంబంధమును లేదు. అట్లే మూలభాష లోని 'ర' వర్ణమన్ని పరిసరములలోను నీ రెండు భాషలలో 'ర' వర్ణముగానే యుండును. కావున నీ రెండు ధ్వని సంబంధములలోను మూలవర్ణము 'ఱ' యనఁదగునా లేక యొకదాని మూలవర్ణము 'ఱ' యనియు వేఱొకదాని మూలవర్ణమనియు మరియొక భిన్నవర్ణమనియు ననికోనవలయునా యని ఆలోచింప వలసి యున్నది. పరిశీలించి చూచినయెడల నీ రెండు ధ్వని సంబంధముల పరిసరములును భిన్నములని తెలియఁ గలదు. తమిళములోని 'ఱ' వర్ణమునకు సంబంధించి తెలుఁగులో 'డ' వర్ణము రెండచ్చుల మధ్యనే యున్నది; కాని 'ర' వర్ణము మాత్రము తెలుఁగులో వర్ణవ్యత్య యము వచ్చిన చోటులలో హల్లునకును నచ్చునకును మధ్యనే కానవచ్చుచున్నది. ఇట్లు తెలుఁగులోని యీ రెండు పరిణామములును భిన్నపరిసరములలో జరిగినవి. భాషా శాస్త్రములో భిన్న పరిసరములలో నున్న ధ్వని భేదములను గాని, పరిణామ భేదములను గాని భిన్నములుగాఁ గాక యొకటిగానే గ్రహించుట పరి పాటి. కావునఁ దెనుఁగులోని యీ రెండు పరిణామ ములను నొకటిగానే గ్రహించి యీ రెండు ధ్వని సంబంధములకును మూల వర్ణములు రెండు కాన క్కరలేదు; రెండిటికిని మూల వర్ణము * ఱ యనియే నిశ్చయింతుము.

4. సోదర భాషలలో నొక భాషలోని యొక వర్ణమునకు సంబంధించి వేఱొక భాషలో నేమియు లేకున్న నా వర్ణము మూల భాషలో నుండెడిదని చెప్పవలయును.

| పర్జి | తెలుఁగు |
|---|---|
| చీ- | ఈ-(ఇచ్చు) |
| చిల | న్-[దు] (*ఇల-దు, చూ. త. ఇల్లై) |
| చీక్ద్ | ఈఁత |
| చుప్ | ఉప్పు |
| చేన్దు | ఏదు |
| చాకొల్ | ఆఁకలి |

పై పదములలోఁ బర్జి భాషలోని పదాది చకా రమునకు సంబంధించి తెలుఁగులో నేమియు వర్ణము కానరాదు. ఇట్టియెడ మూలభాషలోఁ బదాది చకా రము లేదనిన యెడలఁ బర్జి భాషలో నది నిష్కారణ ముగా వచ్చినదని చెప్పవలయును. కాని యిట్లుజాదు లగు పదముల మొదట నొక చకారముచేరుటయే భాషా పరిణామములోను గానరాదు. కావునఁ బదాది చకా రము మూలభాషలో నిట్టి పదములలో నుండెను—అది తెలుఁగులో లోపించెనని చెప్పవలెను. ఇట్లు కాల

క్రమముగఁ గొన్ని వర్ణములు లోపించుట సర్వ భాషల లోను ప్రసిద్ధమే. కొన్ని మూలద్రావిడ పదములలోని పదాది చకారము తమిళము, మళయాళము మొదలగు దక్షిణ ద్రావిడ భాష లన్నిటిలో లోపించెననియు నది యుత్తర మధ్యద్రావిడ భాషలలో నిలచియున్న దనియు ద్రావిడ భాషా వేత్తల కందఱకును దెలిసినవిష యమే. పైచర్చలలో నుదాహరణములిచ్చిన చోటు లలో నవి సౌలభ్యముకొఱకు రెండు సోదరభాషల నుండియే గైకొనఁబడినవి. రెండుకన్న నెక్కువ సోదర భాషలను గూర్చి పరిశీలించునపుడును నీ పద్ధతులే యుపయోగింపఁబడును.

## ప్రాక్తన భాషాస్వరూప నిర్ణయ పద్ధతి

## (Internal Reconstruction)

పైనఁ జెప్పిన తులనాత్మక పద్ధతులన్నియు నొకే భాషా కుటుంబమునకుఁ జెందిన సోదరభాషలలోని సమానపదముల(Cognates)పైఁ బ్రయోగింపఁబడుననుట స్పష్టము. సమానకాలమునందుండిన యొక భాషలోని పదము లాధారముగాఁ గొని యా భాష ప్రాచీన స్థితిని గూడఁ గొంతవఱ కూహించుటకు వేఱొక పద్ధతిగలదు. దీనినే యాంగ్లమున Internal Reconstruction అని యందురు. తెలుఁగులో దీనిని ప్రాక్తన భాషా స్వరూప నిర్ణయపద్ధతి యని వ్యవహరింపవచ్చును. ఇంతకుఁ బూర్వము చెప్పిన పద్ధతులు కొన్ని భాషల మూలభాష స్వభావమును నిర్ణయించుట కుపయోగించును; ఈ పద్ధతి యొక భాష పైననే ప్రయోగింపఁబడును గాన నిది యా భాష ప్రాక్తన స్వరూపమును మాత్రమే నిర్ణయింపఁగలదు. ఈ ప్రాక్తనభాషా స్వరూప నిర్ణయ పద్ధతివలన రెండు ముఖ్యములైన ప్రయోజనములు గలవు. ఇది మూలభాషా స్వరూప నిర్ణయ పద్ధతులవలన మనము మూల భాషను గూర్చి యూహించిన విషయములు సత్యములేయని నిర్ధరించుట కుపయోగించును. పూర్వభాషా స్వరూపమును దెలుపు గ్రంథశాసనాద్యాధారములు గాని, సోదర భాషలు గాని లభింపని యొక యధునాతన భాష ప్రాచీనస్థితిని గొంతగా నూహించుటకుఁ గూడ నిది యుపయోగించును.

సోదర భాషలలో శబ్దార్థసాదృశ్యముగల పదము లున్నట్లే యొక భాషలోనే యొక పదము భిన్న పదములతోడి సంయోగమువలనఁ గొలఁది వర్ణముల మార్పులతోఁ భిన్న రూపములతోఁ గన్పట్ట వచ్చును.[5] అట్టి యీ వర్ణభేదము గల పదములను బరస్పరము పోల్చిచూచి వానియందలి భిన్నవర్ణములకు మూలరూపములను మనము కొన్ని యెడల నూహింపవచ్చును. అటి పదములను గైకొను నపు డర్థసాదృశ్యమున్నంత మాత్రమున వర్ణసాదృశ్య శూన్యములైన 'వచ్చు, రా' వంటి పదములను గైకొన రాదు. ఏలయన నట్టివానిలో నొక్కవర్ణమైన సమాన ముగా లేకపోవుటవలన వాని మూలరూపము లీపద్ధతివలన నూహించుట దుస్సాధ్యమగును. అట్టి పదముల సంబంధ మును మనము చారిత్రకముగా నిర్ణయింపలేము.

ఈ ప్రాక్తన భాషాస్వరూప నిర్ణయపద్ధతిని విశదీకరించుటకు ముందు తెలుఁగునుండి యుదాహరణ ములను గైకొందుము.

| | |
|---|---|
| మాఱు | మార్చు |
| తారు | తార్చు |

'మాఱు, తారు' అను రెండు ధాతులలో మొదటి దానిలో శకటరేఫము, రెండవదానిలో సాధురేఫమును గలవు. కాని యివి ప్రేరణార్థక చువర్ణముఁ గూడు నపుడు రెంటియందును సాధురేఫమే కాననగుచున్నది. ఇట్టియెడఁ బ్రాక్తనభాషలో నీ ప్రేరణార్థక రూప ముల స్వరూపము లూహించుట కవకాశము గలుగు చున్నది. ఆప్రేరణ రూపములలో నీధాతువులలో 'ఱ, ర' ల భేదము గలదుగాన దీనినిబట్టి ప్రాక్తన భాషలో ననఁగా తెలుఁగుభాష శాసనాదులలోఁ బ్రయోగింపఁబడుటకు బూర్వము 'మార్చు' 'తార్చు' అను ప్రేరణరూపములలోఁ గూడ నీ 'ఱ, ర' ల భేదముండి యవి యీ క్రిందిరీతిగా నుండెడివని యూహింపనగును. * మాఱ్చు; * తార్చు. ఇట్లు కాక యీ రెండిటిలోను బ్రాక్తనభాషలో సాధురేఫమే యున్నదన్నచో నదియొక ధాతువులో నట్లేయుండి రెండవదానిలో శకటరేఫముగ మాఱుటకు గారణము

---

5 ఇచ్చటను నీ తరువాతను బద శబ్దము 'సుప్తిఙన్తం పదమ్' అను సంస్కృతవ్యాకరణ నిర్దిష్టమగు నర్థములోఁ గాక యొక ప్రకృతి ప్రత్యయములు రెండిటికిఁ గూడఁ బర్యాయముగ వాడఁబడినది. పదశబ్ద మీ యర్థమున నధునాతన భాషాశాస్త్రములోని Morpheme (అర్థవంతమైన కనిష్ఠ వర్ణ సమూహము) అనుదానికిఁ దుల్యము కాఁగలదు.

మనము చెప్పలేము. ఇపుడు మనముచేసిన ప్రాక్తన రూపనిర్ణయమువలన నీ క్రింది ధ్వని పరిణామ సూత్రము మనము చెప్పవచ్చును — ప్రేరణార్థక చువర్ణము ముందు ధాత్వవయవము శకటరేఫము సాధురేఫముగా మాఱును; ధాత్వవయవ సాధురేఫము సాధురేఫముగానే యుండును. దీని నే వేఱువిధముగా నిట్లు చెప్పవచ్చును. ప్రాక్తనాంధ్ర భాషలో ధాతుగతమగు 'ఱ' వర్ణము ప్రాచీనాంధ్రములో నచ్చుల మధ్య 'ఱ' వర్ణముగానే యుండి, ప్రేరణార్థక 'చు' వర్ణము ముందది 'ర' వర్ణముతోఁ గలసిపోవును. ఇట్లొక భాషలోని యొక పదములో రెండు భిన్న పరిసరములలో రెండు భిన్న వర్ణములు కానవచ్చినచో వాని మూలస్వరూపమును నిర్ణయించుట కా రెండు పరిసరములలోను నొక వర్ణమే యుండు వేఱొకపదముతో దానిని బైవిధముగఁ బోల్చి చూడవలయును. అట్లు పోల్పఁబడు రెండుపదములలో నేయొక్క పరిసరములోనైన నొకే వర్ణముండ వలెను. (మాఱు: మారి -[చు]) ఈపదములో భిన్న పరిసరములలో 'ఱ' 'ర' లు కన్పట్టుచున్నవి. వీని మూలరూపము నూహించుటకుఁ బ్రేరణార్థక చువర్ణము ముందిందువలెనే సాధురేఫమేయున్న 'తార్చు' అను శబ్దమును గైకొంటిమి. ఒక భాష పరిణామక్రమమున నొక వర్ణ మొక నియమిత పరిసరములో వేఱొక వర్ణముతోఁ గలసినప్పుడీ చరిత్ర నూహించుట కుపయోగించు ప్రాక్తన భాషా స్వరూప నిర్ణయపద్ధతి యిదియే. ఈపద్ధతి వలన మనముచేయు నిశ్చయములను బైతుల నాత్మకపద్ధతి గూడ దృఢీకరింపఁ గలదు.

ఈ ప్రాక్తన భాషా స్వరూప నిర్ణయ పద్ధతులలో నింకొక దానిని గూర్చి యెఱుఁగుటకు నేటి కాలపుఁ దెనుఁగు నుండి వేఱొక యుదాహరణము గైకొందము. గోదావరిజిల్లాలలోని భాషలో 'చాద' యను శబ్దము గలదు. గుంటూరుజిల్లాభాషలో 'నీరుతోడుట' యను నర్థమున 'చేదు' ధాతువు గలదు. ఈ రెండు మాండలికములలోను 'చాద' కుఁ గట్టు త్రాటికి—'చాన్తాడు' అను వ్యవహారము గలదు. ఇందు 'చేదు' 'చాద' శబ్దములకు సంబంధించి 'చాన్' అను పదము గాననగుచున్నది. 'చాన్తాడు' అనునది 'చాద + తాడు' అను శబ్దముల సంయోగమువలన నేర్పడినది; కాని యిది వ్యావహారి కాంధ్రమునందలి సంధినియమములననుసరించి 'చాత్తాడు' అనురూపమున నుండవలెను. (నేటి తెలుఁగున ద + త వర్ణములు సంధిలోఁ గలిసిన నపుడు 'త' గా మాఱుచుండును. పరిశీలింపుడు: నాది + తప్పు = నాత్తప్పు; * ఊదుతాడు = ఊత్తాడు; రోద + తగ్గింది = రోత్తగ్గింది మొ.) అట్టియెడ 'చాన్తాడు' లో నకార మెక్కడనుండి వచ్చినది? ఈ 'న' కారము సాధారణ సంధి నియమములకు వ్యతిరేకముగ నిర్హేతుకముగ నుండియుండదు గానఁ బ్రాక్తన భాషలోని 'చాద' శబ్దములో 'న' కార ముండి యది 'చేన్ద' యను రీతిని వ్యవహరింపఁ బడెడిదని మనము చెప్పగుదుము[6] ('చాద' శబ్దములోని ప్రథమాచ్చు ప్రాక్తనభాషలో 'ఏ' కారమేయని 'చేదు' ధాతురూపము నిర్ణయింపఁగలదు. 'చాద' శబ్దములో దీనికి భిన్నోచ్చారణము కలుగుటకుఁ గారణము ప్రక్కనున్న 'అ' కారము. ఇదియే ప్రాచీనాంధ్రములోఁ 'జేఁద' యనురూపమున మనకుఁ గానవచ్చును. ప్రాచీన భాషలోని 'చేఁద' 'చేఁదు' నీశబ్దముల లోని యర్ధబిందువుగూడఁ బ్రాక్తన కాలమున నీ శబ్దములలో 'న' కారము గలదను విషయమును స్థిరపఱుచును. ప్రాచీనాంధ్రములోని యర్ధబిందు వా కాలముననే యుచ్చారణనుండి తొలఁగిన నాసిక్యమునకు గుఱుతనుట ప్రసిద్ధ విషయము. ఇట్లు సంప్రదాయానుసారముగ నుండు లేఖన పద్ధతి మనప్రాక్తన భాషాస్వరూప నిర్ణయములను స్థిరీకరించుననుట కాంగ్ల భాషయందును నుదాహరణములు గలవు. Acknowledge, Knowledge అను రెండాంగ్ల శబ్దములను బరిశీలింపుడు. Knowlede అను పదములోఁ బదాదిని 'క' కారోచ్చారము ప్రస్తుత వ్యవహారమున లేదు. కానియది 'ఎ'యను వేఱుపదముతోఁ గూడినపుడు మాత్రము పదాది క కారోచ్చారణ వినవచ్చుచున్నది. కావున knowledge అనుపదములోఁ గూడఁ బ్రాక్తన కాలమునఁ బదాది క కారోచ్చారణ కలదని మన మూహింతుము. ఈ యూహను సంప్రదాయానుగతమగు వ్రాఁతలోని పదాది క కారము స్థిరపఱుచునుగదా! అట్లే యిప్పటి తెనుఁగులో వ్రాయుధాతువు 'రాయు' అనురూపము

---

6. 'చాన్ద + తాడు' అని యున్నప్పుడు మూఁడు హల్లులొకదాని తరువాత నొకటి యవ్యవహితములై యాంధ్రభాషా స్వభావమునకు విరుద్ధముగా నుండవలెను గాన నైనను 'త' కారముగా మాఱవలయు 'ద' కారములోపించి 'చాన్తాడు' శబ్దము సిద్ధించినదనుట యుక్తి సహము.

తోనే కానఁగును అయినను. ద్రావాలు 'చేవ్రాలు' అను శబ్దములలోని పదాదివకారము వలనఁ బ్రాక్తన కాలములో నిండును బదాదివకారము గలదని మనము నిర్ణయింపఁ గలుగుదుము. ఈ నిర్ణయము ప్రాచీనాంధ్ర భాషా స్వభావాను గుణమేగదా!

ఈపద్ధతుల నింకను విశదీకరించుటకుఁ గన్నడము నుండి యొక యుదాహరణమును సంస్కృతము నుండి మఱియొక యుదాహరణమును గైకొందము. కన్నడమున 'నీవు' 'అనగా' 'మీరు' అని యర్థము. 'మీయొక్క' యనునర్థమున 'నిమ్మ'యని వ్యవహరింతురు. ఈ రెండు రూపములలోను 'వ' కార 'మ' కారములు పరస్పరము మాఱుచున్నట్లు స్పష్టపడుచున్నది. ఈ రెండు వర్ణములలోను బ్రాక్తన భాషలోనున్న మూలవర్ణమేది యనువిషయము విచారణీయము. కన్నడభాష సంతతిని బరిశీలింపఁగా ద్విరుక్తముగా నున్నపుడు 'మ' 'వ' లు రెండును 'మ్మ' 'వ్వ' యను రూపములతోఁ జాలశబ్దములలోఁ గాననగును. కాని 'నీవు' అనుచోటునందుఁ బలె నచ్చులమధ్య మాత్ర మెప్పటను 'మ' కారము గానరాదు. దీనిని బట్టి యీ పరిసరములో 'మ' కారము 'వ' కారముగా మాఱిపోయినదని యూహింపనగును. కావున 'నీవు' 'నిమ్మ' శబ్దములు రెంటిలోను బ్రాక్తన భాషలో 'మ' కారమే గలదని నిశ్చయింతుము.

| | |
|---|---|
| మరుత్ | మరుతా |
| శరత్ | శరదా |

పై సంస్కృత శబ్దములను బరిశీలింపుఁడు. 'మరుత్' 'శరత్' శబ్దముల ప్రథమైకవచనరూపములు మొదటి వరుసలోను వాని తృతీయైకవచనరూపములు రెండవ వరుసలోను నీఁబడినవి. మరుచ్ఛబ్దములోఁ బ్రథమా తృతీయైకవచనరూపములు రెంటిలోనూ 'త' కారమే కానవగుచున్నది. కాని శరచ్ఛబ్దములో మాత్రము ప్రథమైకవచనములో 'త' కారము తృతీయైక వచనములో 'ద' కారమును గానవగుచున్నవి. ఈ రెండును భిన్నపరిస్థితులలో నుండు నొకేపదము నందలి ధ్వనులగుటచే నివి యొకే మూలధ్వనినుండి జనించెననుట స్పష్టము. ఆధ్వని 'త' వర్ణమా? 'ద' వర్ణమా? యనునదియే విచారణీయము. పైఁజూపిన తెలుఁగులోని శకటరేఫ, సాధురేఫల మూలస్వరూప నిర్ణయములోఁ బలె నిట్టియెడను భాషయంతటిలోను నుండెడి ధ్వని సంప్రదాయములను బరిశీలించుట యావశ్యకము. మరుచ్ఛబ్దములో రెండు రూపములలోను తకారమే గలదు కావునఁ బ్రాక్తనభాషలోను నందు తకారమే గలదని నిర్వివాదముగా జెప్పవచ్చును. శరచ్ఛబ్దములో మాత్రము ప్రథమైకవచనములో త కారమును తృతీయైక వచనములో దకారమునున్నవి. సంస్కృతభాషలోని శబ్దములనన్నిటిని బరిశీలింపఁగాఁ బ్రథమైకవచనములోఁ బదాంతమున దకార మెచ్చటను నుండదని తెలియఁగలదు. అనఁగా నీ ప్రథమైకవచన రూపములో దకారము తకారముగా భాష యంతటిలోను మాఱిపోయినది; తృతీయైకవచన రూపములో మాత్రము దకారము దకారముగానే నిలచియున్నది. దీనినిబట్టి ప్రాక్తనభాషలో మరుచ్ఛబ్దములో 'త' కారము గలదనియు శరచ్ఛబ్దములో 'ద' కారము గలదనియు మనము నిశ్చయింతుము. *మరుత్; *శరద్.

## మూలభాషా స్వరూప నిర్ణయ ద్వైవిధ్య పద్ధతి
## (Inverted Reconstruction)

ఇందలి పద్ధతు లింతక్రితము చెప్పిన తులనాత్మక వ్యాకరణ పద్ధతులకంటె భిన్నములు కాకపోయినను నిందుమూలభాషా స్వరూప నిర్ణయము రెండు భిన్న దృక్పథములచేఁ జేయఁబడును గాన దీనిని వేఱుగాఁ జేర్కొనవలసి వచ్చినది. దీని స్వరూపము నిట్లు సంగ్రహించి చెప్పవచ్చును—కొన్ని యధునాతన భాషలను బరస్పరము పోల్చి యిదివఱకు చెప్పఁబడిన పద్ధతులచే వాని మూలభాష స్వరూపమును నిర్ణయించుట. అట్టి మూలభాషకుఁ గూడ మూలభాష నూహించుటకుఁ బ్రపంచభాషలలోఁ గొన్నిటి కవకాశములు గలవు. అట్టి మూలభాష స్వభావము నధునాతన భాషలవలనఁ గొంతయు దానిమూలభాష స్వభావమువలనఁ గొంతయు నూహించుటయే మూలభాషా స్వరూపనిర్ణయ ద్వైవిధ్య పద్ధతి (Inverted Reconstruction) యనఁబడును. ఉదాహరణకు జర్మానిక్ భాషలను గైకొందము. ఇంగ్లీషు, సాక్సను, జర్మను, ఐస్లాండిషు, గాంధిక్ అను నీ యైదుభాషలును జర్మానిక్ భాషలని వ్యవహరింబఁబడును. వీనిని బరస్పరములపోల్చి మూలజర్మానిక్ భాష స్వభావము నూహింపవచ్చును. ఆమూల జర్మానిక్ భాషకుఁగూడ సోదరభాషలగు లాటిను, సంస్కృతము,

గ్రీకు మొదలగు భాషలలోని గ్రంథాద్యాధారముల వలన మనకు లభ్యములగుచున్న వివిధ సాహాయ్యమున వాని కన్నిటికి జన్మస్థానమగు మూలభాష (Proto-Indo-European)ను గూర్చి యెఱుఁగవచ్చును. ఇట్టియెడ మూలజర్మానిక భాష స్వభావమును మనము రెండు విధములుగా నెఱుఁగవచ్చును. మొదట నింగ్లీషు మొదలగు జర్మానిక భాషలనే పరస్పరము పోల్చి తన్మూలభాషా స్వభావమును నిర్ణయింతుము. తరువాత సంస్కృతాది భాషల సాహాయ్యమున నిర్ణయింపఁబడిన మూలహిందూ్వాంగ్ల భాషతోఁ దజ్జన్యమైన మూలజర్మానిక భాషను గలిపి పరిశీలించి దాని స్వభావమును గుఱించి మఱికొన్ని విశేషములను గ్రహింతుము. ఇట్టి పద్ధతి మూలభాషాస్వభావమును గూలంకషముగా నెఱుఁగుట కుపయోగించు ననుట స్పష్టము. ఈ పద్ధతికి మన ద్రావిడభాషలనుండి కూడ నుదాహరణ నీవచ్చును. తమిళము, మళయాళము, కన్నడము, తెలుగు మొదలగు కొన్ని భాషలు దక్షిణ ద్రావిడ భాషలనఁబడును. వీనిలోఁ బరస్పరసాదృశ్య మెక్కువగా నుండుటచే వీనియన్నిటికి మూల దక్షిణ ద్రావిడ భాష యొకటి యుండెడిదని మనము నిశ్చయింపవచ్చును. అట్లే యీ దక్షిణ ద్రావిడ భాషలను గోండీ, పర్జీ, కూయీ, బ్రాహూయీ మొదలగు నితర ద్రావిడ భాషలతోఁ గలిపి పోల్చి మూలద్రావిడ భాషా స్వరూపమును నిర్ణయింపవచ్చును. ఇప్పుడు తమిళ మలయాళాదులను బోల్చి నిర్ణయించిన మూలదక్షిణద్రావిడ భాషను మూలద్రావిడ భాషతోఁ గలిపి పరిశీలించిన మూలదక్షిణ ద్రావిడ భాషను గుఱించి మఱికొన్ని విశేషములు మనకుఁ దెలియును. దక్షిణద్రావిడ భాషలను బరస్పరము పోల్చి నిర్ణయించిన మూలభాషలో నజాదులుగాఁ గానవచ్చు 'ఉప్పు, ఈత' మొదలగు పదములు మూలద్రావిడములో 'చ' కారాదులుగాఁ గానవచ్చును. కావున మూల దక్షిణద్రావిడ భాషలోని కొన్ని పదములలో మూల ద్రావిడములోనున్న పదాది 'చ' కారము లోపించినదని మనమీ పద్ధతి వలననే చెప్పఁగలము. మూలదక్షిణ ద్రావిడము నిట్టియెడ మూలద్రావిడముతోఁ బోల్చి చూడని యెడల నిట్టి పదములలో బదాది 'చ' కారముండెడిదను విషయమే మనకుఁ దెలియుట కవకాశము లేదు. ఇట్లు కొన్ని భాషల మూలభాషకు సంబంధించిన విశేషాంశములను దెల్పుటయే యీ పద్ధతి ప్రయోజనము.

## ఉపభాషా కుటుంబ నిర్ణయము

### (Linguistic Subgrouping)

ఈ వ్యాసము ప్రథమభాగమునఁ గొన్ని భాష లొక భాషా కుటుంబమునకుఁ జెందుననుట కెట్టి యాధారము లుండవలెనో చెప్పితిని. అర్థసామ్యము, వర్ణసామ్యము గలిగిన పదములు బహుళముగా నుండి, పద వాక్య నిర్మాణపద్ధతులలోఁ గూడ సామ్యమున్న కొన్ని భాషల నొక భాషాకుటుంబముగా నేర్పఱుప వచ్చును గదా! అట్లొక భాషాకుటుంబమునకుఁ జెందునని మనము నిర్ణయించిన భాషలలోఁ గూడ సాదృశ్య విషయమునఁ దరతమభేదములుండును. ఉదాహరణకు ద్రావిడభాషలను గైకొన్నచో నీ విషయము స్పష్టపడును. తమిళము, మళయాళము, కన్నడము, తుళు, తెలుఁగు, గోండీ, పర్జీ, కోలామీ, కూయీ, కురుఖ్, మాల్తో, బ్రాహూయీ మొదలగు భాషలన్నియు ద్రావిడభాషాకుటుంబములోనివే. అయినను దమిళమునకు మళయాళము, కన్నడము, తెనుఁగు సన్నిహితము లైనంతగా గోండీ, మాల్తో, బ్రాహూయీ మొదలగుభాషలు సన్నిహితములు కావు. ఈ సాదృశ్య విషయమున రెండుభాషల మధ్యనుండెడి దూరముకూడ ప్రాధాన్యము వహించును. అనఁగా రెండుభాషలు భౌగోళికముగా నొకదాని ప్రక్క నొకటి యున్నచో నా రెండింటియందును సాదృశ్య మధికముగా గోచరించుచుండును. అట్లే రెండుభాషలు భౌగోళికముగా దూరముగా నున్నచో వానియందు సాదృశ్యము స్వల్పముగా నుండును. ఇట్టియెడ స్వల్ప సాదృశ్యము గల రెండుభాష లొకభాషా కుటుంబములోనివే యని నిర్ణయించుట యెట్లని సందేహింప నక్కఱలేదు. ఏలయనఁగా విస్తృత భూభాగము నాక్రమించికొనియున్న యొక భాషా కుటుంబమునకుఁ జెందిన కొన్ని భాషలలో రెండు చివరలనున్న భాషలలో సామ్యమంతగా లేకపోయినను వాని మధ్యనుండు భాషలలో మాత్ర మా రెండిటిఛాయలు గోచరించుచునే యుండును. తమిళమునకుఁ బర్జీభాషకును సాదృశ్యము తక్కువగా నున్నను వాని మధ్యనున్న తెనుఁగులో నా రెండు భాషల ఛాయలు గోచరించుచునే యున్నవి. కావున నిట్టి భాష లొక భాషాకుటుంబమునకుఁ జెందినవనుటకు విప్రతిపత్తి యుండఁబోదు. కొన్ని భాష లొక యుప భాషా కుటుంబమునకుఁ జెందినవనుటకుఁ గూడ రెండు

ముఖ్యములకు సాధారము లుండవలయును. అట్టి భాషలు భౌగోళికముగా సమీపముగా నుండవలెననుట మొదటి యాధారము. సాధారణముగా నధిక సాదృశ్యముగల భాషలు పరస్పరము సన్నిహితములుగానే యుండును. దీన్నికన్న ముఖ్యమైన రెండవ యాధారమిది—ఆ భాషలన్నిటిలోను వర్ణములలోనో పద నిర్మాణములోనో మూలభాషలో లేవని చెప్పఁదగిన కొన్ని నూత్నవిశేషము లుండవలెను. ఇట్టివానినే యాంగ్లమున Shared Innovations అని యందురు. ఉదాహరణకు ద్రావిడభాషలను గైకొన్నచో మూల భాషలోని కొన్ని పదముల మొదటనున్న 'చ'కారము తమిళము, మళయాళము, కన్నడము, తెనుఁగునను భాషలలో లోపించినదని పైనఁ జెప్పితిని. ఇట్లు పదాది 'చ'కార మీ భాషలలో లోపించుట యొక్క నూత్న విశేషము (Shared Innovation) కదా! కావున నీ నాలుగు భాషల నొక యుప భాషాకుటుంబముగా నేర్పఱిచి వీనిని దక్షిణద్రావిడ భాషలని వ్యవహరింప వచ్చును. ఇట్లే నాలుగు భాషలు నొక యుపభాషా కుటుంబమని చెప్పుటకుఁ గావలసిన మఱికొన్ని నూత్నవిశేషములు గూడ వీనిలోఁ గలవు. కాని విస్తర భీతిచే నిందవి పరామృష్టములు కాలేదు. ఇట్లు కొన్ని భాషల నొకయుపభాషాకుటుంబముగా నిర్ణయించుటకు వానిలో సమానములుగానున్న నూత్న విశేషములనే యాధారములుగా గైకొనవలెనుగాని యవి యన్నియు మూలభాషనుండి మార్పులేకుండ యథాతథముగా నిలిపి కొన్ని విషయముల (Shared Retention) సాధారముగా గైకొనరాదు. ఏల యనగా మూలభాషలోనే యున్న విశేషముల నర్వాచీన భాషలు వేనికవి స్వతంత్రముగాఁ దమలో నిలిపికొని యుండ వచ్చును. అట్టియెడ వాని నొక యుపభాషా కుటుంబముగా గ్రహించుటలోఁ బ్రయోజనముండదు. కాని కొన్ని సోదరభాష లొక నూత్నవిశేషమును దమలో సమానముగాఁ గలిగియున్నప్పుడు వానినొక యుప భాషా కుటుంబముగా గ్రహించినచో దానివలనఁ బ్రయోజనముగలదు. అట్లు సమాన నూత్నవిశేషములుగల సోదరభాషల నొక యుపభాషాకుటుంబమన్నచో వానిలోని సమానతకు మనమొక హేతువును జూపినట్లగుచున్నది. ఒక యుప భాషాకుటుంబములోనికిఁ గొన్ని భాషలను గైకొన్నచో మనమా భాషలన్నియు నొకానొక కాలమున నొక్కభాషగానే యుండి కాలక్రమమున నవి భిన్నములయ్యెనని చెప్పినట్లగును. ఇదియే యుపభాషా కుటుంబముల నేర్పఱుచుటవలని ప్రయో

జనము. కావున గొన్ని సూక్ష్మ విశేషములు కొన్ని సోదర భాషలలో నుండుటకు గారణ మా భాషలకే ప్రత్యేకముగా బూర్వమొక యుపమూలభాష యుండుటయును విషయమును నీ యుపభాషా కుటుంబ నిర్ణయ పద్ధతి నిరూపింపగలదు. ఇట్టి యుపభాషా కుటుంబముల నేర్పఱుచుటవలన వేరొక ప్రయోజనము గూడ గలదు. సోదర భాషలలో భిన్నములుగా నుండు నంశముల నీ పద్ధతి పృథక్కరించుటచే వానిలో నుండు సామ్యములు మనకు విశదములై రెండు భాష లొక భాషా కుటుంబమునకు జెందవేమోయన్న భ్రాంతిని దొలగించుటకుగూడ నిది యుపకరించును. ఈ పద్ధతి ననుసరించి భాషాశాస్త్రజ్ఞులు ద్రావిడభాషలను మూడు భాషాకుటుంబములుగా నేర్పఱిచిరి. దాని ప్రకారము ప్రస్తుత కాలపు ద్రావిడ భాషల పూర్వపరిణామక్రమ మిట్లుండియుండును. పురాతనకాలమున మొదట మూలద్రావిడభాష (Proto-Dravidian) యుండెడిది. అది కాలక్రమమున నీ మూడు భిన్న భాషలుగా విభక్తమైనది. మూల దక్షిణ ద్రావిడము (Proto-South-Dravidian), మూలమధ్య ద్రావిడము (Proto-Central-Dravidian), మూలోత్తర ద్రావిడము (Proto-North-Dravidian) మూడును భాషా కుటుంబముల మూలభాషలు మూడునివియే. మఱల మూల దక్షిణ ద్రావిడము తమిళము, మలయాళము, తోడ, కోట, కన్నడము, బడగ, కొడగు, తుళు, తెలుగు-అను భాషలుగా మారినది. మూలమధ్య ద్రావిడము కూయి, కువి, పర్జీ, ఒల్లారీ, కోలామీ, నాయకీ, గదబ, గోండీ, కొండ మొదలగు భాషలుగా మారినది. అట్లే మూలోత్తర ద్రావిడము కురుఖ్, మాల్తో, బ్రాహుయీ యను భాషలుగా మారినవి. ఇట్లొక మూలభాష కొన్ని యుపమూలభాషలుగా మారుటకును నవి మఱల భిన్నభాషలుగా మారుటకును గారణములు మాండలికము లేర్పడుటకు గారణములగు వలసలుపోవుట, రాజకీయములకు సంబంధించినవకును లేర్పడుట, వాణిజ్యకేంద్రము లేర్పడుట మొదలగునవియే యగుచుండును.

ఇట్లొక భాష యొక యుపభాషాకుటుంబమునకు జెందినంతమాత్రమున దానికి మిగిలిన సోదరభాషలతో సాదృశ్యముండదని తలపగాదు. భౌగోళికముగ మధ్యనున్న భాషలు కొన్ని విషయములలో నొక యుపభాషా కుటుంబముతోను మరికొన్ని విషయములలో వేరొక యుపభాషా కుటుంబముతోను బోలియుండవచ్చును. అట్టి మధ్యస్థములగు భాషలే రెండు సోదరభాషల సాదృశ్యమును బలపఱచుటకుపయోగించునని పైన జెప్పబడినది.

## ఉపసంహారము

ఈ వ్యాసమునందు జెప్పబడిన యీ పద్ధతులన్నియు గొన్ని యాధునాతన భాషల మూలభాషాస్వభావమును గాని, యొకభాషయొక్క ప్రాక్తన స్వరూపమును గాని యెఱుగుట కుపయోగించు ననుట స్పష్టము. ఇవియే తులనాత్మక భాషాశాస్త్రములోని ముఖ్యపద్ధతులు. తులనాత్మక భాషాశాస్త్రము దాని విస్తృతి వలన నందలి పద్ధతుల వైవిధ్యమువలన చారిత్రక భాషాశాస్త్రముకన్న భాషాచరిత్ర వివరణకెట్లు సమర్థతరము చున్నదో పైచర్చవలన దెలియగలదు. ఒకభాషకు చారిత్రక భాషాశాస్త్రము వ్రాయునపుడా భాష పూర్వస్థితినిగూర్చి యెఱుగుటకు ప్రాచీన భాషలో వ్రాయబడిన గ్రంథములు, శాసనములు మొదలగునవియే ముఖ్యాధారములగును. కావున చారిత్రక భాషాశాస్త్ర మిట్టి గ్రంథాద్యాధారములు లభించు కాలము నుండియే యొకభాష చరిత్రను జెప్పగలుగును. కాని తులనాత్మక భాషాశాస్త్రము కొన్ని సోదర భాషల నాధారముగ గొని కొన్ని వేల యేండ్ల క్రిందట నుండెడి మూలభాషను గుర్తించి యూహించి యప్పటినుండియు నా భాష యేయే మార్పులనొందెనో స్పష్టముగ జెప్పగలదు. అట్టియెడ నీ తులనాత్మక భాషాశాస్త్ర మొక భాష పూర్వచరిత్రనుగూర్చి చారిత్రక భాషాశాస్త్రము చెప్పలేని కొన్ని యపూర్వ విశేషములనుగూడ జెప్పగలుగుననుట యనుభవదూరము కాదు. ఇట్లు తులనాత్మక భాషాశాస్త్రము భాషాపరిణామముల నూహించుటకుపకరించి మూలభాషలోని వర్ణములను బదములను గూర్చి తెలుపుటయే గాక దీనివలన వేఱొక ముఖ్య ప్రయోజనమునుగూడ భాషాశాస్త్రజ్ఞులు సాధించియున్నారు. సోదరభాషలలోని వర్ణములనుబట్టియు బదములనుబట్టియు మూల భాషలోని వర్ణములను బదములను నిశ్చయించినట్లుగా సోదర భాషలలోని యర్థములనుబట్టి గూడ మూల భాషలోని పదముల యర్థములను నిర్ణయించి వాని మూలమున నా మూల భాషా వ్యవహర్తల నాగరికతను గూర్చియు, వారి నివాసస్థల విశేషములను గూర్చియు, వారి ముఖ్య వృత్తులను గూర్చియు పిలై సంతవఱకు భాషా శాస్త్రజ్ఞు లెఱుగగలుగుచున్నారు. ఇండో యూరోపియను భాషలన్నిటిలోను 'మంచు' అను నర్థమిచ్చు పదములు తుల్యములుగా నుండుటచే వాని మూల భాషను మాటాడిన వారు మంచువిస్తారముగా గురియు ప్రదేశములో వసించెడివారని చెప్పవచ్చును. అట్లే ద్రావిడ భాషలలో విల్లంబులకు వాచకములగు పదములు తుల్యములుగా నుండుటచే మూలద్రావిడభాషను మాటాడిన వారి కవి యాయుధములుగా నుండెడివని యూహింపవచ్చును. ఇట్లు తగుజాగ్రత్తతో నూహింపబడిన మూల భాషా వ్యవహర్తల స్థితిగతులను గూర్చిన విశేషములు మానవజాతి చరిత్ర రచనకు జేదోడు వాదోడుగా నుండు ననుటలో విప్రతిపత్తి లేదు.

# సూఫీ సుందరి

శ్రీ యస్. సదాశివ

ఆకృతి పూలతీవ; మరి యంబుదజాలము బోలు కుంతలా
లా కమలారి గేరు ముఖ మాసవ పాత్రలవంటి కన్నులా
లోకనముల్ శరమ్ము లతిలోకము రూప విభూతి యిట్టి నా
జూకుల ప్రోవవేకరణి సుందరి! నిర్దయురాలవైతివో!

కలదు లేదనిపించు కృశమధ్యము గెంపు
బోలు ప్రసన్ననిమోవి, కపోలభాగ
మందు కఱిమచ్చ వెలయు నిన్ననుగమించి
జగము తబ్బిబ్బు జెందు టాశ్చర్యమగునె!

దీపము ముందు వాల్చెదు త్వదీయ ముఖంబును జూచి, వెంటనే
వైపున కేగుటంచు శలభం బవిదగ్ధత సంచరించు, బు
ష్పాపచయంబు జేయు సమయంబున 'బుల్బులి' నీకపోలముల్
తేపకు జూచి వెంటబడు తీవ గులాబులుగా దలంచుచున్.

అదలించుటకు, బరిహాసంబునకె కాని
కదలదు పలుక, నవ్వోదవ బెదవి!
చురకత్తితో వ్రేసి చొక్కించుటకె కాని
బసరదు పరిరంభమునకు కేలు!
కనుదోయి మిరుమిట్లు గొనజేయుటకెగాని
అందదు స్పృశియింప నలరుమేను!
ఉరులట్లు హృదయంబు జెరపట్టుటకె కాని
దొరకవు సవరించుకొనుటకు కురులు;

ఎంత సౌందర్యముండిన నేమివచ్చె?
కరుణ యెఱుగని నీ స్నేహకాంక్ష యెంత!
అయిన నిను జూచి చూచి తన్మయతనందు
భాగ్యహీనుండు నీ పాలబడినవాడు!

అర్థమే కాని నీ తత్త్వ మరయ కొత
డెట్టి బాధలనైన సహించుగాని
విడువడెన్నడు నీ చింత నుడువ డెవరి
తోడ తనగాథ, దుఃఖింపబోడు, లలన!

అశ్రుకణములు రెప్పల నధిగమించి
తనరహఃకృత ప్రణయ మందరకు తెలియ
జేయునేమో యనెడు భీతిచేత దొలగి
చనును నిన్ను ప్రస్తావించు స్థలమునుండి!

ఆసవము త్రాగబోయి, నీయుశ్శు తెంచి
చషకమును జారవిడుచు నిషాకతమున –
స్మరణమాత్రాన తన్ను దా మఱచిపోవు
నతని పారవశ్యము మదిరాక్షి! కనుము!

తనసర్వస్వము ధారవోసి, యితర ధ్యానమ్ములన్ రోసి, నిం
దను శీర్షమ్మున మోసి, దుఃఖమును బాధన్ జేరగాదీసి, నీ
యనురాగమ్మును లేశమేని గనలే డా నీ ప్రియుం డంతమం
దున నున్మత్తత గానలం దిరుగు తద్దోషం బెవో కామినీ!

అంత మెఱుగని విరహానిశాంగణమున
జీవితము తెల్లవార్చు నీ చింత దగిలి
మెఱుగ డెన్నడు సంయోగ మిట్టిభాగ్య
హీనుడుండునె యితర సాహిత్య జగతి!

నీదు పరిపూర్ణ సౌందర్య వేదియగుట
నింపుకొనజూచు తనలోన నీ మధురిమ
విరహసంయోగములమాట విడిచి తుదకు
తానె నీవగు నెంతటి ధన్యుడతడు!

ఉవిదవో, సుందర ప్రకృతివో! పరమాత్మవో! కాని నీదు రూ
ప విభవ మద్వితీయము, స్వభావ మగమ్యము, తేజమిాత్రిలో
కవిజయకారకంబు; సరికాని, కవుల్ వినుతించునట్టి యా
నవమది నీ కృపారసమొ, సారయొ స్పష్టము కాదు కోమలీ!

# దిఙ్నాగ భవభూతి రూపకసామ్య పరిశీలన

శ్రీ నేలటూరు రామదాసయ్యంగారు

శ్రీరామచరితమును ఆదికవి వాల్మీకి చెప్పినదానిని తను తమ ప్రీతికొలది మరల తాము చెప్పను ఎందరు కవులు — వ్యాస కాళిదాస భోజదేవ భట్టిప్రముఖులు — తమకి పడినారు! అట్లే విశేషముగా దానిని నాటకముగా రచింప నేదియో సొగసు చెప్పుచు ఎందఱు — భవభూతి రాజశేఖర మురారి జయదేవ ప్రభృతులు — ఉవ్విళులూరినారు! వినను వారు పూర్వ చరితమునే పెల్లుగాఁ గొనిరి కాని ఉత్తరచరితమును విరళముగానే గ్రహించిరి. వారిలో భవభూతి పూర్వచరితమును 'మహావీరచరితము' చేయుటయ కాక, ఉత్తరచరితమును 'ఉత్తరరామచరితము' చేసినాఁడు. చేసి, 'కావ్యేషు నాటకేష్వేవ వయం వా వయ మేవ వా, ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే' అను నాభాణకము బడి అతిశాకుంతల మగు దానివలన తానిట్లు అతి కాళిదాసతకైన కీర్తిని గడించినాఁడు. అందుల కారణము చెప్పికొన్నాఁడు — పావన రఘుపతి చరితమందు తనకు భక్తి అని. "ప్రాచేతసో మునివృషా ప్రథమః కవీనాం, యత్ పావనం రఘుపతేః ప్రణినాయ వృత్తమ్, భక్తస్య తత్ర సమరంస్త మమాపి వాణీ, తాం సుప్రసన్న మనసః కృతినో భజన్తామ్." కాళిదాసు రఘువున వాల్మీకి చెప్పిన కథను ఉన్నదియున్నట్లు చెప్పినను, భవభూతి నిజ రామమహిమానుభవ పరీవాహముగా కథను, పూర్వమున ఉత్తరమునను, నాటకోచితముగా ఇంచించుక మార్చి కూర్చినాఁడు. సీతాహరణానంతరము అనతికాలముననే జటాయువువలన ఆవార్త విన్నందున వీరచరితమున రాముఁడు కరుణమూర్తియ కాక, 'ఏష మూర్త ఇవ క్రోధః శోకాగ్నిరివ జజ్ఞుమః, కృచ్ఛ్రాద్విభర్తి హృల్లేఖ లజ్జాసంవేగినీం తనుమ్.' అని వేఱు మూర్తియాయెను. అట్లే 'అస్తోక వీర మురుసాహస మద్భుతం చ' అని తన మహావీరచరితమును తొలుతనే కవి ఆ తెఱంగున నిర్దేశించెను. రామాయణ మన్నదో ఆదికవివాణి కరుణరస ప్రధానమని ధ్వనికారుఁ డానందవర్ధనుఁడు పలికినాఁడు — "ప్రబన్ధే చ అఙ్గీరస ఏక ఏవ నిబధ్యమానః, అర్థవిశేషలాభం ఛాయాతిశయం చ పుష్ణాతి. కస్మిన్నితి చేత్, యథా రామాయణే......రామాయణే హి కరుణో రసః స్వయ మాదికవినా సూత్రితః, శోకః శ్లోకత్వ మాగత ఇత్యేవం వాదినా. నిర్వ్యూఢశ్చ స ఏవ సీతాత్యన్త వియోగపర్యన్త మేవ స్వప్రబన్ధ ముపరచయతా." అని. అతఁడే 'శృఙ్గార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః, తన్మయం కావ్య మాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి.' అనియు, 'శృఙ్గారే విప్రలమ్భాఖ్యే కరుణే చ ప్రకర్షవత్, మాధుర్య మార్ద్రతాం యాతి యత స్తత్రాధికం మనః.' అనియు రసముల గుట్టు చెప్పినాఁడు. ఇవి కల వని తాపసవత్సరాజమున తాను . పట్టరాని సంతసములో మునిఁగితేలినాఁడు. ఈ రెంటిని సమకూర్చి స్వప్నమున భాసుఁడును, శాకుంతలోత్తరార్థమున కాళిదాసును నవకమాలని రసమును పాలించినారు. రామాయణమున ఉత్తరచరితము, జైమిని రచించినట్లు, సీతా పునఃసమాగమ సంస్కృతముగ చేసి ఆ మార్గమున సాటిలేని వస్తువగుననియు, కుందమాలా కారుఁడు ఆదారిం బట్టినవాఁడు దానిని అట్లట్లు వ్రాసినవాఁడే ఎంతో కీర్తి పొందఁగా భవభూతి దానిని అంతకన్నను నిపుణముగా రచించి సీతారామసేవ చేసి తన భక్తిని, వేదవేదాంగ పండితుఁడును పదవాక్య ప్రమాణ పారావార పారీణుఁడునయ్యు, ఆ యన్నింటికి ఒరగల్లగునని నాటక రచనయందు తా వహించిన యాసక్తిని పూరించుకొన్నాఁడు, కుందమాలను లెస్సగా పరికించి, దానిని ఆమూలాగ్రము తాను ధరించి దాని మార్గములు సన్నివేశములు అన్నియు తాను ఆకళించుకొని, అట్టి మార్గములనే అంతకన్నను చక్కఁ వఱచిన వాని యందును అట్టిసన్నివేశములనే అంతకన్నను చక్కఁవఱచిన వానియందును తాను కథ నడుపుచు. మఱియు జైమిని భారతమున చెప్పిన సంగతిని, కుశలవులు అశ్వమేధాశ్వమును బట్టి రామ తద్భ్రాతలతో పోరుటనుకూడ అవలంబించి దానిని సయితము అంతకన్నను మెఱుఁగుగా రసవంతముగామార్చి ఈ యుత్తర చరితమును గ్రథించినాఁడు. వాల్మీకి రామాయణమును రఘువున కాళిదాసు అనుసరించినది ప్రసిద్ధమేకదా. దానిని కుందమాలా

కొరుడు తన నాటకమునకు ఎట్లెట్లు కల్పించి సవరించుకొన్నాడో అదియు, ఆ రామాయణ కుందమాలలను భవభూతి తన నాటకమునకు ఎట్లెట్లు కల్పించి సవరించుకొన్నాడో అదియు తెల్లమగుటకు, రామాయణము ప్రసిద్ధము కావున దానిని అటుంచి, కుందమాల కథను ఉత్తరరామ చరితకథను సంగ్రహించి పరికింపదగును. దాన వాని పోలికలు పొడకట్టుటయే కాక, కుందమును ఉత్తరచరిత కట్లు మించినదో విశదమగును.

కుందమాలలో తొలియంకమున వస్తువు సీతను రామాజ్ఞచే లక్ష్మణుఁడు కొనిపోయి వాల్మీకి యాశ్రమము చెంత గంగయొడ్డున విడిచి పోవుటయు అంత ఆమె యేడ్పువిని ఆమెను ఓదార్చి వాల్మీకి తన యాశ్రమమునకు కొనిపోవుటయు, ఇందు సీతాలక్ష్మణుల శోకములు. ఉత్తర చరితలో చిత్రదర్శనమును, దాన సీత గంగాతీర తపోవనముల మరలఁజూడ నాసగొనుటయు, ఇంతలో చారుఁడువచ్చి సీతమీఁద నేమో జననిందయని రాముని చెవిలో చెప్పుటయు, అంత ఆ నిముసముననే లోకారాధనకై రాముఁడు పరిశుద్ధయైనను సీతను అడవిపాలు చేయనిశ్చయించుకొని, అందులకై లక్ష్మణునికి ముదలయించి, తాను ఉత్పత్తి పరిపూత విశుద్ధచారిత్ర నిప్పునకు నిప్పు అని నమ్మియు తనసీతను ఇట్లు చేయవలసి వచ్చినదే అని యేడ్చుటయు. ఈ రెంటను ఏసంవిధానము కరుణోత్తరము? రెండును కరుణోత్తరములే, ఇదియే కాదు కాదు, అంతకంటెను ఇదియే! అని పెనంగఁదగినవి. వినను భవభూతి నిర్వాహము రసవత్తరముగా నున్నది. లెస్సగా అరసిన నిజముగా రామశోకమే పెద్దది. సంభోగము ఇంచుక చూపి దానినుండి విప్రలంభమును దించుటచే ఇట ఉత్తర రామచరిత కరుణము సద్యఃపరభాగము నొంది మెఱుఁగెక్కినది. మఱియు కుందములో అప్పుడే సీతతో రామ సందేశమును జనాపవాదమునకై తన వివాసనమనియు, కలలలో తన్నే కౌఁగిలించుకొనుచుండుననియు, యజ్ఞములందు తత్ప్రతికృతిని సహధర్మచారిణిగా నుంచుకొందుననియు చెప్పించుటచే ఆ దుఃఖమునకు ఎంతయో ఊరట కూర్పఁబడినది. సీతయు రాముని లోకారాధన వ్రతమున సహభాగిని కదా. కుందమున ఇట సీత ప్రాధాన్యము, ఉత్తమ చరితమున రాముని ప్రాధాన్యము.

రెండు నాటకములందును మొదటి యంకమునకును రెండవదానికిని నడుమ దీర్ఘ వ్యవధానము పదిపన్నెండేండ్లు.

కుందమాల రెండవయంకమున సీత వాల్మీకియాశ్రమమున కుశలవులఁ గని పెంచుకొనుచు పది పన్నెండేండ్లుగా మునికన్యలతో కలసి మెలసి ఆశ్రమధర్మమున ఉన్నను, ఒంటిపాటుల రామవియోగమున మనసున నే భావములతోనున్నదో అది చెప్పఁబడినది. అట్టి యంతటి దానను ఇట్టి యీగతికి వచ్చితినే అని దుఃఖమును నిగ్రహించుచున్నదఁట. కుశలవుని కేని నాయనదర్శనమగునా అని ఆమె దైన్యము. ఇంతలో రామాశ్వమేధమునకు వాల్మీకికులవారికి పిలుపు. అది విని సీత కుశలవులను ఆ యజ్ఞమునకు పోవువారితో అచటికి పంపఁగోరును. *ఉత్తరచరిత రెండవ యంకమున రాముఁడు* సీతావియోగదుఃఖమున కుములుచున్న పన్నెండేండ్లకు అశ్వమేధము తొడంగి ఇంతలో బ్రాహ్మణశిశు సంజీవనముకోసము శంబూకుని వధించుటకై అతఁడు తపస్సు చేయుచున్న దండకాజనస్థానమునకు తనకు తెలియకుండనే పుష్పకముచే చేర్పఁబడును. సీతా సహవాస సాక్షులగు ఆ పంచవటిని ఆ చుట్టుపట్టులను చూచి ఇట్లు ఇవుడు సీత లేకపోయినదే అని సీతకు తాఁ గావించిన కీడును తలఁచుకొని మిక్కిలి దుఃఖించును. అతికరుణము. ఇంతలో అగస్త్యులవారు పిలువ నంపగా తాను వారిని దర్శింపఁబోవును. కుందమాల సీతను చూపి పన్నెండేండ్ల సీతదుఃఖమును చెప్పఁగా, ఉత్తరచరిత రాముని చూపి పన్నెండేండ్ల రామదుఃఖమును—స్వప్న తాపస విక్రమ శాకుంతలములు నాయకదుఃఖమునే ప్రధానముగా చెప్పినట్లు—చెప్పినది.

కుందమాల మూఁడవ యంకమున నైమిశము. అందు సలక్ష్మణుఁడు రాముఁడు 'ఏమై పోయినదో కదా సీత !' అని పరిదేవించుచు వాల్మీకి యాశ్రమమును దఱియుచో గోమతిలో సీత—కూర్పు నేర్పును జ్ఞప్తిసేయు కుందమాలను—భాసుని స్వప్నమందలి వాసవదత్త మాలగుచ్చు నేర్పును విరహి వత్సేశునికి జ్ఞప్తి సేయు పద్మావతి పెండ్లిమాలం బోనిదానిని—చూచి, అటుపై గట్టుమీఁద రేఖాకమలతిలకితమును సీత యడుగుజాడం బోని యడుగుజాడను గాంచి, ఆసతో అనుసరించి, అంతట అది యగపడకపోఁగా మార్గశ్రమకై రవంత చెట్లనీడలో కూర్చుండును. ఆ తేట నీటియేటి జాలుతోడి యా యందమైన యడవి సన్నివేశము మునుపటి తన సీతసావాసముతోడి దండక సన్నివేశమును స్మృతికి ఎలయింపఁగా, అయ్యో జానకీ, వన

వాసవహాయినీ అని అతివిక్లబుఁడై గొంతెత్తి యేడువఁ జొచ్చును. దానిని అటనే చెట్లచాటున ఉన్న సీత విని చూచి పొంగిన శోకముతో రాముని కన్నీటిని తాను తుడుతునా అని అటు పోఁబోయి, ఇంతలో ఎవరేని చూతురేమో అని జంకి, కుశలవుల సంభావించెద నని వెడలును. ఇంతలో వాల్మీకి శిష్యుఁడు వెదకికొనుచు ఎదురువచ్చి రాముని ప్రభువును వాల్మీకి దర్శనమునకు పిలుచుకొనిపోవును. ఇట్లు ఇట ఒకసారి సీతకు రాముఁడు అగపడినాఁడు, అతని పరిదేవనము సీతకు వినఁబడినది. 'న ఖలు స జనః శోచనీయః, య ఏవం వల్లభేన శోచ్యతే.' అని సీత తన ధన్యతను పలికినది.

కుందమాల నాలవయంకమున శ్రీరాముఁడు నైమిశ రామణీయకమును తిలకించుచు విహరించుచుండి, అచటికి వీచిన హోమధూమరాశికి తన యెఱ్ఱవాచిన కన్నులు మఱింత మండఁగా వానిని చన్నీటితో కడిగికొనుటకు అచటి యాశ్రమంపు డిగ్గియలో దిగును. ఆ డిగ్గియ చెంత ఆ పనికి ఈపనికి అక్కఱపడి నడయాడు స్త్రీలు మగవారి కంట పడకుండ తిరస్కరణమును వాల్మీకి నిజతపఃప్రభావమున అనుగ్రహించియున్నందున రామునికి తా నగపడకుండుటకై ఆదినాలలో సీత అక్కడ ఒడ్డున కాలము పుచ్చుచున్నట్టిది అప్పుడు నీటిచేరువ నుండఁగా నీటిలో ఆమెనీడ రామునికి అగపడును. ఇంతలో ఆమె అపసరిల్లగా—స్వప్నమున కలలోనుండి తటాలున మేల్కొన్న వత్సేశునికి అనిద్రమనకలో వాసవదత్త అగపడి మాయమైనట్లు—అది అటు మాయమగును. అంతట రాముని మూర్ఛ. సీత వచ్చి కౌఁగిలించుకొని తేర్చుట. తేఱి, రాముఁడు 'నేను మరల వెన్నెలరేయిని నీ ప్రక్కన ఎప్పుడు పుత్తునే, ప్రేయసీ!' అని తలపోసికొని మరల మూర్ఛిల్లుట. సీత తన చెలి చిత్రకూట వనదేవత మాయావతి మునుపు ఒసంగిన తన పైట చెరఁగుతో వీచుట. రాముఁడు ఆ తాఁకుడునకు ఆ కొంగును పట్టుకొని కన్నీటిం దుడుచుకొన లాగఁగా అది పట్టువడి చేతికి వచ్చి రామునిచే ఆనవాలు పట్టఁబడుట - దానితో రాముఁడు సబహుమానముగా, ప్రియాలింగనము వలె, అప్యాయముగా తన్ను కప్పుకొని తన యుత్తరీయమును పాఱవేయుట. అది సీత చేతఁబడి బయలిలో మాయమగుట. దానితో సీత తన్ను కప్పుకొని ప్రియాలింగన సౌఖ్యము నొంది, ప్రొద్దు క్రుంకఁబోవఁగా తాను ఆశ్రమమునకు మరలుట. ఆసలు ఈరికెలెత్తి రాముఁడు ప్రకృతు లగపడక అట్లు ప్రతికృతు లగపడుట అసిద్ధాశ్రమ మహిమ కాఁబోలు ననుకొనుచున్నంతలో తన వయస్యుఁడు వచ్చుట. ఇదెల్ల అప్సరస తిలోత్తమ కావించిన తమాషా మోసము అని తా నెఱుంగుదు ననుట. అయోధ్య దప్పికి ఎండమావులను దోసిలించితి నే అని రాముఁడు అనడింది సాయంకాలమునకు ఆశ్రమము చేరుట. ఇందు మరల నొకమారు సీతకు రామసమాగమము చెప్పఁబడినది. అంకమున రాముని కంటె సీతయే ప్రధానీకృతయా అని తోఁచును. కాదా ఉభయుల సమప్రాధాన్యము. ఇందు తిరస్కరిణీ మహిమచే సీత రామునిఁ గాంచుట, తాను అతనికి అగపడకుండుట, సీత కౌఁగిలించుకొని ఆ స్పర్శసుఖముచే రాముని మూర్ఛ తేర్చుట, చిత్రకూట వనదేవత మాయావతి, 'అహో అత్యాగరాగ్యాః ప్రాణాః! నిత్యప్రసన్నాహమ్' అని సీత పలుకుట—ఇవి పరికింపఁదగును. ఇంతెల్ల ఇటు సీతయు అటు రాముఁడు ఒంటరులు. ఇదెల్ల కరము రసవంతము గానే ఉన్నను ఇనుముప్రాయమే అని తోఁచి అది భవభూతి ప్రతిభాపరశము సోకి ఎంతటి సువర్ణమాయెనో అరయఁదగును.

ఉత్తరచరిత మూఁడవ యంకమున ఈ కుందమాల రెండంకములం దోచునదియు ఒక్కట సమాహరింపబడినది. అదెట్లో ఉత్తరచరిత తృతీయాంక వస్తువున విశదమగును. సీతకు ఎన్నఁడో చిత్రకూటమున ఒకసఖి వనదేవత మాయావతి ఆ యుత్తరీయము నిచ్చి యుండెను అని మాయావతిప్రస్తావమాత్రముకుండలో, భవభూతి సృజించిన జనస్థాన వనదేవత వాసంతి ఉత్తర చరితలో ప్రధానపాత్రమై రాముని కరుణవృత్తమును ఆహా యెట్లెట్లు నడపినది. అందు సీతకు వాల్మీకి మహిమచే తిరస్కరణము, గాన ధీరముగా తెగించిన సీత యాలింగనము ఉత్తరీయ వీజనము మొదలగునది. ఇందు సీతకు భాగీరథి మహిమచే తిరస్కరణము దాన ధీరముగా తెగించిన సీతకరస్పర్శ మొదలగునది. వానిచే ఆరసోత్తర ప్రపంచము. అందు సీతారాములు ఒంటరులైన ఇందు ఆమెకు తమసయు ఆయనకు వాసంతియు తోడై రసము వెల్లిగొల్పను కలుజపోతింపను, రసంపు జాలుకు మడవవేయను తీయను మిక్కిలి ఉపకరించిరి. మఱియు ఈ సంవిధానమునకు కుందమునందలి యాజ్ఞముకోసను క్రొత్తగా వారు ఇటునటు విడిసిన నైమిశమునకన్నను వారిపూర్వ విహార సాక్షులతోడి సాక్షాజ్జనస్థాన పంచవటి యొట్టి

మేలిచోటు! మహాకవి తనకల్పనకు తానే తనిసి అబ్బురపడి ఆహా ఎట్లు కుదిరినది!. సీతారాములతోఁ గూడ తాను ఎట్టి బ్రహ్మానందమును అనుభవింప, గంటివి! 'విద్యేమ దేవతాం వాచ మమృతా మాత్మనః కలామ్' అను తన యాశంస ఎట్లు ఫలించినది! అని "అహో సంవిధానకమ్!" అనియు "ఏకోరసః కరుణ ఏవ" అనియు తన్మయతతో చెప్పికొన్నాడు. అంకమున రామప్రాధాన్యమునే ప్రోదిచేసినాడు. ('సోచ్ఛ్వాసమ్) ఉత్ఖాత మిదానీం మే పరిత్యాగ శల్యం ఆర్యపుత్రేణ' అని ఈ సంవిధాన ప్రయోజనమును సీతచే చెప్పించినాడు. మఱియు పృథ్వీ భాగీరథులచే తల్లి యత్తలచేతం బోలె సీతకు కొన్ని చేయించి సీతను భాగీరథమ్మ యింటను కుశలవులను వాల్మీకి నాయనవద్దను ఉంచి, కందములోని కన్నను మనోహరమగు 'ఇతివృత్త కౌటిల్యమును' గూర్చినాడు.

కుందమాల యైదవ యంకమున రాముడు తన నైమిశ లక్ష్మీనివాస భవనమున జనులు కిటకిట నిండి యుండ యజ్ఞమునకైన తపోధనుల సమాగమము తానెదురు చూచుచుండఁగా కుశలవులు తాపస కుమారులు వాల్మీకి శిష్యులుగా ప్రవేశించి రాము నెదుటికి కొని రాఁబడుదురు. అంతట వారిని రాముడు ఆనవాలు పట్టుటకైన యుల్లిక, కంచుకి ప్రభృతులు వారిం గాంచి, కన్నుల నీరు తేఱి, మహారాజు దినాల రామలక్ష్మణుల బాలభావమును స్మరించుచున్నా రందురు. రామునికిని వారిని చూచిన మాత్రకు కన్నుల నీరు తేఱును. మనసు అటు ప్రమొగ్గును. అందలి సాధ్వస ప్రహర్ష శోకానుక్రోశముల కూడలికి రాముడు మూర్ఛిల్లి అంతలో తెప్పిఱిల్లి, ఆ దేహబంధము ఆ వేషము ఆ నడక చూచి వారు కులీనులు గావలయునని శంకించును. వారు తన్ను నమస్కరించి కుశలమడుగఁగా వారిని ఆలింగనము చేసికొనక ఉండలేక పోవును. చేసికొని తనయ పరిష్వంగ సౌఖ్యమును స్మరించుకొనును. తనయొడిలో కూర్చుండ బెట్టుకొనును. వారి వయసు సీత నిర్వాసకాలమునకు సరిపోవుచున్నదని యనుకొనును. మనసున తనంతట అనుకంపా ద్రవత చెందును. సింహాసన స్పర్శమున అరాఘవులకుంబోలె వారికి తలపగులమిని ఎంచుకొనును. వారు క్షత్రియ బ్రహ్మచారులని, సూర్యవంశమువారని, అమడలని, వారికి వాల్మీకి ఉపనయన గురువే కాని కన్ననాయన కాడని వారి కన్ననాయనను అమ్మ నిరనుక్రోశుఁడని పేర్కొనునని, ఆయనను తాము చూచి యెఱుంగమని, తమ యమ్మపేరు తాపసులు దేవియని వాల్మీకి వధువని యందురనియు వారి వలన ఎఱింగి, అది సర్వము తనకుటుంబవృత్తాంతముతో సంవదించుచున్నదని చిత్తమున ఉయ్యాల లూగును. ఇంతలో వాల్మీకి దూత వారిని 'ఏరీ వారు, మధ్యాహ్నము కావచ్చినదే, సవనకాలము దాటకముందే రామునికి ఆ దేవునికథ పాడి వినిపింపవలసి యుండె నే!' అని పిలుచును. ఇది యిందలి యభిజ్ఞాన క్రమము.

ఆఱవయంకమున వారి రామాయణ గానము, సీతా వివాసనమువఱకు. తరువాతి చరితము వారికి ఒప్పగింపరాదు, ఆ తరువాతి చరితమును రాముని ముని వయస్యుడు కణ్వుడు పాడఁగా అందు సీత వాల్మీకి రక్షితయై అమడలం గనగా వారికి ఆయన కుశలవులని పేరిడెనని వినగానే కుశలవులు నాయనను రాముని, రామలక్ష్మణులు కొడుకులను కుశలవులను ఆలింగనము చేసికొని, నలువురును ఒక్కట మూర్ఛిల్లుదురు. అంతట వాల్మీకి సీతను వెంటగొని అచటికి వచ్చి వారిం దేర్చును. తేర్చి రాముని చూచి సీతశుద్ధిని అన్ని విధాల ఎఱింగియు, వట్టి జనవాదమాత్రకు అగ్గల తఱిమితివని కోపము చేసి, 'సరే, అమ్మా ఈ యందఱి యెదుట నీ యాత్మశుద్ధిని మఱొకమాఱు రుజువు చేయవమ్మా' అనును. అంతట సీత నేనే గనక పతివ్రత నగుదునేని మాయమ్మ భూతధాత్రి ఈ యందఱికి దివ్యరూపాన కన్నుల కగపడి నా శుద్ధిని చాటును గాక అనుటయు, అంత కొండలు ఊఁగ సముద్రములు పొంగ పెనుమ్రోతతో విశ్వంభరాదేవి దివ్యరూపముతో ఆవిర్భవించి సీతశుద్ధిని మఱి సందేహము లేకుండునట్లుగా చాటి ఎల్లరను ఒప్పింపగా రాముడు సీతను మరల అంగీకరించి తనతో యజ్ఞదీక్షకు పూన్చును. అంతట వసుంధర అంతర్ధానమగును. రాముడును వాల్మీకిచే కుశుని రాజ్యమున అభిషేకింపించి, తానే స్వంతముగా లవుని యౌవరాజ్యమున అభిషేకించును.

ఉత్తరచరితమున భవభూతియు నాలవయంకము నుండి కుశలవాభిజ్ఞానమునకు అల్లిక తొడంగును. ఐదవ యంకమున కొంత సాగును. ఆఱవ యంకమున ఎక్కువగా ప్రవర్తిల్లి అది యేడవ యంకమున నెఱవేఱును. ఆకరుణ నాటకమున జనకుని కౌసల్యారుంధతులను వసి

ష్టులవారిని సీతాశోకమునకై అట్లు వలస వచ్చిన వారింగా వాల్మీకి యాశ్రమమునకడఁగూర్చుట భవభూతి ప్రతిభోన్మేషపు రసవత్సృష్టి. వారికే ఆ సీతారాముల పోలికలచే లవుఁడు దౌహిత్రుఁడు పౌత్రుఁడు దేవునికిని అమ్మవారికిని కొడుకు అని దాఁగుడుమూఁతగా తోఁచి వారి చిత్తమున భావములు రేపును. అది అభిజ్ఞానారంభము. కుందమాల యందలి వాక్యమునకు 'కంచుకి ప్రభృతులు వారియెడ రామలక్ష్మణుల పోలికలను బట్టి తేరిన కన్నీళ్ళతో వారితో ఏమేమో మాటలాడుచున్నారు' అనుదానికి ఇది అద్భుత విస్తరము, ఒక పూర్తి యంకము. ఐదవయంకమున సుమంత్రుఁడు విల్లుఁదాల్చిన లవుం గాంచి కౌశిక మఖ రక్షక బాల రాముని స్మరించును. అతని జృంభకప్రయోగముం గాంచియు, ఆకారమును నిపుణముగా పరికించియు ఒక వేళ ఇతఁడు సీత కొడుకగునా అని శంకించును. చంద్రకేతువును 'నవ ఇవ రఘువంశస్యాప్రసిద్ధః ప్రరోహః' అనియు, 'పురాణో వా జన్మాన్తర నిబిడ బద్ధః పరిచయః' అనియు, 'నిజో వా సమ్బన్ధః విధి వశాత్కోఽప్యవిదితః' అనియు వితర్కించుచు లవ దర్శనమున తన్మయతా చిత్తప్రసన్నతా మోద పరిరంభణేచ్ఛలను పొందును. వీరరసము నాయకనిష్ఠమైనను శృంగారమునకు అంగికి విరోధము కాదుగదా. మఱి అది యిట ఇట్లు కుమార నిష్ఠమైనచో ఇఁక చెప్పవలయునా? అనంతర వృత్తమునకు ఇది కరము శ్లాఘ్యమగు పరభాగముఁ గూర్చును. కౌసల్యా జనకుల యేడ్పునకైనావల యంకమునకును రాముని యేడ్పునకైన యాఱవ యంకమునకును నడుమ ఈ కుమారవిక్రమము లోభనీయమైన విచ్ఛేదమై మనసునకు ఎంతయో చమత్కారము కలిగించుచున్నది.

ఆఱవ యంకమున లవ రామసమాగమము. తరువాత వారితో కుశసమాగమును. సప్తలోకైక వీరుఁడును సకల రాక్షస విరాముఁడు నగు రాముని కొమారుల యందు కుందమాలలో పరాక్రమ సూచనకు అవకాశము లేనే లేదు. ఇందందుల కెంతేని అవకాశము కల్పింపఁబడినది. రాముఁడు లవుని యాకార గాంభీర్యమును కనిపట్టును. లవుఁడు పుణ్యప్రభావ దర్శన మహాపురుషుఁడుగా చూడఁగానే తోఁచిన రామునిఁ గాంచి, తమంతనే తన వైరగర్వము లడంగి, వినమ్రుఁడైపోవును. రాముఁడు నిమిత్త మెఱుంగకయే ఏ గూఢహేతువుననో లవునియెడ స్నేహము నొందును. లవుఁడభివాదనము చేయును. రాముఁడు తానాతని కౌఁగిలించుకొని తన్నాతని చిక్కఁగా కౌఁగిలించుకొమ్మని, ఆ తాఁకునకు ఆనంద మొందును. అశ్వసేనపై అతఁడు చూపిన వీరము నభినందించును. జృంభకాస్త్రములు అతనికి స్వయంప్రకాశములు అనఁగా అది యే పుణ్య మహిమనో అనుకొనును. ఇంతలో లవునికి బాసటగా కుశుఁడు ధనువు నాస్ఫాలించుచు వచ్చును. ఆ పౌరుషాతిశయమును రాముఁ డభినందించును. కుశుఁడు రాముని రూప ప్రసాదానుభావములకు పరవశుఁడగుచు అభివాదనము సేయును. రాముఁడు అతని చీరి కౌఁగిలించుకొని అమృతపు మడుఁగున మునిఁగి తేలును. తాను ఆ బాలుర సకల భావములు, వినయము, స్థితము, ఆసనము మొదలగునవి సామ్రాజ్య సూచకములని అనుకొనును. వారియందు రఘుకులకుమారుల పోలికలను కనిపట్టును. వారియందు తన పోలికమాత్రమే కాదు, సీత పోలికయు ఉన్నదని తలంచును. అది సీతను విడిచిన వాల్మీకి తపోవన ప్రాంతమనియు, వారికి జృంభకములు స్వయం ప్రకాశములగుట నాడు చిత్రదర్శనమున తన దీవెన ప్రభావము కాఁబోలు ననియు, దేవేరి గర్భము రెండుగా నుండుటను తాను గనియుంటి ననియు తన మనసునకు తెచ్చుకొనును. అన్నిటికి పైన వారి సమాగమమున తన యాత్మలోని సుఖాతిశయమును తలంచుకొనును. వారిచేత రామాయణమును అటనట పఠింపించి విని సీతకైన తన దుఃఖమున శోకపుటమునం బోలె ఉడుకును. ఇంతలో వసిష్ఠారుంధతీ జనక కౌసల్యలు అచటికి పడుచు లేచుచు వచ్చుచున్నారని విని వారిని సంభావింప బోవును.

ఏడవ యంకమున భవభూతి నిర్వహించిన నిర్వహణము అంతర్నాటికా పూర్వకము కరము సుశ్లిష్టముగా కుందమాల నిర్వహణమున కన్నను ఎన్నియో మడుంగులు నాజూకుగా నున్నది. ఇందు అనావశ్యకమును కుదిరిక లేనిదియు నగు కుశలవుల యభిషేకము లేదు. వివాసనము మొదలు నాటివఱకు జరిగిన సీతచరితము, వాల్మీకి ఆర్ష నేత్రముతో చూచి యెఱింగి రచించినది రామాదులయు జంగమ స్థావర సకల ప్రాణులయు ఎదుర నాటక మాడఁబడినది. అంతట కుందలో చెప్పినపృథ్వియావిర్భావము తెఱంగునకన్న నాణెముగా సీతను వెంటగొన్న పృథ్వీభాగీరథుల యావిర్భావము చెప్పఁబడినది. వారు ఆచిత్రదర్శన వివాసన సమయములందు రాముడు తమ్ము కోరిన పనిని సీతా పర్యవేక్షఁ

మును అట్లే చేసితిమని ప్రభువునకు రామునకు నివేదించి, తను మెచ్చిన శీలశాలినిని పతిదేవతను సీతను అరుంధతికి అప్పగించి అంతర్ధాన మగును. అరుంధతియు సీత పుణ్యచారిత్రమును ఎదుట దీనినంతయు పరికించుచున్న లోకమునకు చాటి ఒప్పించి సీతను రామునితో యజమానపత్నిగా కూర్చును. ఆమె మాటమీదనే వాల్మీకియు కుశలవులం దెచ్చి సీతారాములకు అప్పగించును.

కుందమాలలో చెప్పిన కుశలవుల యభిషేకముల జూడగా సీతావివాసమునకు పూర్వము రాముడు చిరము రాజ్యమేలెననియు అంతట ఈ సీతా గర్భధారణ వివాసన విగ్రహ దుఃఖములు కలిగినవనియు, ఆ కాలమున రాజ్యనిర్వేదము కలిగిపోయినదనియు, అంతట ఈ సమాగమము సిద్ధింపగా కొడుకులును తన్ను కలసికొనగా వారిని అభిషేకించి తాను విరతుడాయెననియు తోచును. అట్లే ఉత్తరకాండలో సీతాగర్భధారణ వివాసనములకు ముందు (42 సర్గ-26 శ్లో) 'దశవర్ష సహస్రాణి గతాని సుమహాత్మనోః ప్రాప్తయో ర్వివిధాన్ భోగా నతీతః శిశిరాగమః'' అని ఒక పదివేల యేండ్లు చెప్పబడినది. దీనింబట్టి లంకనుండి మరలిన పదివేల యేండ్ల తరువాత సీతకు గర్భమును, ప్రజలలో సీతంగూర్చిన యీ పరగృహవాసదూషణమును పొసగినవని యేర్పడును. దాన నాటకమున వస్త్వనౌచితి తోచును. అట్లు పదివేలయేండ్ల యోజము చెప్పక, రామాభిషేకమునకు తరువాత యథోచిత వ్యవధానము మాత్రము గ్రహించి గర్భమును పడిని చెప్పిన రసవంతముగా నుండును. ఇటీవలనే అన్ని పాట్లుపడి భయంకర వియోగదుఃఖముల ననుభవించి ఇల్లు సేరి గవంత పోయి గన్న సీతకు మరల నింతలో ఈ దుఃఖమా, అదియును నా వలననే యగునా అని రామునియు అట్లే సీతయు కరుణము ప్రశంసనీయముగను మానసముల కరగించునదియు అగును. కాళిదాసు ఈ మార్గము నవలంబించినాడు. భవభూతియు అలంతి మార్పులతో ఈ మార్గమే పటినాడు. ఇందు పునఃసంయోగానంతరము—భూప్రవేశానంతరమేని—పదివేల యేండ్లు ఏలి తరువాత సుతవిన్యస్తరాజ్యుడై విరమించుట లెస్సయగును. అందులకు అవకాశము కలుగునట్లుగా పునఃసంయోగ ఫలప్రాప్తితో నాటకము ముగియుట శ్లాఘ్యమగును. వాల్మీకి 99 స-9 శ్లో. లో మరల చెప్పిన 'దశవర్ష సహస్రాణి వాజిమేధా నథా కరోత్' అను మాటయును, తరువాత 107 స-17 శ్లో-న చెప్పినట్లు తన నిర్యాణమునకు అనతివ్యవహితముగా 'కోసలేషు కుశం వీర ముత్తరేషు తథా లవమ్, అభ్యషిఞ్చ న్మహాబాహు రుభౌ రామః కుశీలవౌ'. అను రాజ్యాభిషేకములును అవకాశము పొంది నసిసకును. కుందమాలలో కుశలవాభిషేకముల జెప్పుటచేత గర్భధారణకు పూర్వపు దశవర్ష సహస్ర రాజ్యమును అందు ఆ సీతావియోగకాలమున నిర్వేదము తోచుటయు, దాన పునఃసంయోగోత్తర క్షణముననే కుశలవుల యభిషేకమనియు గ్రహింపదగును. మఱి అట్లు పదివేల యేండ్లకా సీతకు గర్భధారణ పరగృహవాసదూషణ వివాసనములు అన్యాయనౌచితి శంకను తొలగింపరాని దానిని అట్టి వాల్మీకి మాట కలదు కదా అని తొలగింపజూచినను లవకుశులకు ఇట్లు పన్నెండేండ్లకే రాజ్యాభిషేకమా అనుటయు అదియు ఈ నాటకమున ఉద్దిష్టఫలమా అనుటయు అనౌచితులుగా తోచకమానవు. కుందమాలలో ఎందును రామునికి రాజ్యమున నిర్వేదమునకు గమకము లేదు. మఱియు ఇందు ఈ కుశలవాభిషేకమునకు ముందు ఈ పదివేలయేండ్ల రాజ్యభోగములను రామునికి, నాటకమున కంతరవముచే చెప్పకుండగా, ఊహింప నేల యన్న, ఊహింపకున్న ఈ భూమిలో రామరాజ్యకాలము సర్వమును పన్నెండేండ్లే యై రామరాజ్య మన్న ఆ ప్రసిద్ధి దెబ్బ తినును.

దిఙ్నాగుడు కుందమాలాకారుడు బౌద్ధుడో జైనుడో వేదాంతియో, కుందమాలకథను అత్యుదాత్తముగా 'మింటనే' నడపినాడు. ఋషికుమారుని చేత 'రామాభిధానో హరిః' అనియు, లక్ష్మణుని చేతనే రామునిం గూర్చియు సీతం గూర్చియు 'రామాహ్వయస్య గృహిణీ మధుసూదనస్య' అని వారు సాక్షాల్లక్ష్మీనారాయణులే అనియు, అట్లే వాల్మీకి దూత చేత 'వాల్మీకినా మునివరేణ మహాగథస్య యూసౌ పురాణపురుషస్య కథానిబద్ధా' అనియు, రాముని చేతనే దాని యనువాదముగా 'కథా చేయం శ్లాఘ్యా సరసిరుహనాభస్య, అనియు పలికించినాడు. ఇది 'ఆత్మానం మానుషం మన్యే' అను రాముని మానవతాభిమానమునకు వెలితియై ఇంచుక రసప్రవాహమునకు అడ్డంకియైనను, అది తోచకుండునంత నిపుణముగానే సీతారామచరితాతిపవిత్రత నిర్వహింపబడినది. ఉత్తరచరితమున ఇట్టి హరి మధుసూదనాది ప్రస్తావమును చొరనీలేదు. రాముని మానవతాభిమానము రక్షింపబడినది. ఐనను ఇందు సంవిధానము

లెల్ల ఐహికములే అయినను అతిలోకకల్పనలై సీతా రాముల ఉదాత్తతకు సదృశములై అలరారినవి. ఇందు (అగస్త్య) వసిష్ఠ వాల్మీకులు (లోపాముద్రా) అరుంధతీ పృథ్వీ భాగీరథులు, తమసా వాసంతీ మురళలు రాముని సీతను మహారాజా మహారాజ్ఞి అన్న గౌరవముతో ఎంతో అంతకన్నను అపత్యవాత్సల్యముతో భక్తి నెరసినారు. అదెల్ల భవభూతి హార్దభక్తి ప్రసాదమే. అతిరసవంతము నైనను ఈయతిపవిత్ర నిర్వాహమును వాల్మీకి వాక్కునకుం బోలె తన వాక్కునకును చెందునట్లుగా భవభూతి దృఢవిశ్వాసముతో "పాప్మభ్యశ్చ పునాతు వర్ధయతు చ శ్రేయాంసి సేయం కథా మాఙ్గల్యా చ మనోహరా చ జగతాం మాతేవ గఙ్గేవ చ, తా మేతాం పరిభావయ న్త్వభినయై ర్విన్యస్తరూపాం బుధాః శబ్దబ్రహ్మ విదః కవేః పరిణతప్రజ్ఞస్య వాణీమిమాం." అని చెప్పుకొని తనిసినాఁడు.

మఱియు కుందమాలకును ఉత్తర చరితకును ఎన్నియో భావముల సాదృశ్యమును ఎన్నియో మాటల చమత్కారమున సాదృశ్యమును, ఒక్క వస్తువునే మహాకవులు అల్లినపుడు కాకతాళీయముగా నైనను కలుగతగినవి, తారతమ్యగణనకు తగినవి కలవు. వానిని పరికింపఁ దగును. ఇదిగో కొన్ని.

1. కుందలో ఇది లక్ష్మణవాక్యము—'సమాదిష్టోఽహ మార్యేణ, అథవా స్వామినా!' ఉత్తరలో దుర్ముఖ ముఖమున లక్ష్మణునికి రాముని యాదేశము 'ఏష తే నూతనో రాజా రామః సమాజ్ఞాపయతి.'

2. ఇదియు–'త న్న శక్నోమి సీతామాత్రస్య కృతే శరచ్చన్ద్ర నిర్మలస్య ఇక్ష్వాకుకులస్య కలఙ్కముత్పాదయితుమ్.' ఉత్తరలోను– 'య త్సావిత్రై ర్దీపితం భూమిపాలై, ర్లోకశ్రేష్ఠైః సాధు శుద్ధం చరిత్రమ్, మత్సమ్బన్ధాత్ కశ్మలా కింవద న్తీ, స్యాచ్చే దస్మిన్ హ న్త ధి జ్మా మధన్యమ్.'

3. ఇదియు–'అహ మపి స్వజన విస్రమ్భ నిర్విశఙ్కాం దేవీ మాదాయ, గృహహారిణీ మివ వశ్య భూమిం, వన ముపనయామి.' ఉత్తరలో– రామవాక్యములు 'ప్రియాం,... సౌహృదా దపృథగాశ్రయా మిమాం, ఛద్మనా పరిదదామి మృత్యవే, సౌనికో గృహశకున్తికా మివ.' 'విస్రమ్భా దురసి నిపత్య జాత నిద్రాం, ... క్రవ్యాదోభ్యో బలి మివ నిర్ఘృణః క్షిపామి."

4. ఇదియు– 'ఆదాయ పఙ్కజ వనా న్మకరన్ద గన్ధాన్, కర్ష న్నితా న్తమధురాన్ కలహంస నాదాన్, శీతా స్తరఙ్గకణికా వికిర న్నుపైతి, గఙ్గానిల స్తవ సభాజన కాఙ్క్షయేవ. మఱియు (I.5) 'జాగ్రశ్నాం కమలగన్ధ కృతాధివాసైః, కాలే త్వ మ ప్యనుగృహాణ తరఙ్గవాతైః, దేవీ యదా చ సవనాయ విగాహతే త్వాం, భాగీరథి, ప్రశమయ త్వ మమ్బు వేగమ్.' ఉత్తరలో గోదావరికి లోపాముద్ర సందేశము – (III-2) 'వీచీవాతైః శీకర క్షోద శీతైః, ఆకర్షద్భిః పద్మకిఞ్జల్క గన్ధాన్, మోహే మోహే రామభద్రస్య జీవం, స్వైరం స్వైరం ప్రేషితై స్తర్ప యేతి.'

5. కుందలో సీతవాక్యము-(I) 'హా తాత ఆర్య కోసలాధిప, అన్యోన్యపర లోఽసి' అని దశరథుం దలఁచుకొని యేడ్చుట. ఉత్తరలో (II) – వాసంతి వాక్యము–'హా కష్టం!...జీవ న్తీషు వృద్ధాసు రాజ్ఞీషు కథ మిదం జాతమ్?' మరల కౌసల్యవాక్యము-(IV)- సర్వదా మహారాజో భణతి 'ఏషా రఘుకుల మహ త్తరాణాం వధూః; అస్మాకం పునః జనక సమ్బన్ధేన దుహి తైవ' అనియు, కంచుకి వాక్యము (IV-16) 'వధూ చతుష్కేఽపి యథా హి శాన్తా, ప్రియా తనూజాస్య త థైవ సీతా.' అని కుందలో సీత తలఁచుకొన్న దశరథనాయన కూఁగిమిని ప్రతియోగి మర్యాదగా ఇందు కౌసల్య ఇట్లు చెప్పినది.

6. కుందలో లక్ష్మణవాక్యము – I-13- 'కిన్తు లోకో నిరఙ్కుశః.' ఉత్తరలో రామవాక్యము-III- 'లోకో న మృష్యతీతి.'

7. కుందలో సీతవాక్యము–I 'సర్వథా అలం మహీ శా త్వేన.' ఉత్తరలో సూత్రధార వాక్యము – 'యథా స్త్రీణాం తథా వాచాం సాధు త్వే దుర్జనో జనః.'

8. కుందలో సీతవాక్యము– II– 'కథం తస్య హృదయం సీతాయాః పరకీయమ్?' ఉత్తరచరితమున సీత వాక్యము–III- 'అహ మేతస్య హృదయంజానామి మ మా ప్యేష ఇతి.'

9. కుందలో సీత వాక్యము– III– 'కో ను ఖ ల్వేష సజల జలధర స్తనిత గమ్భీరేణ స్వరవిశేషేణ అత్య న్త దుఃఖభాజన మపి మే శరీరం నిర్వాపయతి! సువ్య క్తం సోఽత్ర నిరనుక్రోశః సంప్రా ప్తః!' ఉత్తర

చరిత. అహో జలభరిత మేఘ స్తనిత గమ్భీర మాంసలః కుతో నేష భారతీ నిర్ఘోషః, భ్రియమాణ కర్ణ వివ రాం మా మపి మన్దభాగ్యాం ఝటితి త్యుచ్ఛ్వాసయతి! ...మయా పునః స్వరసంయోగేన ప్రత్యభిజ్ఞాత మార్య పుత్త్రి) ఏవ వ్యాహర తీతి.

10. కుందలో సీతావాక్యము:-'అహో దృష్ట ఇతి పరితోషః, చిరప్రవాస ఇతి మన్యుః, పరిక్షామ ఇత్యుద్వేగః, నిరనుక్రోశ ఇత్యభిమానః చిరపరిచిత ఇత్యనురాగః, దర్శనీయ ఇత్యుత్కణ్ఠా, స్వామీతీ బహుమానః, కుశలవయో స్తాత ఇతి కుటుమ్బినీ సద్భావః, అపరాధం ప్రవేశితాస్మీతి లజ్జా. నజానామి ఆర్యపుత్ర దర్శనేన కీదృశీ మవస్థా మనుభవామీతి!' ఉత్తరచరిత-III సీతవాక్యము 'భగవతి తమసే, తథానిష్కారణ పరిత్యాగినోఽపి ఏత స్యైవం-విధేన దర్శనేన కీదృశో మే హృదయానుబన్ధ ఇతినజానామి' తమసా. 'జానామి వత్సే, జానామి-III (13) తటస్థం నైరాశ్యాదపిచ కలుషం విప్రియవశాద్ వియోగే దీర్ఘే ఽస్మిన్ ఝటితి ఘట నోత్తమ్భిత మివ, ప్రసన్నం సౌజన్యా ద్దయిత కరుణై ర్గాఢ కరుణమ్ ద్రవీభూతం ప్రేమ్ణా తవహృదయ మస్మిన్ క్షణ ఇవ.'

11. కుందలో రామవాక్యము III-నిస్సమ్పాత వివిక్త మిద మరణ్యం తటరుహ తరుచ్ఛాయా సమాకీర్ణ రమణీయ సైకతాం ప్రసన్న సలిలవాహినీం సముద్ర గామినీం చ అవలోకయన్ సంస్మృత్య దణ్డకావన వాస మేవం వైక్లబ్య మనుప్రాప్తోఽస్మి. ఇత్యాది. ఇది సాదృశ్యముచే నైమిశమున దండకారణ్య వాస స్మరణము. ఉత్తరచరితముననో దండకారణ్యమే-III-(3) యత్రద్రుమా అపి మృగా అపి బన్ధవో మే యాని ప్రియాసహ చరశ్చిరమధ్యవాత్సమ్। ఏతాని తాని బహునిర్ఝరకన్దరాణి గోదావరీ పరిసరస్య గిరే స్తటాని" ఇత్యాది.

12. కుందలో రామవాక్యము. III-13. పూర్వం వన ప్రవాసః పశ్చాల్లజ్కా తతః ప్రవాసోఽయం!। అసాద్య మా మథన్యం దుఃఖా ద్దుఖం గతాదేవీ" ఉత్త రలో పృథ్వీవాక్యము VII-4. 'ఏకశ్చిరం రాక్షస మధ్యవాసః త్యాగో ద్వితీయశ్చ సుదుస్సహోఽస్యాః।'

13. కుందలో సీతావాక్యము. III 'ఆర్యపుత్ర, నిర్వాసితాయాః అసదృశమ్' ఉత్తమ చరితలో III 'అసదృశం ఖలు ఏత ద్వచనం అస్యవృత్తాన్తస్య.

14. కుందలో III 14. వాల్మీకి శిష్యవాక్యము.

'మన్దం వాతి సమీరణో న
పరుషా భాసా నిదాఘార్చిషో,
న త్రస్యన్తి చర న్త్యశజ్కా మధునా
మృగ్యోఽపి సింహైః సహ
మధ్యాహ్నేఽపి నయాతి గుల్మనికటం
ఛాయా తదధ్యాసితా
వ్యక్తం సోఽయ ముపాగతో వనమిదం
రామాభిధానో హరిః.'

ఉత్తరచరితలో III-17 వాసంతి వాక్యము:-

దధతు తరవః పుష్పై రర్ఘ్యం
ఫలైశ్చ మధుశ్చ్యుతః
స్ఫుటిత కమలామోదప్రాయాః
ప్రవాన్తు వనానిలాః
కల మవిరళం రజ్యత్కణ్ఠాః
క్వణన్తు శకున్తయః
పున రిద మయం దేవో రామః
స్వయం వన మాగతః।

15. కుందలో రామవాక్యము—III-21. అవిదిత మనుసృత్య చిత్రమాలే సుతను సుమాపచయాయ నిర్గతాం త్వాం, కుసుమ మపచితం వికీర్య భూమౌ స్మరసి రసేన మయా ధృతం పటాన్తమ్, ఉత్తరలో వాసంతి వాక్యము - III-30 - "అస్మిన్నేవ లతాగృహే త్వమ భవ స్తన్మార్గ దత్తేక్షణః, సాహంసైః కృతకౌతుకా చిర మభూ ద్గోదావరీసైకతే, ఆయాన్త్యా పరిదుర్మనాయి తమివ త్వాం వీక్ష్య బద్ధ స్తయా, కాతర్యా దరవిన్ద కుట్మలనిభో ముగ్ధః ప్రణామాఞ్జలిః."

16. కుందలో సీతవాక్యము III-'ఆర్యపుత్ర, విపరీతః ఖలు ఉపాలమ్భః' రామవాక్యము III-(15-16) దేహి మే దర్శనం ప్రియే...కిం ను నిష్కరుణా మయి? ప్రసీద మే, సీతవాక్యము-'ఆర్యపుత్ర, విపరీతః ఖలు ఉపాలమ్భః' ఉత్తరచరితలో రామవాక్యము 'హా! నను అకరుణే వైదేహి, క్వాసి? ప్రసీద-న మా మేవంవిధం పరిత్యక్తు మర్హసి' సీతవాక్యము-'ఆర్య పుత్ర, విపరీత మివ ఏతత్.'

17. కుందలో-IV కుశః-యుజ్యతే కుశలప్రశ్నః ప్రణామస్తు కథమ్? ఉత్తరలో IV-లవః-(స్వగతమ్) అజ్ఞాత నామక్రమాభిజనాన్ పూజ్యా నపిన‌ః స్వతః కథ మభివాదయిష్యే?

# దిఙ్నాగ భవభూతి రూపకసామ్య పరిశీలన

18. కుందలో IV-9-'రామః-న హైతదభిజానామి, నాహూత మపి కిఞ్చన, తథా ప్యాపాతమాత్రేణ చక్షు రుద్బాష్పవ్రతాం గతమ్. ఉత్తరచరితలో - VI-రామః- తిర్యక్ మేకపద ఏవ దుఃఖవిశ్రామం దదా, త్యపి స్నేహయతి చ కుతో౽పి నిమిత్తా దన్తరాత్మానమ్.

19. కుందలో IV-10 - రామః-అథవా కి మ త్రాశ్చర్యమ్? అపాతమాత్రేణ కయాపి యుక్త్యా సమ్భావినః సంనమయన్తి చేతః విస్మృత్య కిం దోషగుణా నభిజ్ఞ, శ్చన్ద్రోదయే శ్ప్యన్తతి చన్ద్రకాన్తః? ఉత్తర చరితలో VI (5) రామః-అథవా స్నేహశ్చ నిమిత్త సవ్యపేక్ష ఇతి విప్రతిషిద్ధ మేతత్. తథాహి వ్యతిషజతి పదార్థా నాన్తరః కో౽పి హేతుః న ఖలు బహి-రుపాధీన్ ప్రీతయః సంశ్రయన్తే వికసతి హి పతఙ్గ స్యోదయే పుణ్డరీకమ్ ద్రవతి చ హిమరశ్మా వుద్గతే చన్ద్రకాన్తః! VI (9)...ధ్వని నైవ దత్తపుకలం కరోతి మామ్.

20. కుందలో - IV-కుశలవుల యాకారము గూర్చి-రామః - (నిర్వర్ణ్య) గమ్భీరోదారః సన్ని వేశః! ఉత్తరలో - లవుం గూర్చి - రామః - దిష్ట్యా అతి గమ్భీరాకృతి రయమ్!

21. కుందలో - V - 'రామః - అహో హృదయ గ్రాహీ స్పర్శః!' ఉత్తరలో VI - 'రామః - అనేక వార మపత్య్ళేషం పరివ్వజస్వ. పరిణత కఠోర పుష్కర గర్భచ్ఛద పీన మసృణ సుకుమారః! నన్దయతి చన్ద్రచనన నిష్యన్ద జడ స్తవ స్పర్శః.'

22. కుందలో-V-రామః - అనభిజ్ఞో౽హం తనయ పరిష్వఙ్గ సౌఖ్యస్య, యద్యపి తాం తులా మారోహే- ఉత్తరలో-VI-(15) రామః-తిర్యక్మపత్య మయం దారకః? అఙ్గా దఙ్గా త్సృత ఇవ నిజో దేహజః స్నేహసారః.......గాత్రం శ్లేషే య దమృతరస స్రోతసా సిఞ్చతీవ.

23. కుందలో- V- 'రామః-స్థానే ఖలు పరి క్రామన్తి తపోవన పరాఙ్ముఖా గృహమేధినః' దీని విపరీతమునకు ఉత్తరలో - I 'రామః- ఏతే హి హృదయమర్మభిదః సంసారభావాః, యేభ్యో భీభత్స మానాః పరిత్యజ్య సర్వాన్ కామాన్ అరణ్యే విశ్రా మ్యన్తి మనీషిణః'.

24. కుందలో - రామః - పశ్య, ఏతయోః సీతాగర్భస్య చ తుల్యః కాలాతిపాతః; ఏతా వపి క్షత్రియా సూర్యాన్వయా, అజాతప్రోషితా చ; నిర్వికారా రాజాసనాగోహణే; ఏ తగి చానయో ర్గాగుణత్వసూచనో 'నిరనుక్రోశ' శబ్దః, మాతుశ్చ మాహాత్మ్య విభావనో 'దేవీ'శబ్దః; సర్వథాహ మనేన సాదృశ్యబాహుల్యేన పర్యా కులో౽స్మి మన్దభాగ్యః - ఉత్తరలో VI - 23 - రామః, అహో ప్రశ్రయయో గో౽పి గతి స్థిత్యాసనా దయః, సామ్రాజ్యశంసినో భావాః కుశస్య చ లవస్య చ; వపు రవిహిత సిద్ధా ఏవ లక్ష్మీరిహాసాః భూయిష్ఠా ఇచ్ఛ రఘుకుల కుమారచ్ఛాయాం అనయోః పశ్యామి... న కేవలం మత్సంవాది న్యాకృతిః. అపి జనకసుతాయా స్తచ్చ తచ్చానురూపం స్ఫుట మిహ శిశుయుగ్మే నై పుణో న్నేయ మస్తి...త దేతత్ ప్రాచేతసాధ్యుషిత మరణ్యం యత్ర కిల దేవీ పరిత్యక్తా. ఇయఞ్చ అనయో రాకృతి ర్వత్సయోః. యదపి స్వతః ప్రకాశా న్యస్త్రా ణీతి,...అపిఖలు త చ్చిత్రదర్శన ప్రస్తావే అస్త్రా భ్యనుజ్ఞాన ముద్భూతం స్యాత్? అయం చ సమ్ప్ల వమాన మాత్మానం సుఖాతిశయో హృదయస్య మే విస్ర మ్భయతే. భూయిష్ఠం ఇచ్ఛ మయా ద్విధాప్రతిపన్నో దేవ్యా గర్భభార ఆసీత్.

25. కుందలో VI-రామః - (ఆత్మగతమ్) నియతం మహ్యమూహ్య నిన్ద్యతే (ప్రకాశమ్) త ముద్దేశ ముల్లఙ్ఘ్య సీతాపహారణాత్ ప్రభృతి గీయతాం. ఉత్త రలో I-చిత్రదర్శనమున - లక్ష్మణః - ఏషామన్థరా! రామః (అనుత్తర మన్యతో౽గత్వా) దేవి, వైదేహి, ఇఙ్గుదీపాదపః సో౽యం శృఙ్గిబేరపురే పురా!... లక్ష్మణః-(విహస్య స్వగతమ్) అయే మధ్యమామ్బా వృత్త మన్తరిత మార్యేణ! ఇత్యాది ఉదాహరణ ములు భవభూతి దిఙ్నాగుల తారతమ్య పరిశీల నప స్ఫోరకములు.

# సగం విరిగిన వీనస్

శ్రీ 'రాఘవ'

ప్రొద్దు వాటారబోతోంది.

స్టేషన్లో-రైలు ఆగి కదలింది...

వెంటనే ఓ జట్కా కూడా స్టేషన్నించి కదిలి—ఆ మహాపట్నంలోకి రాసాగింది...

విక్టోరియా—మబ్బులు పడుతున్న ఆకాశంవంక చూస్తోంది—బండిలోనుంచి.

జట్కా సాహెబు, గుర్రాన్ని జోరుగా తోలుతూ—

"జల్దీ చలో ... బర్ సాత్ ఆయా..." — అని గుర్రానికి అర్థమయ్యే భాషలో హెచ్చరిక చేస్తున్నాడు.

పచ్చగడ్డి రుచి ఎరుగని బస్తీగుర్రం బక్కచిక్కిన శరీరంతో, పల్చబడ్డ శక్తితో కాళ్ళీడ్చుకుంటూ—బండి లాగుతోంది.

ఆకాశం గాఢమేఘావృత మౌతోంది—సన్న చినుకురాలుస్తూ...

"వర్షం దంచేట్టుగా వుంది. ఎప్పటికి చేరుకొంటుందో యీ బండి...తడుస్తానేమో!"—విక్టోరియాకు చిరాకెత్తింది...

జట్కా సాహెబు గుర్రాన్ని తొందర పెడుతున్నాడు...

విక్టోరియాకు వర్షంలో తడుస్తానేమోనని భయం వేయసాగింది...

"ఇంకెంతదూరంవుంది రావు సాహెబు గారి బంగళా?"—

విక్టోరియా, ఆదుర్దాగా అడిగింది జట్కా సాహెబుని.

"ఇంకెంతదూరం తల్లీ! దగ్గరికే వచ్చేశాం... మిమ్మల్ని తడవనీయకుండా దొరగారి బంగళాకు చేర్చే పూచీ నాది"—అని, విక్టోరియాకు ధైర్యంగా జవాబిచ్చాడు...

వర్షం పెద్దదౌతోంది క్రమేపీ...

రిచ్చపడి చూస్తోంది విక్టోరియా!

గుర్రాన్ని, నురగలు కక్కేలాగు సాహెబు తోలుతున్నాడు ... విక్టోరియాకి, ఆ వాతావరణంలో ప్రయాణించటం విసుగ్గా వుంది. గుర్రాన్ని, తనని తొందరగా చేర్చటంకోసమని, సాహెబు అలా చచ్చేట్టుగా బాదటం—ఓ పెద్ద హింసగా కనిపించింది—

"ఈ ప్రయాణం యివాళే ఎందుకు పెట్టుకున్నానా? తీరా ఇక్కడికొచ్చి ఏ రిక్షానైనా చేసుకుపోతే బాగుండేది; ఎందుకు జట్కాబండి—యిలాంటి ఓపికలేని గుర్రం లాగేది — ఎక్కానా? ఖర్మ..."—తనలో తను విక్టోరియా విచలితమనస్విని అయింది—...

వర్షం జోరుగా కురుస్తోంది.

గుర్రం...తడిసిన రోడ్డుమీద పరుగుని తగ్గించింది...మెల్లిగా నడుస్తూ...

సాహెబు సగం తడుస్తూ, త్వరగా వెళ్ళమని అరుస్తున్నాడు బూతుపదాల్లో.

విక్టోరియాకు 'ఛీ! ఛీ!' అనిపించే భావాలు ముమ్మరంగా ముసురుకోసాగినై...యీడ్చికొట్టే వాన జల్లుకు తడుస్తూంటే.

విద్యుద్దీపాలు కురిసే వర్షంలో మసకమసగ్గా కాంతిని విరజిమ్ముతున్నాయి.

జనసమ్మర్దం పల్చబడి పోసాగింది. లారీలు...చిన్నకార్లూ...రిక్షాలు...రొద చేస్తూ వస్తూ-పోతూ వున్నాయి.

వర్షం రెచ్చుతోంది.

జట్కా లెఖచేయకుండా పోయి, పోయి ఓ పెద్ద మైదానాన్నానుకునివుంటే, ఓ విశాలమైన ఆవరణలో, వున్న మేడముందు, ఆగింది-

విక్టోరియా జట్కా దిగింది.

వాన, గాలితో చిలిపిగా వచ్చి ముఖాన కాస్త జల్లుకొట్టి పోయింది.

పమిటచెంగుతో, 'అబ్బ!' అనుకుంటూ జల్లునీళ్ళని తుడిచేసుకుని జట్కా సాహెబుని డబ్బులిచ్చి పంపేసింది.

చుట్టూ చీకటి అప్పటికే దట్టంగా వ్యాపించుకు పోయింది.

# సగం విరిగిన వీనస్

వర్ష ...విద్యుద్దీపాల హీనకాంతి...గాలిహోరు ...నేలమీద...పాదాలకింద, చిన్న చిన్న పిల్ల కాలవలు మలుపులు తిరుగుతూ పల్లంలోకి దారితీస్తూ పోతున్నాయి. విక్టోరియా మెల్లిగా, ఆ వాతావరణం లోంచి మెల్లొకొని, గేటువద్దకు చేరి ఇనుపవూచల గుండా, మేడముందుకుపోయే చిన్న రోడ్డువంక చూస్తూ "ఎవరైనా తనను లోపలికి ఆహ్వానించే దిక్కూ మొక్కూ వుందో, లేదో? కేక వేస్తే పలికేనాథుడెవరైనా దగ్గర్లో వున్నాడో-లేడో?" అనుకుంటూ-గేటుకి వేసిన తాళంచిప్ప కదిలించింది అటూ - యిటూ ఇనుపబద్దీలకు కొట్టూ...

ఒకటి, రెండుసార్లు - "ఎవరైనా వున్నారా?" అని పెద్దగా కూడా కేక వేసింది.

మేడముందు పోర్టికోలో రెండు కుక్కలు తన కేకకు జవాబిస్తూ మొరిగినట్లు విక్టోరియాకు వినిపించింది.

మళ్లీ కేక వేసింది విక్టోరియా! వర్షంలో తడుస్తూ ఈడ్చికొట్టే దుడుకు గాలికి తూలుతూ భయపెడుతున్న చీకటికి కుంచించుకుపోతూ!-

పోర్టికోలో కుక్కలు మొరుగుతూనే వున్నాయి.

విక్టోరియా లోపలికి ఎలా వెళ్లటమా! అని ఆలోచిస్తోంది.

ఇంతలో ఓ కాపలావాడు వూగుతూ, చేతిలో లాంతరుతో-వస్తున్నాడు గేటు తీయటానికి. అతని ప్రక్కనే మొరుగుతూ-ఓ కుక్క కూడా చిన్న పరుగుతో వస్తోంది...వర్షంలో కాస్త తడుస్తూ.

విక్టోరియాకు కాస్త ధైర్యమొచ్చింది. ఆ కాపలావాడు, లాంతరు పైకెత్తి

"ఎవరూ?"-అంటూ చూశాడు..కుక్క మొరుగుడు మానేసింది.

"ఓ స్త్రీ!" అని గుర్తుపట్టి, కాపలావాడు; తాళం చెవులను తీసి, గేటుతాళంతీసి, విక్టోరియాను లోపలికి ఆహ్వానించాడు...ఓ చిన్న నవ్వు నవ్వుతో...

అప్పటికే విక్టోరియా ఎడా-పెడా తడిసిపోయింది; తలంతా నీళ్లు కారుతోంది. చేతిసంచీకూడా బాగా తడిసిపోయింది.

విక్టోరియా మెల్లిగా, ఆ కాపలావానితో, ఆ చిన్న రోడ్డుమీదుగా, పోర్టికోలోకి చేరుకుంది. కాపలావాడు చిన్నగా ఎందుకు నవ్వింది తేల్లేదు. చుట్టూ చూసింది...మేడ చుట్టూ పెద్ద పెద్ద చెట్లు, చీకటి రాజుస్తూ, భయంకరంగా కొమ్మలు విస్తారించుకుని-వ్యాపించి వున్నాయి.

మేడమీదనుంచి, ఓ పెద్దవిద్యుద్దీపపు కాంతి చుట్టూ వేయబడి అందగా పెంచబడుతున్న తోటంతనీ కాంతివంతం చేస్తోంది.

కురిసిన వర్షం కురిసినట్టుగా, చెట్లక్రిందకు జారి, ఎంతుటూకుల్ని తేలుస్తూ నిల్చివుంది ఇంకినంత వరకు ఇంకిపోయి.

పడుతున్న విద్యుద్దీపకాంతిలో; మేడమీదికి పిచ్చిగా, వెర్రిగా పాకిపోయిన బరాణీ ఆకులమీద వర్షపు చినుకులు మిలమిలా మెరుస్తున్నాయి.

పోర్టికోలోంచి కాస్త ధైర్యంచేసి వసారాలోకి వెళ్ళి నిల్చుంది...ఫాన్ తిరుగుతూంటే.

కాపలావాడు ఈలోపుగా మేడమీది కెళ్ళి వచ్చి,

"పైకి రండమ్మగారూ! అయ్యగారుతో చెప్పొచ్చికూర్చున్నారు. మీకు వేరేగదికూడా చూపారు. రండి....అని తనెవరో తెలీపర్చుకోకముందే, ఆ కాపలావాడు తనకు కావలసిన ఏర్పాట్లు చేసినందుకు విక్టోరియాకు ఆశ్చర్యం వేసింది.

ఫాన్ గాలికి, అప్పటికి విక్టోరియా బట్టలుకొంచెం ఆరాయి.

కాపలావాడు, మేడపైకి దారితీస్తూ మెట్లెక్కుతున్నాడు...తడిసిన చెప్పులతో ముద్రలు వేస్తూ...

విక్టోరియా, చేతిసంచీతో అతన్ని అనుసరిస్తూ ఎక్కుతూ—మెట్ల మధ్యకు చేరగానే...

"నేనెవరో నీకు తెలుసా!" అనడిగింది. కాపలావాడు, పైమెట్టు మీంచి క్రింది మెట్టుమీద నుంచొన్న విక్టోరియాను చూస్తూ మళ్లీ ఓ చిన్న నవ్వు నవ్వాడు—నువ్వు నాకు బాగా తెలుసన్నట్లు.

ఆ నవ్వుకీ, గేటుతీస్తూ లోపలికి ఆహ్వానించేప్పుడు నవ్విన నవ్వుకు పెద్ద తేడాయేమీ కనిపించలేదు విక్టోరియాకు.

"అయితే నన్నెరుగుదువన్న మాట" విక్టోరియా, తనని తప్పకుండా ఎరుగున్నాడనే స్థిర నిశ్చయంతో అనేసింది.

కాపలావాడు తలూపాడు.."ఊఁ..." అంటూ మళ్లీ మెట్లెక్కటం మొదలెట్టాడు విక్టోరియా కూడా అతణ్ణి అనుసరించింది...

ఇద్దరూ పైకి చేరారు.

కాపలావాడు, క్షణంలో అదృశ్యమై ఓగది లోంచి, సగం తెరిచిన తలుపులగుండా తలనిక్కించి. –

"ఇలా రండమ్మగారూ! ఈగదే మీకు ఏర్పాటు చేసింది. ఇందులో అయ్యగారు పిల్చేంతవరకూ హాయిగా, వుండొచ్చు. తడిసిన బట్టలేమైనా వుంటే, యీ దణ్ణాన వ్రేలాడించండి. ఫాన్ తిరుగుతోందిగా! క్షణంలో ఆరిపోతే మళ్లీ వస్తాను." అంటూ వెళ్లిపోయాడు గదిలోంచి విక్టోరియా గదిలోకి రాగానే.

రౌండ్ టేబిల్ మీద వేడి వేడి కాఫీ పొగల్ని వదుల్తోంది. రెండు పెదసోఫాలు! ఓ దోమ తెరదించిన మంచం; రెండుసాదా కుర్చీలు; ఓ టేబిల్ అతిలోక సౌందర్యమైన వీనస్ తో అలంకరించబడి వుందా గదిలో. గోడకుచుట్టూ ఓ పెద్దకొయ్యబద్దీమీద, రకరకాల ఫొటోలు వర్ణచిత్రాలు ప్రకృతి దృశ్యాలు నిండి వున్నాయి.

ఓ ఫ్రెంచి—తైలవర్ణచిత్రాలతో నిండి ఎంతో అందాన్ని విలువనూ వెలార్చుతున్న క్యాలెండర్—గోడను వ్రేలాడుతోంది....

ఓ నీలిరంగు విద్యుద్దీపం గదంతటినీ నీలి నీలి వెలుగుల్ని సమ్మరిస్తోంది...మత్తుగా.

విక్టోరియా బట్టలు మార్చుకుని తడిసిన తలని వాలుజడని వోదులు చేసి ఆరబెట్టుకుంటోంది.

ఆ గదికి వున్న మూడు కిటికీల్ని నిర్భయంగా తెరచివేసింది. వాన గాలి కాస్త చలితో నింపుకుని గదిలోకి మందగమనంతో వీస్తోంది.

ఇంకా వర్షం నిల్చి కురుస్తోంది.

మేడ చుట్టూవున్న తోటంతా స్నానం చేస్తోన్నట్లు హాయిగా, గాలికి వూగుతోంది.

కాసేపు కిటికీవద్దే విక్టోరియా నిలబడి, కాఫీ త్రాగేసింది.

గాలి వానకి చల్లబడ్డ శరీరం కొంచెం వేడి, వేడిగా మారినట్లు తెలుసుకుంది...ప్రయాణపు బడలిక కాస్త తీరినట్లనిపించింది.

వీస్తోన్న వానగాలిలో, తోటలోని సంపెంగ పూల వాసన, నైట్ క్వీన్ పరిమళం, మేడపైకి ఎక్కి ఎక్కనట్లున్న సన్నజాజుల తీగల్లోంచి రాలేక రాలేక వస్తున్నట్లుగా వస్తోంది.

విక్టోరియాకు ఆ ప్రశాంత వాతావరణం ఇంకా కాసేపువుంటే బాగుండు ననిపించింది...

కాని అలా జరగలేదు...ఎవరిదో అడుగుల చప్పుడు...ఓ నలభైయేళ్ల స్త్రీ వచ్చింది. గదిలో నిలబడి...తన వంక తదేకంగా చూడటం విక్టోరియా పసిగట్టి ఆమెవంక చూసింది.

"భోజనానికి రమ్మనమని ఆహ్వానిస్తున్నారు" అని చెప్పింది ఆ వచ్చిన నలభైయేళ్ళ వ్యక్తి – విక్టోరియాకు ఆశ్చర్యం వేసింది...తానొచ్చి ఇంతసేపైతే, పలకరించడానికి ఒక్క కాపలావాడూ ఈ నలభైయేళ్ళ స్త్రీ తప్ప, మరెవ్వరూ లేరా? యీ ఇంట్లో... ఏమిటీ విచిత్రం!...విక్టోరియా తెల్లబోయిన మొహంతో, కిటికీలోకి చూసింది...

కాపలావాడు కనిపించాడు...

"వెళ్ళండమ్మగారూ! అయ్యగారు మీకోసమే కూచుంటారు...కనిపెట్టుకుని..." అని మళ్ళీ గుర్తు చేశాడు...విక్టోరియా వినిపించుకోకుండా

"ఎవరు రమ్మంటున్నారు భోజనానికి?" కొంచెం అనుమానంగా అడిగింది ఆ స్త్రీవంక చూస్తో...

"దొరగారు..."

"ఏ దొరగారు?"

"మా దొరగారు..." – ఆ స్త్రీ కంఠం ఎందుకో కాస్త పరుషంగా పలికింది. విక్టోరియాకు లేవక తప్పిందిగాదు...కాపలావాడు కూడా గది బయట నుంచే –" నెమ్మదిగా భోంచెయ్యండి అమ్మగారూ! మీ రొచ్చేలోపుగా గదంతా సర్దుతాను...పడుకునేందుకు వీలుగా" – అన్నాడు.

విక్టోరియా, పెద్దగా, ఆ కాపలావాని మాట వినిపించుకోకుండా – ఆ నలభైయేళ్ల స్త్రీ వెనకగా – నడుస్తో—

"చూడు...నీ పేరేమిటి?"–అనడిగింది. ఆ నలభైయేళ్ళ స్త్రీ చటుక్కున ఆగి, వెనక్కి తిరిగి,

"చెల్లమ్మ..."

"ఏం చేస్తుంటావు...?"

"వంటచేస్తాను...మీలాంటివాళ్ళొస్తే మంచీ మర్యాదా చూస్తాను." అని నడవసాగింది.

"మీ దేవూరు?"

"ఏ వూరైతే నేం...బ్రతుకిక్కడ..."

గొంతులో గాద్గదికం సుళ్లుతిరిగింది. నిరాశగా. విక్టోరియా అలజడిపడింది, "ఎందుకు నిరాశగా వున్నావ్!" విక్టోరియా పుటిక్కున అడిగింది. చెల్లమ్మ

సమాధానం యిద్దామనుకుంటుండగా - దొరగారున్న భోజనశాల చేరువైంది...అంతే! ఆగిపోయి విక్టోరియాని వెంటబెట్టుకుని ఓ గదిలోకి ముందు తీసుకెళ్లింది.

"కాళ్ళూ చేతులు కడుక్కో!" అంది చెల్లమ్మ. విక్టోరియాకు యీ అలవాటు క్రొత్తగా తోచింది. అయినా కడుక్కుంది—ఆ నీళ్ళగదిలో.

అక్కణ్ణుంచి, చెల్లెమ్మ విక్టోరియాను భోజనశాలలోకి తీసుకువెళ్లి—ఓ కుర్చీ చూపుతూ—

"కూర్చోమ్మా!..." అని మర్యాద చేసింది. విక్టోరియా: ఒక్కసారి ఆ భోజనశాలంతా కలయ చూసింది—కూర్చున్నాక.

అది పెద్ద పొడుగాటిహాలు...దాదాపు పదిమంది దాకా ఒక్కసారె కూర్చొని భోజనం చేయటానికి అనువుగా వుంది. ఎన్నో ముచ్చటగొల్పే గొప్ప గొప్ప చిత్రాలు, వ్యక్తుల ఫోటోలు, గోడలనిండా అమర్చి వున్నాయి.

విక్టోరియాకు - ఆ భోజనశాల, కుర్చీలు ఎంతో గొప్పగా అద్భుతంగా - పాశ్చాత్య నాగరికతను గుర్తు చేశాయి. ఇంతలో చెల్లమ్మ, భోజనాదికొన్ని తెచ్చి, విక్టోరియా ముందు పెట్టి—

"దొరగారొస్తున్నారు..." అని మెల్లిగా ఎంతో జాగ్రత్తగా ప్రవర్తించమన్నట్లుగా—చెవిలో-చెప్పి చక్కా వెళ్ళిపోయింది.

విక్టోరియా దొరగారికోసం, ఎంతో జాగ్రత్త వహిస్తూ—ఆయన్ని చూడాలనీ—తనని ఇంత దాన్నిగా చేసిన మహానుభావుణ్ని దర్శించుకుని తన కృతజ్ఞతను వెల్లడిస్తూ మాట్లాడుదామనీ లోలోన కుతూహల పడజొచ్చింది.

"ఈనాడు తన కాళ్ళమీద తను నిలబడి జీవించటానికి తగిన సహాయమూ సానుభూతీ చూపినవ్యక్తిని ఎలాచూస్తో, మాట్లాడటం ఒక్కసారి ఆయనపట్ల—ఇంతకాలంనుంచి పేర్చుకున్న కృతజ్ఞతనీ ధన్యవాదాన్నీ ఎలా ఎదురుపడి సమర్పించుకోవటం?

—దొరగారు వచ్చేంతవరకూ, విక్టోరియా ఇలా వుక్కిరి బిక్కిరి కాసాగింది.—గొప్ప అభిమానంతో...

—ఎలా వుంటారో రావు సాహెబుగారు? ఎలా పలక్కరిస్తారో? తనెలా మాట్లాడాలో? ఎంత వినయ విధేయతలుగా ప్రవర్తించాలో?"

—తనిలా ప్రయాణం కాబోయేముందు, తల్లి ఎన్నోరకాలుగా వర్ణించి చెప్పిన విషయాలు, గుర్తుకు రావటంతో విక్టోరియాకు కొంత సుళువు యేర్పడింది.

ఇంతలో దొరగారు—మెల్లిగా - మేడ్లో అంత స్థువిగాంచి—దిగి రావటం—, సరాసరి ఆయన వచ్చి... వచ్చి...విక్టోరియాకు ఎదురుగా కూర్చోటం జరిగిపోయింది...

మునుపటికంటే, భోజనశాల, మత్తుగా మరింత కాంతివంతమైంది నీలిరంగు విద్యుద్దీపకాంతుల్లో...

విక్టోరియా కాటుకకళ్లు అందంగా జిగేలుమన్నాయి...ఒక్కసారి—ఎదురుగావచ్చి కూర్చొన్న మన్మధుడిలాంటి యువకుణ్ణి హఠాత్తుగా చూడటంతోనే..., మనస్సు సంతోషంతో వుక్కిరి బిక్కిరైన ఆకాశంలాగా మారిపోయింది. తనలో యవ్వనం ఎందుకోసిగ్గుపడింది...మరెంతో ఆశ్చర్య పడింది... క్రమేపీ దిగ్భ్రాంతురాలైంది.

"ఈయనా నన్ను వుద్ధరించి చదువు చెప్పించి నా కాళ్ల మీద నేను నిలబడేటట్లుచేసిన మహానుభావుడు!" — విక్టోరియా నమ్మలేకపోయింది ... వాలుగా చూసింది—అతణ్ణి!

అతను...తల వంచుకుని ఏమిటో ఆలోచిస్తున్నాడు...

విక్టోరియాకు—తల్లి చెప్పిన 'రావుసాహెబ్'కూ—ఎదురుగా వున్న యువకునికీ, ఎంతో తేడా, వుందన్నట్లు భావనకల్గింది.

తల్లి వర్ణించి, చెప్పినరావు సాహెబ్ ఈ యువకుడు 'కాడు' అని నిర్ణయించుకుంది—విక్టోరియా—ఎందుకంటే—...

రావుసాహెబ్ చాలా పొడగరనీ కుడిబుగ్గమీద పెద్ద పుట్టుమచ్చవుంటుందనీ, జొద్దుమీసా లుంటాయనీ, బట్టతల అనీ, కళ్ళు విశాలంగా, వుత్తేజంగా, వుంటాయనీ, మాట - చాటుకి పోయినా స్పష్టంగా విన్పించుతుందనీ, మెళ్లోసన్నని బంగారు గొలుసుండి దానికి పులిగోళ్లు వుంటాయనీ, ఇలా ఎన్నో గుర్తులు చెప్పి పంపింది తననిక్కడికి—అవేవీ—ఎదురుగా కన్పిస్తున్న యువకునికి వర్తించవు.—

అయితే ఇతనెవరూ?"—విక్టోరియాకి పెద్దగా అనుభవించవలసిందేదో — భయంతోనూ, అనుమానంతోనూ, ఓ భావంగా ఏర్పడింది.

"బహుశా ! నన్నెప్పుడూ చూసివుండ రనుకుంటాను"—

తనని వుద్దేశిస్తోనే అంటున్నాడని, విక్టోరియా గ్రహించింది ఆ యువకుని పలకరింపు వినగానే!

"అవును చూడలేదు..."—ముక్తసరిగా జవాబిచ్చింది విక్టోరియా !

ఇంతలో చెల్లమ్మ వచ్చి ఏదో వడ్డించివెళ్లింది.

అప్పటికే ఇరువురూ సగపడి భోజనం చేశారు...

వర్షం తుపర తుపరగా పడ్తోంది...

"ఇలా వర్షం పడుతుంటే—మీకు ప్రయాణం చేయటం చాలా ఇష్టమనుకుంటాను..."

విక్టోరియా నవ్వుతూ తన విషయమేననుకుని

"నేనేం పెద్దగా తడిసిరాలేదు. చాలా సుఖంగానే వచ్చాను..." అంది...

"మీ పేరు విక్టోరియా కదూ !"

ఊఁ..."

"ఎలా తెలుసు మీకు"—అని అడుగుదామనుకుంది విక్టోరియా! కాని గుండె బలం సరిపోలేదు.

"మీరు క్రిష్టియానిటీ పుచ్చుకుని ఎన్నాళ్లయిందీ !"—

"జన్మతోనే క్రిష్టియన్ని నేను..."

"ఓ! అలాగా! ఎందుకడిగానో తెలుసుకున్నారా ?"

"ఊహుఁ... తెలీదు..."

"మీరు క్రిష్టియన్ వుమెన్‌లా లేరు చూట్టానికి."

"మరెలావున్నా ?"

"ఏ మహిమతోనో యీ లోకంలో అవతరించిన దేవకన్యలా వున్నారు."

విక్టోరియా, ఆ మాటకు చాలా సిగ్గుపడింది. తను ఎంతో అందగత్తెననే సంగతి, ఇలా, ఓ జమీందార్ యువకునిచే అనిపించుకుని, తెలుసుకోవటం ఓ గొప్ప మధురానుభూతిగా తోచింది విక్టోరియాకు—ఆ సమయంలో...

ఈ లోపుగా, ఆ యువకుడు ఇంకేం మాట్లాడకుండానే భోజనం ముగించుకుని టేబిల్ ముందు నుంచి లేచి ఓ కిటికీ దగ్గరకు చేరి నిలబడ్డాడు......

బయట వర్షం సుఖంగా కురుస్తోంది...

విక్టోరియా కూడా మెల్లిగా లేచి తన గదిలోకి వెడదామా—అవటూ అని సందేహిస్తుండగా—ఎవరివో అడుగులు చప్పుడై వూరుకున్నాయి.

"మీలాంటి దేవకన్యల్ని హఠాత్‌గా ఇలాంటి ప్రశాంత వాతావరణంలో చూసినప్పుడు నాకు మనస్సంతా ఏమిటో హాయిగా వుంటుంది." - మాటల్ని వింటోంటే ఏదో భావన అతని హృదయంలో సాలెగూడులా అల్లుకుంటోందని ప్రస్ఫుట మవసాగింది ఆమెకి.

"సరిగ్గా మీరు ఎలా వున్నారో చెప్పనా? ఇప్పుడు?"

—విక్టోరియా; ఆశ్చర్యంగా తనెలా వుందీ చూసుకుంది—తెలీలేదు... తెలీదన్నట్లుగా చూపుల్ని అతని వద్దకు సాగనంపింది...వీణ మీటినట్లు: తన కిష్టమైన రస హృదయంకోసం విచ్చుకున్న కన్నెగులాబీలాగున్నారు... అన్నాడు...

—విక్టోరియా, అతని సమాధానానికి కుంచించుకు పోయింది... ఏమిటీ వుపమానం?? లోలోన వింతగా స్మరిస్తో......ఆందోళనగా గోడమీద వర్ణచిత్రాల్ని పరిశీలనగా చూడ సాగింది. రకరకాల భంగిమల్లో యెంతోమంది యువతులఫోటోలు — ప్రసిద్ధ చిత్రకారులు చిత్రించినబొమ్మలూ, శృంగారభావాల్ని రేకెత్తిస్తున్నాయి.

అది భోజనశాలగా తోచటంలేదు — ఏదో పురాతన వస్తుప్రదర్శనశాలగావుంది ...... నాలుగు గోడల మూలన ఎక్కడెక్కడో చరిత్రాత్మక ప్రదేశాల్లో లభ్యమైన రాతిబొమ్మలు — దేవకన్యల రూపంలో — దృగ్గోచర మవసాగినై.

"ఏమిటీ మీరు నామాటలు వింటున్నారా ? ఈ బొమ్మల్ని చూస్తో మెచ్చుకుంటున్నారా ?"

"వింటూ, బొమ్మల్ని చూస్తున్నాను. మెచ్చుకోవటానికి తగిన సంస్కారం నాలో లేదు..."

"పోనీ! మా యింట్లోవున్న చిత్రంలో మీకు బాగా యిష్టమైందేమిటో చెప్పగలరా ?"

"క్షమించాలి...కళాదృష్టితో నేనే చిత్రాల్లో బొమ్మనీ చూడటం లేదు..."

"చేతగాదా ?"

"అలవాటు లేక ... అంతే!"

విక్టోరియా తుంచేసినట్లు జవాబివ్వటంతో అతను స్తంభించాడు — ఒక్కక్షణం ... మళ్లీ అంతలోనే తేరుకుంటూ — ...

"ఒంటరిగా మిమ్మల్ని చాలా అవస్థపెడుతున్నాననుకుంటున్నారా ?"

"ప్రస్తుతానికి యేమీ అనుకోవటం లేదు."

"అంటే, అనుకోవటమనేది కొంతవరకు అలవాటులోనే వుందన్నమాట..."

"మనిషికి అది సహజలక్షణం..."

"ఓహ్! అదా! అర్థమైంది..." — అతను దవ్వంత, కిటికీలోంచి చూస్తో...

"మిమ్మల్ని ఒకందుకు అభినందిస్తున్నాను."

"ఎందుకో?"

"మీ పేరు నేను తెలుసుకున్న సంగతి తెలుసుగా మీకు..."

"ఊఁ..."

"మరి నా పేరేమిటో తెలుసుకోవాలని లేదా?"

"లేదు..."

"ఎందుకని?"

"నేను... రావుసాహెబ్ గారికోసం వచ్చాను. వారి దర్శనంకోసమే నేనీరాత్రి వుండదల్చాను...... మీరెవరైందీ తెలుసుకోవాల్సిన అవసరం నేను పెద్దగా పెట్టుకోలేదు... బహుశా! వారి చుట్టాల్లో ఒకరై వుంటారేమో ననుకుంటున్నాను...అవునా?"

"కాదు..."

"మరెవరూ?"

"వారబ్బాయ్యిని?"

విక్టోరియా త్రుళ్లి పడింది, నిశ్చేష్టురాలౌతూ...

"మీరు వా రబ్బాయా?"

"అవును... ఏం కొనట్టున్నానా! నా పేరు... ఏదో...? మీరంత పెద్ద పేరు పిలవటం బాగుండదు... కష్టంగా కూడా వుంటుంది. అంతా, మాత్రం నన్ను "రాజేంద్రం" అంటారు... బాగుంటే మీరు పిలవండి. లేకపోతే... 'దొరగారు' అనండి! యీ రెంటిలో ఏదన్నా పలుకుతాను..." — రాజేంద్రం తననిగురించి విక్టోరియాకు విశదం చేశాడు— ...

బయట వర్షం వెలిసింది...

రాజేంద్రం ఎవరో తెలుసుకుంది విక్టోరియా. అతనితో ఆమెకు ఏం పనిలేదు...

"అయితే ఏంచేయాలి? వచ్చినదారే పట్టడం మంచిదేమో! అయినా రావుసాహెబ్ గారు ఏమైనారు? ఎక్కడున్నారు? ఎవరు చెపుతారు ఆయన్ని గూర్చి?" — విక్టోరియా ఆలోచిస్తోంది. రాజేంద్రం, మెల్లగా ఆమెనుచూస్తో కిటికీదగ్గరనుంచి కదిలి వచ్చాడు...

మళ్లీ అడుగులచప్పుడు, భోజనశాల ముందు వసారాలోంచి గబగబా విన్పించింది... ఎవరో తొందర పనిమీద అటు యిటూ తిరుగాడుతున్నట్లుగా వుంది ఆ చప్పుడు వింటూంటే!

విక్టోరియాకు ఎల్లమ్మేమో ననిపించింది..

రాజేంద్రం కాపలా కాచే రంగడేమో ననుకున్నాడు..

ఈ ఇద్దరిలో - ఎవరో - ఇదమిద్ధంగా ఆయిద్దరికీ అంతు పట్టలేదు.. మొత్తానికి ఎవరో తమ ప్రసంగాన్నీ కదలికల్నీ పసిగడ్తున్నారని ఇద్దరూ గ్రహించేశారు..

అయితే ఎవరూ?

తెలీదు..

దగ్గరగా వచ్చిన రాజేంద్రంని చూస్తో విక్టోరియా కొస్త మెల్లిగా ముందుకి కదిలింది.

"రావు సాహెబు గారితో — అదే... అఁ.... అఁ... మా నాన్న గారితో ఏమిటీ పని"—రాజేంద్రంలో విక్టోరియాతో—ఆమె యవ్వన సౌందర్యాన్ని చూస్తో ముగ్ధుడౌతూ మాట్లాడాలనే మాట్లాడుతూ ఏదో విషయాన్ని పొడిగించాలనే కోర్కె, కుతూహలంతో పెరగసాగింది.

విక్టోరియా అసలే మితభాషిణి. ఎవరికీ వృథాగా కాలక్షేపం చేయడానికి అవకాశమిచ్చే స్వభావం కాదామెది.. తూచి మాట్లాడివేయటం ఆమె కలవాటు.. తన గౌరవాన్ని పోగొట్టుకోకుండా ఎదటివారి మర్యాదను కించ బరచకుండా ప్రవర్తించడమే ఆమె అవలంబించే పద్ధతీ! మార్గమూనూ! తనని గురించి ఎవరైనా రాజేంద్రంలాంటి గొప్ప అంతస్థు గల్గిన వ్యక్తులు ప్రసంగించటం సంభవమైతే సాధ్యమైనంతవరకు తన వ్యక్తిత్వాన్నీ మనస్తత్వాన్నీ వ్యక్తం చేయకుండా వాళ్లమాటలకి ఉబ్బి తబ్బిబ్బు కాకుండా నిండుకుండలా తొణక్కుండా వుండటమే లక్ష్యం, లక్షణంకూడా! అందువల్ల విక్టోరియా జీవితంలో కొంత శాంతీ సుఖమూ ఏర్పడి వున్నాయి.. ఇలా ఏర్పడటానికి కారణం రావు సాహెబే!

రాజేంద్రం విక్టోరియా ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తోందని వూహించాడు..

"మా నాన్నగార్ని గూర్చేనా ఆలోచిస్తున్నారు?"

"లేదు.."

"మరేమిటి ?"

"ఆయన లేనప్పుడు.. ఎందు కింకా వుండటమని ఆలోచిస్తున్నాను.."

"మీ రన్నమాట నిజమేనా ? ఇప్పుడు ?"

"అవును.. ఏం ఆశ్చర్యంగా వుందా ?"

"ఉండదూ మరి !"

"ఎందుకూ ?"

"మా నాన్నగారి లేనప్పుడు ఇక్కడ నాకేం పని నిజంగా ? అనటం.. నాకెంతో బాధగావుంది"

"నే నెవరితో నైతే పనుండి వచ్చానో వారు లేనప్పుడు యీ రాత్రి...ఇలాంటి గొప్పవారిళ్ళల్లో ఒంటరిగా యిలా వుండటం ఓ గొప్ప జీవితం గడుపుతున్న జమీందార్ గారితో ముఖాముఖీ మాట్లాడటం.. నా అనుభవంలో ఎన్నడూ లేదు. ఇంతవరకు.."

"మీరు పనుండివచ్చిన వ్యక్తి లేనంత మాత్రాన, పలకరించి ఆదరించే వ్యక్తితో ప్రసంగించటం—ఒంటరిగా వుండటం మీకు భయాన్ని కల్గిస్తోందా ?"

"ఇంతవరకూ లేదు మరి ! అయినా పరిస్థితులెలా మారుతాయో ఎలా వూహించగలను ?"

"అయినా ! మీ రెందుకంత దూరం ఆలోచించటం ?"

"స్త్రీని కాబట్టే! పరాయివూరునుంచి వచ్చాను కాబట్టే! గొప్పవారింట్లో ఒంటరిగా వున్నాను కాబట్టేనూ !—"

"నాకు నవ్వొస్తోంది మీ ఆదుర్దా చూస్తోంటే ! ఏదో పెద్ద చదివిన స్త్రీలాగా వుండికూడా ఎందుకంత భయం ?"

"చదువుకీ, నడుస్తున్న రోజులకీ, గడుస్తున్న జీవితానికీ ఆవరించే భయాందోళనలకీ — వున్నట్టే వుండి ఒక్కసారిగా మారిపోయే పరిస్థితులకీ—యేమీ సంబంధం లేదు. తమ తమ నెలవులు తప్పటం తరువాయిగా జీవితం ఎన్నో మార్పులికి లోను కావల్సివుంటుంది. అపజయాలూ—అనుమానాలూ—హఠాత్ గా ఆవరిస్తాయి...క్షమించండి...తమకివన్నీ తెలీనట్లుగా చెబుతున్నందుకు..." అని వెంటనే తెలివి తెచ్చుకుని, విక్టోరియా వూరుకుండిపోయింది.

రాజేంద్రంకి విక్టోరియా మాటల్లో చాలా సభ్యత—సంస్కారం వున్నట్లు తోచింది.

"మీకు రంగుల్లో ఏ రంగు యిష్టం?"

హఠాత్ గా రాజేంద్రం యిలా విషయాన్ని ఎందుకు మార్చటం జరిగిందో విక్టోరియాకు అర్థం కాలేదు. మళ్ళీ ఎవరివో అడుగుల చప్పుడు...

"ఎవ్రాల్డ్ గ్రీన్—" చెప్పింది విక్టోరియా.

"పువ్వుల్లో?"

"గులాబీ..."

"వర్షపు రాత్రి బాగుంటుందా ? వెన్నెల రాత్రి హాయిగా వుంటుందా? ఏదీ మీ అభిరుచికి తగింది ?"

"వెన్నెల వర్షంలా కురుస్తోన్న రాత్రి!"—విక్టోరియా జవాబుతో ఎంత తృప్తిపడ్డాడు అతను.

"ఏమిటీ ఇలా అడుగుతున్నానని ఆశ్చర్యంగా వుందా?"

"ఉండదని మీరేమైనా అనుకుంటున్నారా?"

—రాజేంద్రం గిజగిజతన్నుకున్నాడుతనప్రశ్నని గమ్మత్ గా గారడీచేసి తీక్షణంగా తన పైకే వేసినందుకు—

తనకు తను ఎంతో తక్కువ చేసుకుంటూ,

"మాకు విక్టోరియా ! నేను చాలా తెలీకుండా ఎంతో స్వతంత్రంగా—చనువుగా ప్రసంగించాను. ఏమీ అనుకోవద్దు!...వెళ్ళొస్తాను..." అంటూ, గబగబ విక్టోరియానుంచి దూరమైపోతూ, మెట్లెక్కి మూడో అంతస్థుకి దారితీశాడు రాజేంద్రం...వసారాలో అడుగుల చప్పుడు ఎవరిదో దూరమైంది. అంతలో... ఎందుకో గబుక్కున మెట్లమీదే ఆగిపోయి... రాజేంద్రం...

"విక్టోరియా!...విక్టో...రియా...!! వి...క్టో... రి...యా..." లోలోన గొణుక్కుని మెల్లిగా పైకి వెళ్ళి పోయాడు.

భోజనశాలలో నీలిరంగు దీపాలు నిద్ర కుపక్రమించినట్లు ఆరిపోయాయి. క్రమంగా...వెంటనే విక్టోరియా తన కేర్పాటుచేసిన గదిలోకి వచ్చేసింది వసారాలోంచి. అలా వస్తోన్నప్పుడే ఇందాకటినించీ ఆమె విన్న అడుగుల చప్పుడు ఎవరిదో తెలుసుకోవాలనే ఆదుర్దాతో ఎవరైనా ఏ మూలన్నా ఏ గోడవారగానన్నా ఏ స్తంభం చాటునన్నా చీకట్లో యింకా నిల్చేవున్నారేమోనని చుట్టూ కలయ చూస్తూ వచ్చింది. ఎవరూ...ఎక్కడా...ఎలాగూ కనుపించలేదు.

తను భ్రమపడిందేమోననుకొంది. మెల్లిగా, ఆరిన జుత్తుని వాలుజడగా అల్లుకుంటూ ఓ సోఫాలో కూర్చొంది విక్టోరియా.

రాజేంద్రం ప్రసంగం ఆమెకెంతో ఆశ్చర్యాన్నీ అనుమానాల్నీ ఆందోళననీ వుండీ వుడిగీ కల్గిస్తోంది.

తనలో, రాజేంద్రంకి ఏదో ప్రత్యేకాకర్షణ కనిపించి వుండాలి! లేకపోతే అలా ఎందుకు సంభాషిస్తాడు?

తన తండ్రి సంగతి ఎరుకపర్చకుండా తన నింతసేపు మాట్లాడించటం ఎందుకు జరిగింది.

రాజేంద్ర హృదయం ఏదో అభిరుచిని, తన నుంచి పొందాలని కుతూహలపడుతోన్నట్టు విక్టోరియా వూహించింది.

"రావు సాహెబ్ గారి కోసం ఎందుకు వచ్చారు? ఏం పనీ? నావల్ల ఏదైనా సాయం కావాలంటే చెప్పండి, చేయగల్గితే చేస్తాను"— ఇలా ఎంతకీ అడక్కపోవటంతో, రాజేంద్రం పట్ల విక్టోరియాకి ఓ గొప్ప అనుమానం ఏర్పడింది. "తన అభిరుచుల్నీ ఇష్టాల్నీ ఎందుకు మనస్ఫూర్తిగా కోరి చెప్పించుకున్నాడు? ఒకవేళ తనవీ అవేనని తృప్తిపడడానికా? ఏదో ఉద్దేశ్యం రాజేంద్ర మనస్సులో తన పట్ల గాఢంగా అలుముకుని వుంది!" విక్టోరియా తీవ్రాలోచనల్లో మునిగిపోతోంది...

ఎవరిదో...వసారాలో అడుగుల చప్పుడైంది. విక్టోరియా తల త్రిప్పి చూసింది. కాపలావాడు మెల్లిగా తలుపు త్రోసుకొస్తూ...

"ఇంకా పడుకోలేదా? అమ్మగారూ!" అన్నాడు...ఆ అడగటంలోని ఎంతో మార్దవం విక్టోరియాకు తృప్తినీ శాంతినీ కల్గించింది.

"లేదు...అన్నట్లు నీ పేరేమిటి?"

"మీ అమ్మగారు కులాసాగా వుందా?"

విక్టోరియా తెల్లబోయింది ... "ఇదేమిటి తను పేరడిగితే, అతను తన తల్లి క్షేమం అడుగుతాడూ!" అని.

"మా అమ్మని నువ్వెరుగుదువా?"

తలూపాడు రంగడు – తెలుసన్నట్లు...

"ఎలా తెలుసు?"

"ఎలాగా..."అంటూ ఓ చిన్న నవ్వు నవ్వాడు. ఆ నవ్వులో, లోగడ అతను నవ్వినప్పుడు విక్టోరియాకు కల్గిన అనుభూతే భావనే కల్గింది.

రంగడు తన తల్లినిగురించి తెలిసిన వ్యక్తేనని గ్రహించింది విక్టోరియా! అయితే తను కూడా తెలిసే వుండాలే!...అవును ... తెలియబట్టేగా గేటు తీస్తూ లోనికి ఆహ్వానించేప్పుడు నవ్వాడూ! మళ్ళీ మెట్లెక్కి ఇక్కడొచ్చేప్పుడూ నవ్వాడూ!...

"అయితే ఎలా తెలుసు?" విక్టోరియాకు రంగన్నని అడగాలనిపించి. అడిగింది.

అతను నవ్వాడే కానీ, ఇసుమంతైనా బయటికి చెప్పలేదు.

"ఎలా తెలుసు మా అమ్మ, నేనూ? నీకు? చెప్పవా?" అంది విక్టోరియా మరోసారి...

"ఎలా తెలిస్తేనేం? తెలుసు. ఇలా మీరడగటమూ నేను ఇప్పుడు ఇక్కడ చెప్పటమూ ఏమీ బాగుండదు...వూరుకోండి!"

విక్టోరియాకు, తెలుసుకోవాలనే తపన, ఆదుర్దా ఎక్కువై తగ్గిపోయింది.

"ఎందుకు చెప్పకూడదూ?" విక్టోరియా వూరుకుండక పిచ్చిగా అయోమయంగా అడిగింది.

"చెప్పకూడదు కాబట్టే చెప్పదల్చ లేదు..." నిజంగా చెబితే, మీరు వెంటనే వెళ్ళిపోవాలనుకుంటారు...అలా వెళ్ళిపోయేట్లు చేయటం నా కిష్టంలేదు. రాక రాక వచ్చారు. ఈ రాత్రి వుండి వెళ్ళిపోవటం నాకెంతో తృప్తిగా వుంటుంది..."

"ఎందువల్ల?"

"చాలా కాలానికి చూట్టంవల్ల! మిమ్మల్ని ఎత్తుకుని ఆడిస్తూ – ముద్దు ముద్దుగా మాటలు చెప్పి పెంచటంవల్ల...మీతో... మీ చిన్నతనంలో...మీ లాగా పాపలా ఆడుకోవటంవల్ల..."

"నేను-నీ, చేతుల్లో ఆడుతో-పెరిగానా?"

"అవునన్నట్లు"గా తలూపాడు; రంగని కళ్ళలో నీరు ముకౌరాన్నింపుకుని ఆనందబాష్పాలై రాలుతోండటం విక్టోరియా గ్రహించింది.

"రావు సాహెబ్ గారికోసం వచ్చినందుకు ఆయన లేకపోగా, నువ్వయినా కనిపించావ్! నిజంగా నే నెంత అదృష్టవంతురాల్ని! ఒంటిగా – యీ రాత్రి ఎలా యీ మూడంతస్థుల మేడలో గడపడమా అని బెంబేలు పడిపోతున్నా! మీ దొరగారు చాలా విచిత్రమైన వ్యక్తిలాగున్నారే! మర్చాను...ఆ చెల్లమ్మ మళ్ళీ కనిపించలేదు. ఏమైపోయింది?" విక్టోరియా తన

గుండె విప్పి, అప్పటికి వున్న విషయాన్ని రంగని ముందు కుప్పపోసింది.

రంగడు అన్నీ విని "రావు సాహెబ్ గారు ప్రస్తుతం లేరు..."

విక్టోరియా వులిక్కి పడింది. "లేరా!" అంటూ.

"లేరు...ఆయన యీ లోకం హఠాత్ గా విడిచి దాదాపు ఏడాది కావొస్తోంది..."

"మరి మా అమ్మ, వుంటారనీ విదేశాలకివెళ్ళి ఇటీవలనే వచ్చారనీ...చెప్పిందే!"

"రావు సాహెబ్ గారు మరణించిన వార్త మీ అమ్మకి తెలియపర్చకుండా దాచేసింది నేనే!" రంగడు తన తప్పు ఒప్పుకున్నాడు...

"ఎందువల్ల?"

"రావు సాహెబ్ గారు అలా చెప్పమన్నారు. మరణించటానికి ముందు ఓనాడు రహస్యంగా, ఎవరడిగినా నన్ను ముఖ్యంగా మీ అమ్మకు!"

"ఇంతవరకూ మా అమ్మకు తెలీదుగదూ!"

"తెలీదు..."

"నిజంగా-నే వెళ్ళగానే అడుగుతుంది ఏమని చెప్పటం ఆయన్ని గురించి మా అమ్మకి..." విక్టోరియా ఆలోచనల్లో పడింది.

రంగడుకూడా ఆలోచనల్లోపడక తప్పలేదు. ఆకాశంలో వర్షించిన మేఘాలు గుంపులు గుంపులుగా ఎటకో తరలిపోతున్నాయి. వర్షం వెలిసింది. వానగాలి చలిగా వీస్తోంది.

గడియారం పదకొండు కొట్టింది.

రంగనికి ఆవలింతలు వచ్చాయి.

విక్టోరియా అర్థం చేసుకుంది.

"నిద్రొస్తోందా రంగడూ!"

"చాలా కాలమైంది గదా! ఇలా ఇప్పటివరకూ మేల్కొని ఏకధాటిగా వుండటం..."

"ఒంటిగా యీ రాత్రంతా ఎలా గడపటం?"

"భయంగావుందా తల్లీ!"

"ఉండని" చెప్పలేకపోయింది విక్టోరియా. ఎందుకనంటే వుండీ వుండని స్థితిలో మనస్సంతా వ్యాకుల పడిపోతోంది.

"ఏం భయం లేదమ్మా! నేనూ దగ్గర్లోనే మెట్ల దగ్గరగా పడుకునివుంటాను. పిలిస్తే చాలు పలుకుతాను. నాదేమీ బండనిద్రగాదు తల్లీ! అన్నట్లు మరిచాను రావు సాహెబుజీ కోసం మీ అమ్మ ఎందుకు పంపింది నిన్ను?"

"క్రిస్టమస్ పండక్కి ఆహ్వానించటానికి. నన్ను చదివించి ఓ మనిషిగా చేసినందుకూ కృతజ్ఞత తెల్పుకుని ... చూద్దామని వచ్చాను..." విక్టోరియా ఎంతో వుబలాటపడుతూ కృతజ్ఞతాభావాన్ని మాటల్లో ధ్వనింపచేస్తో...అంది.

"ప్చ్...ప్చ్..."రంగడు సానుభూతి చూపాడు. తెల్లవార్లూ రంగడితో ఇలా ఏదో పిచ్చాపాటీ మాట్లాడుతూ కాలక్షేపం చేద్దామనిపించింది విక్టోరియాకు. కారణం ఏమిటంటే మళ్ళీ తన వూరికి రైలు తెల్లవారు ఝామునగానీ లేదు...అంతవరకూ బిక్కు బిక్కుమంటూ వుండటం బాధగా వుంది ఆ గదిలో ఒంటరిగా. రంగడు జోరుగా ఆవలిస్తున్నాడు.

విక్టోరియాకి అతన్ని బాధించటానికి మనస్సొప్పలేదు.

"వెళ్ళి పడుకో రంగడూ! ధైర్యంగానే వుంటాన్లే!" అని అతణ్ణి పంపేసింది.

రంగడు ఆమెను గదిలో వుండేలాగు చేయగల్గాడేగానీ మనస్సంతా ఏదో బాధ వ్యాకులత భయమూ ఆందోళన, గాఢంగా అలుముకున్నాయి.

రంగని హృదయం ఇలా కావటానికి కారణం ఏమిటి? ఎవరూ ఆ కారణాన్ని కల్పించేది? ఎవరికీ తెలీకపోవచ్చు...కానీ; రంగడి బాగా తెలుసు; చెల్లమ్మకి ఓ మాదిరిగా తెలుసు... తెలిసే రంగడు, చెల్లమ్మ బాధపడ్డారు...భోజనశాలలో విక్టోరియాతో రాజేంద్రం ప్రసంగిస్తుంటే ఏం చేస్తాడోనని తిరిగారు...

రాజేంద్రం! అతని ప్రవర్తన!! తల్చుకుంటేనే భయం వేస్తుంది ఎవరికైనా? అందుకే రంగన్న రాజేంద్రం గురించి చెప్పక వదిలేశాడు...విక్టోరియాకి.

ఈ రాత్రి ఏమైనా అఘాయిత్యం చేస్తాడేమోనని భయంగానేవుంది రంగడికి. అందుకే మెట్లదగ్గర పడుకుని వుంటానని, విక్టోరియాకు ధైర్యంగా చెప్పి వెళ్లాడు.

రంగడు వెళ్లాక మేడమీదా - లోపలా - రెండు మూడు కాంతివంతమైన దీపాలు ఆరిపోయినై.

విక్టోరియా గదిలో మాత్రం నీలిరంగు విద్యుద్దీపం ప్రకాశవంతంగా వెలుగుతోంది. ఆ కాంతిలో - టేబిల్ మీదవున్న పాలరాతి అందమైన వీనస్ శిల్పం—వెన్నెలముద్దలా...సౌందర్యవంతమై సమ్మోహింప చేస్తోంది...

## సగం విరిగిన వీనస్

విక్టోరియా దానివంక చూస్తో వీనస్ యొక్క ప్రతిభకు సంబంధించిన విషయాల్నీ కథల్నీ మనస్సులో తల్చుకోసాగింది—

పాశ్చాత్యులకు సౌందర్యాధి దేవత వీనస్—!

భారతీయులకు సౌందర్యాధి దేవత రతీదేవి—!

పేర్లు తేడా కావచ్చు...రూప, లావణ్య—యవ్వన శోభామయశీలత అంతా ఒకటే నేమో!

విక్టోరియాకు ఒకటే ననిపిస్తోంది ఆలోచిస్తూంటే!

ఏమో తోచటం, ఏమీ తోచకపోవటం అంత కష్టం కాదేమోననిపించింది ఆ సమయంలో విక్టోరియాకు—

"ఆకాశం తెలితెలి మబ్బులతో ఆవృతమై పోయింది...వర్షం లేకపోయినా తేమగాలి, చలి పుట్టిస్తో వీస్తో నేవుంది, నిద్ర రాకపోయినా ఆలోచనలు అవిరళంగా జనిస్తో నే వున్నాయి. రావుసాహెబు గారు లేకపోయినా రంగడి ఆదరణ మాట—మంచి తనమూ—మర్యాదా—ధైర్యమూ అనుకోకుండా—అదృష్టవశాత్తూ లభ్యమైనాయి. ఎలాగో తెల్లవారే దాకా—యీ రాత్రిని గడిపేస్తే రైలుకు—హాయిగా అందుకోవచ్చు..."

విక్టోరియా తేలిగ్గా — తేరపిగా — కుదురుగా యోచిస్తోంది—

గడియారం పన్నెండుగంటలు కొట్టి అరగంటయింది...

హఠాత్ గా—ఏదో చప్పుడైంది...విక్టోరియా మంచంమీంచి లేచి కిటికీదగ్గరగా పోయి మేడక్రిందికి చూసింది...

ఎవరూ లేరు...కనిపించలేదు...

గులాబీ చెట్లవద్ద —గుబురుగావున్న కొమ్మలెందుకో — ఎవరో కదిలించి — రెచ్చగొట్టినట్లుగా వూగుతున్నాయి.

చీకటి తెరలు—మేడమీది ఓ లైటు కాంతిలో—పల్చపల్చగా—విడిపోతున్నాయి.

నిద్ర రాకపోయినా ప్రయాణికపు బడలిక — కొంతమత్తునీ మగతనీ కనురెప్పలమీదికి వచ్చి వాలేలాగు చేస్తోంది.

"ఏదో తనకున్నభయం యిలా ప్రవర్తింప చేస్తోంది"—అని తనకుతాను సంబాళించుకుని—వచ్చి మళ్లీ నడుం వాల్చింది విక్టోరియా!

గడియారం ఒంటిగంట కొట్టింది.

వీనస్, నీలికాంతిలో యౌవన మాదకత్వాన్ని ప్రస్ఫుటింపచేస్తో వుంది. దానివంకే తదేకంగా చూస్తో —దాని అందాన్నీ దాన్ని శిల్పించిన శిల్పినీ అభినందిస్తో చిరునవ్వుతో—నిద్రకు కనురెప్పల్ని వాల్చింది—పాతికసంవత్సరాల మధుర భావపూరితమైన యౌవనాన్ని నింపుకున్న విక్టోరియా!...

రంగడు పడుకుంటానన్నాడేగానీ నిజంగా కన్ను మూయలేదు. అతని జాగ్రత్తా, దృష్టీ, యావ, అంతా మూడో అంతస్థునుంచి క్రిందికివున్న మెట్లమీదే వుంది...ఆ మెట్లమీదుగా రాజేంద్రం ఒకవేళ దిగి వస్తాడేమోననే అనుమానం బాగావుంది. ఎందుకంటే అతన్నిగురించి రంగని కొక్కడికే బాగా తెలిసేది. భోజనశాలలో అతని వాగ్ధోరణి విన్నాక తప్పకుండా విక్టోరియాను చూడటానికి వస్తాడనే నమ్మకం రంగనిలో పాతుకుపోయింది. ఎప్పుడు వస్తాడనేది తెలుసుకోవటం కోసమే ఓ కిటికీ పైభాగపు తలుపుల్ని ఓరగా తెరచివుంచేశాడు. అడుగులచప్పుడు వినబడటంతోనే హఠాత్ గా లేచి అతన్నిచూస్తో అనుసరించడానికి అనుకూలంగా మార్గాన్ని కనిపెట్టుకుని జాగ్రత్తలో వున్నాడు...—

ఎందుకైనా మంచిదని ఓసారి పనిలో పనిగా లేచివెళ్లి రంగడు విక్టోరియాను చూసొచ్చాడు కిటికీగుండా.

విక్టోరియా తీగమీది పువ్వులా నిద్రపోతోంది. "తన మాటలమీద నమ్మకముంచుకుని నిద్రిస్తోంది..." అని రంగడు తృప్తిపడి, మెల్లగావచ్చి, యథాస్థానంలో కూచున్నాడు...

చీకటి చిక్కపడుతోంది.

మేడమీద మూడో అంతస్థులో...రాజేంద్రం ముస్తాబవుతున్నాడు...

ఎమరాల్డ్ గ్రీన్ రంగులో రాత్రి డ్రస్ ధరించాడు. కాస్త తెలివివుంచేలా వైట్ హార్స్ పట్టించాడు. దిల్ బహార్ సెంట్ ఘుమ్మనుంటూ హాయి రెత్తుతోంది...

గులాబీ పువ్వుల్ని చేతికి అందినంతవరకు—ఎన్ని దొరికితే అన్ని ఆ చీకట్లో - దొంగలాగాపోయి కోసుకొచ్చాడు దొడ్డివైపుగా దిగిపోయి ఎప్పుడనగానో... వాటిని చక్కగా పుచ్చుకుని గదిలో లైటు ఆర్పేసి, అడుగులో అడుగు వేస్తో మెట్లుదిగి భోజనశాలలోంచి విక్టోరియా గదిముందుకొచ్చి ఆగాడు.

రంగడికి పాము చెవులు... మెల్లిగా కూర్చున్న వాడల్లా లేచి దక్షిణద్వారం ప్రక్కగావున్న నాప రాతి అరుగుమీదగా కూర్చున్నాడు...

రాజేంద్రం గదికి అవతలవున్నాడు తలుపు ఒక్క విక్టోరియాకే వినబడేట్లు కొడ్తూ...

రంగడు గదికి ఇవతలవున్నాడు... ఎవ్వరికీ కనిపించకుండా, ఏం జరుగుతుందో, ఎలా విక్టోరియాని రక్షించవచ్చో, ఆలోచిస్తూ...

రాజేంద్రం సరిగ్గా ఒంటిగంటన్నరకి విక్టోరియాని పిలుస్తూ తలుపు చప్పుడుచేయ సాగాడు...

విక్టోరియా కమ్మని నిద్రలో వుందేమో కనుక్క మని ముళ్లు గ్రుచ్చుకున్నట్లు మేల్కొంచింది. ఎవరో తన పేరు మృదువుగా వుచ్చరిస్తున్నట్లు ఆలాపనగా వినపడుతోంది విక్టోరియాకు.

'ఎవరా?'—క్షణంసేపు చెవులు నిగిడ్చివింది.

రంగడేమో ననుకొని కిటికీలోంచి చూసింది— కాదని అంతలోనే నిశ్చయం చేసుకుంది.

"మరెవరూ? తనని పేరెట్టి పిల్చేదీ?"— విక్టోరియా కొంత నిద్ర విదిలించుకుని తీక్షణంగా ఆలోచించేసరికి, 'రాజేంద్రం' పేరు గుర్తుకొచ్చింది... అంతే! గుండెలు ఝల్లుమన్నాయి...

"ఏమిటి ఇంత అర్ధరాత్రిప్పుడు తనని రాజేంద్రం పేరెట్టి పిలవటం?"—విక్టోరియా కలవరం పడిపో సాగింది...

తలుపు ఉత్తరవేపున - మృదువుగా చప్పుడవుతోంది...

ఎందుకైనా మంచిదని, విక్టోరియా దక్షిణవైపుగా పోయి తలుపు గడియతీసి వుంచేసింది — "ఫ్రీలైతే విపత్కర పరిస్థితి సంక్రమిస్తే గభాల్న రంగణ్ని పిలవటం కోసం"...

రాజేంద్రం- 'విక్టోరియా!' అంటూనే తలుపు కొడుతున్నాడు...

విక్టోరియాకు ఇక తప్పనట్లుతోచి, తన జాగ్రత్తలో తాను వున్నట్టుగా, దృఢంగా భావించుకుని— నెమ్మదిగా కదిలివెళ్ళి, వుత్తరవైపు తలుపుతీసింది...

"రాజేంద్రం!" చేతిలో పట్టెనన్ని గులాబీలూ, ఒంటినిండా ఎమెరాల్డ్ గ్రీన్‌కలర్ బట్టలూ, వాటినుంచి మత్తెక్కించే దిల్ బహార్ సెంటు వాసనా! విక్టోరియాని వున్మాదస్థితికి మార్చేశాయి క్షణంలో... కాని, ఆమె తెప్పరిల్లి, కోలుకుంటూ - ఆశ్చర్యంగా చూస్తో

"మీరా!"—అంది...

"ఏం? ఎవరనుకున్నావ్? భయంవేసిందా?"— అంటూ చేతిలోని గులాబీల్ని విక్టోరియాకు అందివ్వబోయాడు—"తీసుకో! విక్టోరియా! నీకిష్టమైన వేగా..." అని కూడా మాటలోమాటగా అనేశాడు...

విక్టోరియాకు, అర్థమైంది; అతని రాకలోని అంతర్యము, అతని చేష్టల్లోని రహస్యమూ, అతని ముఖంలోని, ఆరక ప్రజ్వలించే కోర్కెనూ...

ఇక తను కొంత కరుకుగా ప్రవర్తిస్తేగానీ యీ విపత్కర పరిస్థితినుంచి బయటపడటం కుదరదనీ మానాభిమానాలు దక్కవనీ అనుకుంది—విక్టోరియా:

చాలాసేపు మౌనంగా వుండిపోయింది గదిలోని వాతావరణం...

టేబిల్ మీద వీనస్ అందంగా కనిపిస్తోంది.

నీలికాంతి మత్తుగా కాస్తోంది...

అతను బాగా మైకంలోవున్నా, మనిషిలో ఎంతోమార్పు కనిపిస్తోన్నా, మాట తడబడకుండా—స్ఫుటంగా మాట్లాడుతుండటం—ఆ నేర్పూ—విక్టోరియాకు అమితాశ్చర్యాన్ని కల్గచేసింది—

"నిద్రాభంగం కల్గించానుగదూ?"

"లేదు..." అని విక్టోరియా అతనికి జవాబిచ్చింది.

"ఎందుకు మీరిలా విచిత్రంగా అడుగుతారు. —విషయం తెలిసివుండి కూడా!"

"నువ్వు దేవకన్యవు...కన్నె గులాబీవి...ఇదిగో కనిపిస్తోన్న సౌందర్యాధి దేవతైన వీనస్‌వి... నీ సౌందర్యం అనుభవిస్తూ—నీమాట వింటూ, ఈ రాత్రంతా జాగరణ చేయాలని తపన...వచ్చాను" —అతను కైపులో వున్నట్లు విక్టోరియా అర్థం చేసుకుంది—

"క్షమించాలి...మీ వైఖరి నాకేం నచ్చలేదు... గోలచేయకుండా వెళ్ళిపడుకోండి! మీరు వృథాగా చనువు చేసుకుని మాట్లాడటం నాకు చాలాకష్టంగా వుంటుంది... నేనెవరో బజారుమనిషినని వూహించుకు నుంటారు... మొదట్నించీ మీ మాటలూ— వైఖరీ—చూపులూ—నాకు అనుమానంగా నేవున్నాయి ...నేను మీ రనుకున్నంత హీనురాల్ని గాను... మానాభిమానాలు, ఆత్మగౌరవం నిలుపుకుంటూ బ్రతుకుతున్నదాన్నే...మీకు బలికావటానికి నేను రాలేదు...మీ నాన్నగార్ని దర్శించుకు నేందుకు వచ్చాను...ఆయన లేరని తెలీటంతో—చాలా నిరాశపడ్డాను..." ఇలా విక్టోరియా తనబలంకొద్దీ అంటోంది.

# సగం విరిగిన వీనస్

రంగన్నకి గదిలోని ఇరువురి మాటలు విన్పిస్తోనే వున్నాయి...

రాజేంద్రం, ఆమె మాట్లాడినంతసేపు విననట్లే వినపడనట్లే వ్యవహరించాడు.

అతను ఆ రాత్రికి—విక్టోరియాతో జాగరణ చేద్దామనుకున్నాడు...

విక్టోరియా లొంగేసూచనలు ఎక్కడా పొడచూపడంలేదు అతనికి.

అతను, విక్టోరియాను ఎన్నోవిధాలుగా—గొప్పగా—మర్యాదగా—మాటలద్వారా వర్ణించాడు లొంగుతుందేమోనని.

విక్టోరియా కొరకరాని కొయ్యగా మారిపోసాగింది...

అతనికి నిషాక్రమేపీ వుస్కృత మవసాగింది. మానవత్వం మరుగునపడ సాగింది. దానవత్వం ప్రకోపిస్తోంది.

విక్టోరియా పనిగట్టిం దిదంతా! ఉండి-ఉండి... అతను కై పెక్కి పోసాగాడు. విక్టోరియాకి భయం, ఆందోళన, ఆవరించుకోసాగినై.

"విక్టోరియా!" అంటూ గభాల్న రాజేంద్రం ఆమె ఒంటిమీద చేయివేశాడు...విక్టోరియా విదిలించేసింది-దూరంగా జరిగిపోతూ! కోపంగా చూస్తూ... "ఏం? శరీరంలో విద్యుత్ ప్రవహించిందా? విసిరికొట్టావ్?"-అన్నాడు వికటంగా నవ్వుతూ!

"ఛీ!"-అసహ్యించుకుంది-ఆమె. అతను రెచ్చిపోతూ-ఆమెను సమీపించాడు ... ఆమె అతనిబారి నుండి సాధ్యమైనంతవరకు తప్పుకుంటూ, గట్టిగా బుద్ధొచ్చేలా-ఘాటుగా మాట లనసాగింది. అతను మూగవాడిలా - చెవిటివాడిలా ఆమెను వెంటాడ సాగాడు...ఓ కీచకుడై...ఆమె ఇక అతని భీకరప్రకృతి చూడలేక నిశ్చేష్టురాలైపోసాగింది ... హఠాత్ గా రాజేంద్రం విజృంభించి ఆమెను కౌగలించుకోబోయాడు...ఆమె అతని ఇనుపహస్తాలకు అందకుండా అటూ-ఇటూ తప్పించుకుంటూ గదంతటినీ కలయతిరుగసాగింది.

అతను చిరాకెత్తాడు...
ఆమె వివశురాలౌతోంది క్రమేపీ...
అతను రాక్షసుడైపోయాడు...
ఆమె అబలకాసాగింది...
అతనికళ్ళు చంద్రనిప్పుల్ని చెరుగుతున్నాయి.

ఆమె హృదయం ఆర్తనాదం చేయబోతోంది-
ఆమెని సమీపించి, తాకి-గట్టిగా ఆశ్లేషించాడు.

ఆమె అతని కబంధహస్తాల్లోంచి పెనుగులాడ్తూ విడుల్చుకుంటో కెవ్వున కేక వేసింది-

అతను లెఖ్ఖచేయకుండా, ఆమె నెత్తుకుని-మంచంమీదకు విసిరిపార వేయబోయాడు - క్షణంసేపు, గిజగిజలాడుతున్న విక్టోరియాను చూస్తో-ఆమె బుగ్గలమీదకూ - పెదాలమీదకు తన ముఖాన్ని వంచబోయాడు...రాజేంద్రం—

విక్టోరియా నీచంగా చూస్తూ షెడీల్ మంటూ చెంప పగిలేట్టు ఒక్కటిచ్చుకుంది...

అతను హుంకరించాడు; ఆమె విలపించింది.

దక్షిణపై పుతలుపు తోసుకుని రంగడు హుటాహుటిగా లోనికి వచ్చేసరికి, ఊహించినంత ఘోరం విలయతాండవం చేస్తోవుంది...

రాజేంద్రం రంగణ్ణి చూశాడేకాని, జంకలేదు; నిర్లక్ష్యంగా-మాత్రం,

"నువ్వీవిషయంలో కల్పించుకున్నావో ప్రాణాలు దక్కవ్. నోర్మూసుకు బయటికి పో!" - ఉరిమాడు. అతని పాషాణహస్తాల్లో ఆమె యవ్వనం, సుకుమారం మార్దవం నలిగిపోసాగినై...రౌండ్ టేబుల్ మీది గులాబీలు రెక్కలు విరిగిపోయి నేలపడి విలపిస్తున్నాయి.

"అతను ఆమెను వదిలేపరిస్థిలో లేడు;" రంగడు గ్రహించాడు.

రాజేంద్రం హస్తాల్లో, విక్టోరియా క్రూరంగా - నిర్దయగా - హింసింపబడటం రంగన్న సహించలేకపోయాడు.

నలభైయేళ్లు దాటినా, జబ్బబలం తగ్గని మనిషి రంగడు...పూర్వం తనెలావుండేవాడో, ఎంత బలిష్ఠమైన శరీరమో, ఎంత కండపుష్ఠి కల్గివుందీ రంగన్నకి కొత్తశక్తిని తెచ్చుకునేలాగు గుర్తుకువచ్చింది.

ముందు పరిస్థితి చక్కబరుద్దామని మంచిగా చెప్పిచూశాడు...

రాజేంద్రం వినిపించుకోకుండానే చేతుల్లోని విక్టోరియాను మంచంమీదికి విసిరివేశాడు...తనలో శక్తినీ యవ్వనపు కోర్కెనీ ప్రస్ఫుటీకరిస్తో...

రంగన్నకి మంచిని నమ్ముకుని ప్రవర్తించటం, రాజేంద్రంపట్ల న్యాయంగా తోచలేదు.

ఇంతలో విక్టోరియా మంచంమీదినుంచి ప్రక్కగా లేస్తూ, గదిలోంచి పారిపోవటానికి ప్రయత్నించటం రాజేంద్రం కనిపెట్టాడు...

పెద్దపులిలా గాండ్రిస్తో—

"విక్టోరియా!" అన్నాడు...

ఆమె భయంతో లేవనుంకిస్తూనేవుంది; గబుక్కున ముందుకుపోయాడు. ఆమెని వెళ్ళనీయకుండా చేయటానికి, అతను.

అతనిని తప్పించుకునే నిమిత్తం లేస్తోందగానే—పట్టుకోబోయాడు, ఆమెని.

ఆమె అందకుండాపోదామని తప్పుకోవడంలో—తలనెళ్ళి గోడకు గట్టిగాకొట్టుకుంది. కళ్ళుతిరిగాయి; నిట్టనిలువునా విరగతీసుకుని నేలమీద, రౌండ్ టేబిల్ ని పడద్రోస్తో పడింది–ఆమె సంచిలోనివి, దానిలో పెట్టుకోవలసిన బట్టలూ — నేలమీదకు జరజరా దొర్లి పోయాయి.

రంగన్న కోపోద్రిక్తమానసుడై ... కోపఘూర్ణిత నేత్రాలతో—రాజేంద్రంవంకం చూశాడు!

అతనుకూడా జంకూ — గొంకూలేకుండా — ఓక్షణంపాటు నిల్చుండి, చిగుళ్ళు వనుతిగిపోతూ, చిరిగిన తలకటుని సవరించుకుంటూ, కదిలిన ఓపన్ను కక్కి రక్తాన్ని గోడమూలకు వుమిస్తో, వుత్తరవేపు గుండా నిష్క్రమించేశాడు...అంతలోనే— ఎందుకో ఓసారి మళ్ళీ వెనక్కి తిరిగి వచ్చేసి, గుమ్మంలోంచే గదిలోకి–చెల్లాచెదరైన పరిస్థితిలో–దిమ్మతిరిగి పడున్న విక్టోరియాని తీక్షణంగా చూశాడు—

ఆ చూడటంలోనే — టేబిల్ మీద పాలరాతి వీనస్ కనిపించలేదు; అసలు రౌండ్ టేబిల్ మొత్తం ఒరిగిపడివుంది—

క్రింది పెదవిని కొరుచుకుంటూ, రంగన్నని చీల్చే వైఖరిలో చూస్తో, గబగబా తనగదికి తూలుతూ–ఆయాసంతో వెళ్ళిపోయాడు...

రంగన్నకి రాజేంద్రంమీద అసహ్యం ఏర్పడింది...

ఒక్కసారి గదంతటినీ కలయచూశాడు; గులాబీలు రెక్కలువిడి మూలుగుతున్నాయిబొకేలో—విలపిస్తో...విక్టోరియా సంచీ ఎక్కడో ముడుచుకు పడివుంది; ఆమె బట్టలూ, ఇతర అవసర వస్తువులు రౌండ్ టేబిల్ చుట్టూ చెల్లాచెదురుగా పడివున్నాయి.

వీనస్ విగ్రహాన్ని గురించి అసలు ఆలోచనే కల్గలేదు—రంగడికి.

మెల్లిగా, లేవనెత్తి మంచంమీద పడుకోబెట్టి, రెండుసార్లు తలుపులుగడియపెట్టి పొంగేఉద్రేకాన్ని అణగార్చుకోలేక తెలిసినవిషయాల్ని చెప్పటం సమంజసమనియెంచి, ఏకాయెకీగా — రాజేంద్రం గదికి వెళ్ళాడు...

తలుపులు బావురుమంటూ తెరిచేవున్నాయి... మెల్లిగావెళ్ళడం ఎప్పుడు అలవాటుగా వుండేది— అతనికి ఆ గదిలోకి. కాని అప్పుడు అతనిలో వుద్రేకం పొంగిపొరలుతోంది. విసురుగా లోనికిజొరబడ్డాడు... రంగడు...

రాజేంద్రం, బట్టలు మార్చుకుంటూ, హఠాత్ గా వచ్చిన రంగణ్ణిచూసి నిశ్చేష్టుడయ్యాడు.

"క్షమించండి! మీరు పిలవందే వచ్చినందుకు" రంగన్నముందు వినమ్రతతో ప్రవర్తించాడు.

"నీ మూలంగా నేను చాలా అవమానం పొందాను. అసలు నువ్వెందుకొచ్చావ్ గదిలోకి?"

"విక్టోరియాని మీకు దక్కకుండా చేయటం కోసం, ఆమె జీవితం నాశనం కాకుండా చేయటం కోసం, మీ పరపతినీ, గౌరవాన్నీ, జీవిత విలువనూ, వంశమర్యాదనూ, నిలపటంకోసం... రాక తప్పిందికాదు"–రంగన్న ఎంతో విధేయతగా, రాజేంద్రంకి సమాధానమివ్వసాగాడు....

"నా సంగతి నీకు తెలుసుగా ఇన్నాళ్ళనించీ, నేను ఎలాంటి వాణ్ణో చూస్తూనే వున్నావుగా! తెలుసుగా నా ప్రవర్తన?"

"అంతా తెలుసు బాబూ!"

"తెలిసీ ఎందుకు యీ విఘాతం కల్గించావు, విక్టోరియా నాకు దక్కటం, నీ కెందుకుఇష్టంలేదు..."

"కారణాలు చాలా వున్నాయి...వింటే మీరు చాల బాధపడతారు"

"బాధపడే కారణాలయితే ఇన్నాళ్ళూ ఎందుకు చెప్పలేదు..."

"విక్టోరియాని మీరెప్పుడూ చూడలేదు కాబట్టి"

"ఏమిటది?"

విక్టోరియా మీకు చెల్లెలు...తెలుసా!"

"చెల్లెలా నాకు...విక్టోరియా! నీకేమన్నా మతి పోతోందా?"

"లేదు; తెలిసే మాట్లాడుతున్నాను... విక్టోరియా మీకు చెల్లెలే!"

"ఎలా?"—రాజేంద్రం ప్రశ్నించాడు.

రంగన్న చెప్పక తప్పలేదు...

"మీ నాన్నగారు-రావ్ సాహెబ్ గారు- నేనూ చాలా స్నేహంగా వుంటూ వుండేవాళ్ళం...ఇప్పుడంటే మీకు నేను యీ యింట్లో కాపలావాడుగా ఓ నౌకరుగా ప్రవర్తిస్తున్నా గానీ, అప్పుడు మీ నాన్నగారికి ముఖ్య అనుచరుడిగా వుండేవాణ్ణి! ఆయన జీవితమంతా నాకు తెలిసినట్లుగా మరెవ్వరికీ తెలీదు; కనీసం మిమ్మల్ని కన్న స్త్రీకికూడా తెలీదు. ఆయన గారి అసలు భార్యకుకూడా తెలీదు.

రావుసాహెబ్ గారంటే పెద్దజమీగల్గిన వ్యక్తి. మీరుపుట్టకముందూ, పుట్టాక చాలా కాలం వరకూనూ..

అసలుభార్యకు పిల్లలులేరు. రావుసాహెబ్ గారు భార్యవల్ల పిల్లలు కలగక పోయేసరికి చాలా వ్యాకులపాటు చెందారు. అలాగే భార్యకూడా చెంది మనోవ్యాధితో మరణించింది.

తరువాత మీరుపుట్టారు. ఆయన జమీగ్రామాల్లో, నేనూ ఆయనా తిరుగుతుండే రోజుల్లో ఓ స్త్రీ సంబంధంవల్ల...

మిమ్మల్ని కన్నాక, మీ తల్లికూడా పోయింది.

మిమ్మల్ని రహస్యంగా తెచ్చి పెంచిన వాణ్ణి నేను...నా చేతుల మీదుగా మీరు పెరిగారు.

తరువాత విక్టోరియా తల్లికీ మీ నాన్నగారికీ ఓ సారి నా వల్లనే ఓ పల్లెటూళ్లో— రాగబంధం ఏర్పడింది; ఆయనగారికి విక్టోరియా తల్లి మీద ఎంత ప్రేమాభిమానాలుండేవో నేను వూహించినా చెప్పలేను...

మీ నాన్నగారికి పరిచయమైనపుడు విక్టోరియా తల్లి మేరీ ఓ బడిపంతులమ్మగా జీవిస్తోంటేది; ఇంకా పెళ్లి కాలేదు; మీ నాన్నగారి ప్రోద్బలంతో మేరీకీ— మీ నాన్నగారికీ రాయబారం జరిపి, ఒకటిగా చేయగల్గాను. ఆమె పోషణ మీ నాన్నగారే చూస్తో చేరదీశారు...మీ నాన్నగారి పోషణలోనే — విక్టోరియా పుట్టింది; విక్టోరియా పెద్దదై చదువుకోవటానికి పలయు ఖర్చంతా ముందుగానే జమీ అధికారులతో సంప్రదించి ఏర్పాటు చేసేశారు... మేరీ విక్టోరియాలు బతికి వున్నంత కాలమూ మీ నాన్నగారిచ్చిన ఆస్తిని యథేచ్ఛగా అనుభవిస్తో బతికటానికి అధికారాన్నిస్తూ — వీలునామాకూడా వ్రాసి, ఇచ్చేశారు— ఇదంతా జరిగి చాలా కాలమైంది ... అప్పుడు మీరు చాలా పసిరతనంలో వున్నారు ఎంతో అమాయకత్వాన్ని నింపుకుని—అదుతో—పాడుతో—...

తర్వాత మీరు లక్నోలో చదువుకొంటుండగా—మీ నాన్నగారు ఎలా పోయారో మీకు తెలిసిందే! నిజంగా మీరనుకున్నట్లు మీ నాన్నగారు మరణించలేదు... తెలుసా ఆ సంగతి...

రాజేంద్రం ఇదంతా వింటూ ఆశ్చర్యపోతున్నాడు..."జబ్బుతో గాదాపోయింది మాతండ్రి"...

"ఎలా పోయారు ?"— తెలీక అడిగాడు.

"విషం పుచ్చుకుని !"—రంగన్న చెప్పాడు.

"విషమా !"

"అవును..."

"కారణం ?"

"తను చేసిన తప్పుకి పశ్చాత్తాపపడటం — ఎక్కువై ... భరించలేక ... దహిస్తో..."

—రాజేంద్రం నెఱుగందాడు రంగన్న మాటకి...

"ఈ విషయం యథాతథంగా మేరీకి తెలుసా ? విక్టోరియాకు తెలుసా ?"

"ఎవ్వరికీ తెలీదు..."

"ఎందుకని..."

"మీ నాన్నగారే చెప్పొద్దన్నారు."

"ఎందువల్ల ?"

"మేరీ చాలా సుకుమార హృదయ కావటం వల్ల..., తను లేని లోటుకి చింతా మగ్నమానసయై కుములుతూ మనోవ్యాధితో యేదైనా అఘాయిత్యం చేసి విక్టోరియాని దిక్కులేని దాన్నిగా చేసి పోతుందేమోననే భయంతో..."

"ఇప్పుడైనా విక్టోరియాకు తెలిసిందా ?"

"కేవలం మరణించారనే చెప్పాను..."

"ఏమంది ?"

"ఎంతో నిరాశచెందింది..."

రాజేంద్రం ఒక్కసారి విచలితుడైపోతూ—, రంగన్నను కౌగిలించుకుని క్షమాపణ కోరాడు

విక్టోరియా తరఫున ... "నేను చాలా నీచంగా ప్రవర్తించినందుకు క్షమించు" అంటూ...

ఆ రాత్రి తెల తెలవారుతూండగా గదిలో విక్టోరియాకు మెలకువ వచ్చింది ... కళ్లు తెరిచి చూసింది. ఎదురుగా రంగన్న కాఫీకప్పుతో నిలబడివున్నాడు...

విక్టోరియా శరీరమంతా నొప్పులతో మండుతూంది...రంగన్న అందిచ్చిన కాఫీ త్రాగి కొంత ఓపిక తెచ్చుకుని ...

"రంగన్నా ! నేను ఇక వెళ్లిపోతా ?" అంది హీనస్వరంతో — భయంతో ...

"అలా గేనమ్మా! గుర్రపుబగ్గీ తెస్తాను సిద్ధం కండి." అంటూ ఆమె బట్టల్ని, అవసర వస్తువుల్ని, రౌండ్ టేబిల్ లేవనెత్తి, పోగుచేసి, సంచిలో సర్దాడు ...

ఈలోపుగా విక్టోరియా మెల్లిగాలేచి, ప్రయాణానికి సిద్ధమైంది; రాజేంద్రం మళ్లీ వస్తాడేమో ననే భయం ఓప్రక్క వేధిస్తూనే వుంది ...

మేడ క్రిందినుంచి రంగన్న పిల్చాడు.

మేడమీంచి విక్టోరియా సంచితో దిగివచ్చి గుర్రపుబగ్గీలో కూర్చుని ఎందుకో మేడమీదకి — ఓసారి చూసింది.

మూడో అంతస్థుపై కిటికీలోంచి నీలిరంగు తెరల్ని తొలగిస్తూ రాజేంద్రం చూస్తున్నాడు... ఏదో బాధ అతనిముఖంలో అలుముకునివుంది ...

గుర్రపుబగ్గీ తోటదాటి — గేటు దాటింది — రైలుస్టేషన్ వైపుకి ...

అరగంటలో విక్టోరియా రైల్లో కూర్చొని — రంగన్నని అభినందిస్తూ — సంతోషంకొద్దీ ఏడన్నా. ఇద్దామని పర్సుకోసం సంచిలోకి చెయ్యిపెట్టింది. చాలా సేపటి వరకు పర్సు కనిపించ లేదు, టికెట్ మాత్రం రంగన్నే కొని తెచ్చియిచ్చాడు. ఆమె సంచీ నంతట్నీ కలచివేస్తూ వెతుకుతూవుంది.

రైలుకూసింది. పచ్చజెండా రెపరెపలాడుతోంది.

"నా పర్సేదీ!" అంది విక్టోరియా.

"ఇదిగో!"అంటూ రంగన్న అందిచ్చాడు.

ఆమె అందుకుని తెరచిచూచింది. ఎన్నో వంద రూపాయల నోట్లు పేర్చబడివున్నాయి.

"ఎందుకింత డబ్బు! ఎవరిచ్చారూ!"- అనడిగింది విక్టోరియా!

"అవసరానికీ అనుభవించటానికీ నేనే ఇస్తున్నాను తల్లీ! ఇది నా డబ్బుకాదు. రావ్ సాహేబు గారు మీ కుటుంబం కోసం నావద్ద దాచిన డబ్బు... తీసుకోమ్మా" - అంటూ - గాద్గదికంగా అన్నాడు రంగన్న. విక్టోరియా పర్సులోనికి చూస్తూ ఏమివ్వాలో తోచక తికమక పడసాగింది.

రైలు మెల్లిగా కదలబోతుంది.

విక్టోరియా సంచీనంతా వెతకగ్గా హఠాత్ గా చీరె మడతల్లో గట్టిగా ఏవో రెండు ముక్కల్లాంటి వస్తువులు చేతికి తగిలాయి.

విక్టోరియా నివ్వెరపోతూ, చీరెమడతల్ని సవరించి తీసిచూసింది.

సగం విరిగిన వీనస్-పాలరాతి బొమ్మ...

"ఇది నాకెందుకు రంగన్నా! ఎందుకు ఇందులో దాచిపెట్టావు? నా జీవితం ఇక్కడకు రాకరాక వచ్చినందుకు ఎలాఅయిందో, దృష్టాంతరంగావుండటానికా?" అంది.

రంగన్నకి - తెలీదు ... ఆ బొమ్మ సంచీలో చీరెలతోపాటు సర్ది పెట్టాననే-సంగతి...

నిజం చెప్పాడు. విక్టోరియా ఆ సగం విరిగిన వీనస్ పాలరాతి బొమ్మ రెండు ముక్కల్ని రంగన్నకిచ్చేసి—

"తను చేసిన చెడ్డపని - నాపట్ల-ఎలా పరిణమించిందో-దృష్టాంతరంగా చూచుకోమను మీ రాజేంద్రాన్ని-యీ బొమ్మని చూస్తూ. అతని మూలంగా నా మానాభిమానాలు ఎలా మలినమైనాయో-నావ్యక్తిత్వం ఎలా దెబ్బతిందో రోజూ చూస్తూ, తల్చుకుని పరితాపం చెందమను. ఇంతకంటే అతని నీచత్వాన్ని పరిహారింప చేసేదేంలేదు. ఇదే యీ సగం విరిగిన వీనస్ యిచ్చే సందేశం అతని పాపప్రవృత్తికి నిష్కృతి" - విక్టోరియా క్రమంగా ఇలా అంటుండగానే రైలు కదిలింది. రంగన్న దూరమై పోయాడు. అతని చేతిలో సగం విరిగిన వీనస్ పేలవంగా నవ్వుతోంది.

# తిక్కన కర్ణపర్వ నిర్వహణము

శ్రీ యడవల్లి ఆదినారాయణ

తిక్కన సర్వతోముఖమైన కావ్యరచనా శిల్పమున ప్రథమ గణనీయుడని విమర్శకుల అభిప్రాయము. విరాటపర్వ ప్రారంభమున తిక్కన తాను రచింపబోవు భారతభాగములను గూర్చియు తాను చేయవలసిన కర్తవ్యమును గూర్చియు ఇట్లు చెప్పెను.

"కథ జగత్ప్రసిద్ధము గావున
పూర్వాపరార్థయుక్తి సేయునట్టి యెడల
యత్నమించుకంత యయినను
వలవదు వలసినట్లు చెప్పవచ్చియుండు."

అనగా వ్యాసమహాముని కృతమైన భారత సంహితయందలి కథ విషయమున ప్రయత్నమేమియును పెద్దగా నక్కరలేదు. ఆ కథ ఎల్లరకును తెలిసినదే. కాని దాని పరమార్థము నెఱిగి వ్యాసభగవానుని హృదయము నవగతము చేసికొని కాలమునకును, సంఘమునకును తెనుగు జాతికిని, భాషామతల్లికిని ననువైన విధముగ ననువదించుటయందును, పాఠకులకు స్పష్టముగను, సులువుగను, సమగ్రముగను నందించుటయందే నైపుణ్యమును, జాగరూకతయు కావలెనని తిక్కన పైపద్యమున స్పష్టీకరించెను. అనగా తానేది చెప్పదలచెనో దానిని సరిగా చెప్పుటయే తన లక్ష్యమని అతని భావము. తిక్కనవంటి మహాకవి కిదియా! లక్ష్యము, అని ప్రశ్న పుట్టును. ఇది సామాన్యమైన విషయము గాదు. శిల్పమునకును, చిత్రలేఖనమునకుగూడ నిదియే లక్ష్యము. శిల్పిగాని, చిత్రలేఖకుడుగాని తాను భావించిన మూర్తిని సంపూర్ణముగా రూపొందించుటయందే లక్ష్యముంచి కృతకృత్యులగుటయే వారిశిల్ప పరమావధిగా విమర్శకు లంగీకరించి యుండిరి.

తన మనోగతమైన భావమున కనుగుణమైన శబ్దార్థములతో శిల్పసౌందర్యమంతయు విలసిల్లినగద కవి సర్వాంగసుందరమైన కావ్యమును సృష్టింపగలిగినట్లు భావింపబడుట. అందుచే భారతకథ ఎల్లరకు తెలిసియున్నను కవితానై చెప్పదలచిన కావ్యరీతినిగల వైశిష్ట్యమును తాననుకొనినట్లు చెప్పగలుగుటయు, తన దృక్పథమును లోకమున కందించుటయు తిక్కనకు లక్ష్యములయినవి. కథయొక్కటే యైనను కవిప్రతిభనుబట్టి కావ్యస్వరూప సౌందర్యములందు వైలక్షణ్యముండును.

కళారాధకున కేనికైనను తాను తలచిన దానిని లోకము గ్రహింపగలుగునట్లు తనకున్న సాధన సంపదతో యత్నించి కృతకృత్యుడగుటయే లక్ష్యమని మనకు స్పష్టమైనది. ఇందు తిక్కన ఎంతవరకు కృతకృత్యుడయ్యెనో అతని యత్నస్వరూపమేమో చూపుటయే ఈ వ్యాసరచన లక్ష్యము.

ప్రాముఖ్యమును, వైవిధ్యమును, వైశిష్ట్యమునుగల పాత్రలును, కథాఘట్టములు నెన్నియో భారతమున గలవు. కాని వాని తారతమ్యమెరిగి వానికి తగిన స్థానమిచ్చి పోషించుటయే కవికి ప్రథమముగా వాంఛనీయమైనది. భారత కథలో ముఖ్యపాత్రలు కౌరవ పాండవులును, వారికి గురుస్థానీయులయిన భీష్మద్రోణకృపాశ్వత్థామలును, ధృతరాష్ట్రుడును నైయుండగా "కర్ణుతెల భారత"మను నానుడి తెనుగునాట పరివ్యాప్తమైనది. ఈ విషయమును తిక్కన త్రోసిపుచ్చలేదు. వ్యాసుని దృష్టి కూడ నిదియేయని తిక్కన గ్రహించినట్లును, దానినే తానును స్వీకరించినట్లును కర్ణపర్వమును పరిశీలింపగా తేలును.

యావద్భారత కథాఘట్టమునకును, మహాభారత రణరంగమునకును, కురుకుల దాహమునకును మూలకారణమైన ప్రధానపాత్ర కర్ణుడే యనునది యెల్లరకును విదితము. 'అందుచే పది దినములు భీష్ముడును, నైదు రోజులు ద్రోణుడును, రెండు దివసములే కర్ణుడును ప్రధాననాయకులుగా భారతరణము నడిపినను కర్ణపర్వమునకుగల ప్రాముఖ్యము తక్కిన వానికి లేదు. ఈ భాగమునందలి యుద్ధవర్ణనలేమి, పాత్రోన్మీలన స్ఫూర్తియేమి, సన్నివేశచిత్రణచాతుర్యమేమి, కడువిశిష్టమై, హృదయంగమముగా రూపొందింపబడినదనియు నీ భాగమున తిక్కన శిల్పకళాప్రావీణ్యము గట్టుల నొరసినదనియు పాఠకులకు స్పష్టము చేయుటయే నా యత్నము.

కర్ణుడు ధర్మజ భీములపై మహోగ్రుడై తల పడెను. అర్జునుడు వారికి సహాయుడై రాకుండా సంశ ప్తకులడ్డు తగిలిరి. అంతదనుక ధర్మజుడును కర్ణుడును పోరుటలో కర్ణుడు ధర్మజు నోడించి యవమానించి తూలనాడి పంపెను. అవమానము దుర్భరమై ధర్మ జుడు నిజశిబిరమున కేగెను. భీము డొంటరియైనను తన ధైర్యస్థైర్యములతో కర్ణునెదుర్చుచునే యుండెను. అంతలో సంశప్తకుల నోడించి యశ్వత్థామను తొలగ జేసి యర్జును డొంటరిగా యుద్ధము చేయు భీముని జేరెను. ధర్మజుని యవమాన వృత్తాంతము విని కృష్ణ సారథ్యమున నాతని శిబిరమునకుపోయి పరామర్శింప దలచెను. అచ్చట ఖిన్నవదనుడైన ధర్మజుడు కృష్ణార్జు నులనుజూచి మహోత్సాహపూరితుడై కర్ణునకు ప్రతీకార ముగా నాతని నంతమొందించి యావార్త చెప్పుటకే వారు వచ్చియుందురని యూహించి తదనుగుణమైన కిరీటి పరాక్రమమును గొనియాడ మొదలిడెను:

సురలైనన్ జలమొత్తి కర్ణుని
రణక్షోణిన్ జయింపగ నే
ర్తురె యవ్విభుడు జామదగ్న్య శి
కలితాస్త్రోద్ధిద్ధ తేజంబునన్
ఘోరసప్తార్చికి, లావునన్
పవనుతో తుల్యుం డగయ్యుండు సం
గరసంక్రీడల యందు పేర్కొనదగున్
గాంభీర్య ధైర్యంబులన్"

ఇందర్జును నభినందించుటయే యుద్దేశమైనను తొలుతగా కర్ణుపరాక్రమాతిశయ ప్రశంసయే ద్యోతిం చును. కర్ణునిచేత నొచ్చిన ధర్మజుడు వాని పరాక్ర మముయొక్క నిజస్వరూపము నుగ్గడించుట యుచితము. కాని యిది యాతని తాత్పర్యము కాదు. కాకున్నను కర్ణునిర్జింపకుండవచ్చిన యర్జునునికిమాత్రము పైపలు కులు ములుకులై కర్ణవధకు దృఢసంకల్పుడగునట్లు చేయగలిగినవి. దీనికితోడు గౌరవార్హుడైన ధర్మజుడు తన దుస్థితి కన్నులకు కట్టునట్లును, హృదయము ద్రవింపునట్లును, జాలికలుగునట్లును, వాపోవుటచే నర్జునుని హృదయము చేయిపెట్టి కలచినట్లైనది. తిరు వాత ధర్మజుడు పరామర్శలో

"అరుదిది నీవు నొవ్వక మహాబలు
కర్ణువధించి తొల్త డ
క్కురుపతి సంతసింప నరుగూల్చెద
సంగర భూమి సేన రొ
క్కరుడను వీక దాకి యను
గర్వపుమాట సనంగనీక నే
టి రణములోన నిట్లు ప్రకటింతె
భవద్భుజ వీర్యశౌర్యముల్.
...ఆ సభన్

"బలుకునెయట్లు జూదపు
నెపంబున ద్రౌపది నింతకాలము
ప్పలుకులలంచుచుండె మదిబాయవు
గీరిన యమ్ములట్ల"

అనుచు అర్జునుని క్రోధమున కింధనముల జేర్చు చున్నప్పటికీ కర్ణుని వధింపజాలక,

"పట్టపగటింటి సూర్యునిపగిది కర్ణు
డుగ్రమూర్తియై వెలుగుచున్నవాడు
మనరథంబిప్డు మాధవ! మరలనిమ్ము
బ్రదికియుడింనసుఖములు బడయవచ్చు."

ననుచు జంకుమాటలాడిన యర్జునుని శక్తిహీనత నుపాలంభించుచుండెనో యన్నట్లుగా ధర్మజునకొక రీతిగను, అర్జునునకొకరీతిగను, పాఠకులకొకరీతిగను భావోద్రేకము కల్గించి ప్రధానమైన కర్ణవధకు నర్జును నప్రయత్నపూర్వకముగా ధర్మజుడు పురికొల్పుటయే వాక్యపర్యవసానముగా కవి చేయగల్గుట యీ ఘట్టమునకు ప్రాముఖ్యమును చేకూర్చినది. ఇంతవరకు నర్జునుడు తాను కర్ణుని జయింపక పరాభూతుడైన ధర్మ జుని పరామర్శింప వచ్చియుండునట్లు తెలుపనేలేదు. ఏల? ధర్మజుడుత్సాహపూరితుడై యేమేమో తాను చేయని తన కర్తవ్యమునుగూర్చి పలుకుచుండ తద్భిన్న ముగా ధర్మజునకు నిరాశను కల్గించు తన యశక్తతా పూర్వక పరిస్థితి నర్జును డెట్లు వేగముగా ప్రకటింప గలడు. అందుచే తాను కర్ణుని చంపలేదను విషయము నెట్లు ప్రకటింపవలెనో తెలియకయు, ప్రకటించు టకు ధైర్యము చాలకయు, నర్జునుడింతవర కూరకుండెను. ఈ యోరిమి తనపల్కుల కంగీకరణముగా గ్రహించి ధర్మజుడితోధికోత్సాహ పూరితుడయ్యెను. ఈ యుభ యుల మనఃప్రవృత్తులును తదనంతర కర్ణవధాఘట్టము నకు కావలసిన సన్నివేశ తీవ్రతను సమకూర్చినవి. ఎట్ట కేలకు అర్జునుడు తాను కర్ణుని వధింపలేదను విషయము సన్నగా ప్రకటించెను. అది చెవిని సోకినదో లేదో ధర్మజు డలుక గదిరి తాను తననే నిష్ఠురించుకొని

"విను కర్ణున కే నోడితి నన నేటికి,
నీవు నోడి తనిలజ మాద్రీ
తనయులు మున్నె యోడిరి మనలో
గూడంగ కంసమర్దియు నోడెన్"

అనుచు మఱియేయో నిష్ఠురములాడెను. అలుక గదిరి ధర్మజు డర్జునుడు పరుషభాషణములు పలికిన యంతనే కెంజాయరంజిల్లు కన్నులుగలవాడయ్యెనట. అలుక గదిరి పలికిన పలుకులను, కెంజాయరంజిల్లిన యనంతరము వాడిన ములుకులవంటి పలుకులకును భేదము గమనింపదగినది. ఈ ఘట్టమున నర్జునుని దౌర్బల్యము కర్ణుని దిట్టతనము స్పష్టముగా చూడవచ్చును.

"నిజంబుగ సెగగను వీడని రాధేయునకు వెఱచు ననియే నిన్నున్" అట్లుపాలాభించి ధర్మజుడు కృష్ణు నవలోకించి, తాను చావుతప్పి బయటపడుటకు భీముడు లేకున్నచో నసాధ్యమయ్యెడిదని అతని పరాక్రమం బగ్గించెను. అట్లు వాపోవు వరుసలో పార్థునిజూచి

"నే డభిమన్యుం డుండె, హైడింబుండుండెను గల్గిన నిట్లగునే" యని నుడివెను. ఇందలి యభిమన్యు ప్రస్తావన ధర్మజుడు యాదృచ్ఛికముగా చేసినను, నది యర్జునునకు పుండుపై కారము చల్లినట్లయి, తన కుమార వధకు మూలకారకుడైన కర్ణుని భ్రమింపించుటకు స్థిర సంకల్పుని జేసినది. అంతటితో నూరుకొనక ధర్మజుడు "గాండీవము కృష్ణున కిచ్చినచో నాతడే జయించెడి వాడని" యర్జునుని తూలనాడెను. తుదకు

'గొంతి కడుపునందు కొడుకు చూలై నీవు
దోపకూడవైతి తోచినట్టి
కిండ మెడలిరైన బిడప దిగంబడ
దయ్యె నింత వుట్ట దట్టులైన"

ఇది ధర్మజు కోపమునకు పరాకోటి. ఇది యర్జునునకు భరింపరానిది. అందుచే నాతడు తనపూర్వ శపథప్రకారము ధర్మజు నంతమొందించుటకు కుద్యుక్తుడయ్యెను. అప్పుడు శ్రీకృష్ణుడు వారిరువురి కోపోపశమనము చేసి యథాపూర్వముగ సౌహార్దమును, సౌభ్రాత్రమును నెలకొల్పెను.

ధర్మజు ననునయించుచు కృష్ణుడు మాటవరుసకు "సూతసుతుని మెడసెత్తురు భూతలమున నివురు నేడు, భూనాయక! నీ వాతనికి నలిగినప్పుడపో, తెగియెడున్, పూని యేన చుమ్ము పలికెదన్" అనెను. ఇందలి వాక్యములే కర్ణవధకు ప్రధాన సాధనములనియు, నర్జునుడు నిమిత్తమాత్రుడనియు, పాఠకు లెఱుగవలెనని కృష్ణుని ముఖమున తిక్కన పలికించెను.

కర్ణుని జయించి యంతమొందించుట సామాన్య కార్యము కాదు. ఆతడు సూర్యదేవుని వరప్రసాదమున బుట్టినవాడు. పాండవుల కాభిజాత్యమున నేమాత్రమును దీసిపోవువాడు కాడు. అందుచే నాతని నంతమొందించుటకు సామాన్య మానవశక్తిగాని, భౌతికశక్తిగాని చాలదు. ఆత్మోన్నత్యమును నైతికజీవనమునుగలవారే యెదుర్కొనవలెను. అదియుగాక కర్ణుడు తానై దోషము చేయవలెను. అప్పుడే యాతని శక్తి క్రుంగును. పరశక్తి పెరుగును. ధర్మజునికి కోపము తెప్పించుటచే కర్ణునికి తీరని దోషము వాటిల్లినది. ఇది ధర్మజన్య క్రోధము. కాన కర్ణుని పతనకాలము సమీపించినదని సూచన. ధర్మజన్యక్రోధము భగవంతుని కసహ్యము. అందుచే ధర్మజు నలుకయు, కృష్ణుని నిశ్చయమును నాడే కర్ణుని మెడసెత్తురు ధరణి దొరగుటకు కారణమైనవి. కర్ణు నంతమొందించిన దర్జునుని పరాక్రమమే కాదు. అర్జునుడు జంకి "బ్రతికియుండిన సుఖములు బడయవచ్చు"నని వెనుకంజవేసినఘట్టమంతకు పూర్వమే జరిగినది. కాన ధర్మజునలుకయే మూలకారణమని కవి స్పష్టీకరించెను. నేన = నేను + అ = అనుదానిలోని 'అ' నిర్ధరణార్థకము. ఇది యాతని నిజస్వరూపమును సూచించుటకు వాడబడినది. తానై పల్కినచో దాని తత్త్వము ధర్మజు డెఱుగు ననునది విదితము. కాన "నేన చుమ్ము" అనెను. అర్జునుని బలమంతయు "ఆప్త బంధుజన నిర్మితపుణ్యవిపాక"మని కృష్ణుడు చెప్పుచు "ధర్మజు నొవ్వ బల్కుటన యీ దురవస్థకు వచ్చి తక్కటా!" అను పద్యమున తెల్పి ధర్మనింద యెంత నష్టదాయకమో యిందు వ్యక్తపరిచెను.

అర్జునుడు కన్నీటితో ధర్మజు పాదములకెరగి యుండగా ధర్మజు డాతని కౌగిలించుకొని "మనల నింత వరుచునే కర్ణుండనియు "నన్ను నాత డలవు మెఱయ గెలిచె" నతని నీవిప్డు సంపకయున్న నాకు బ్రతికి యుండదగునె" యనియు పురికొల్పెను. అప్పు డర్జునుడు ధర్మజుతో "నీ పాదములాన కర్ణు వధింతు"నని శపథము చేసెను. గోపాలదేవు నాలోకించి "నీ మనంబునం గర్ణుండు చెగటారవలయునని యుంచుక తలంపుము. దాననే నతని వధింతు"ననెను. దీనినిబట్టి కర్ణుడు కులము

వుగా వచ్చువాడు కాడని యర్జునుడు తలచి జంకుచున్నట్లు విదితమగును. అట్టిది కర్ణు పరాక్రమము. కావుననే ధర్మజు నలుకయు కృష్ణుని దృఢసంకల్పమును బాహాటముగా నిలువవలసి వచ్చినవి. ఇట్టి మహావీరుని సహాయముగా నుంచుకొని దుర్యోధనుడు పాండవుల నిర్జింప గలనని యనుకొనుటలో రాజకీయముగా దోషములేదు. తుదకు ధర్మజుడు "విజయ! నీకు విజయంబు శాశ్వతం బయ్యెడు"నని దీవింప నర్జును డుత్సాహించెను. కృష్ణార్జునులు పోరికలనికి పయనమైరి.

దారిలో కృష్ణు డర్జునుని పరాక్రమాతిశయము నుగ్గడించుచు వానికిగల దివ్యబాణసంపదను వర్ణించుచు భీష్మద్రోణాది వీరవధము చేసిన యాతనిబాహువీర్యమును కొనియాడెను. వీరులలో నెవరి నెట్లు చేయవలెనో బోధించెను. కర్ణుడు పాండవులకు చేసిన దుర్నయముల నేకరువు పెట్టి సభలో ద్రౌపదిని "లేరిచట మగలు నీకును, వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్ వారిజలోచన! నీపై కూరిమిగలవానిగని వెదకికొను మొగుననతో" యన్న మాట లేకరువు పెట్టి హృదయమునగల క్రోధాగ్నిని రగిల్చెను. వారి కష్టముల కన్నిటికిని మూలము కర్ణుడేయని స్పష్టీకరించెను. ఇదియంతయు కర్ణుని చంపవలసిన యావశ్యకతను సూచించుటకే. తుదకు నభిమన్యుని మోసమున జంపించినవా డితడేయనియు నట్టివానిని కాకులకు గ్రద్దలకు నెఱ చేసినగాని తృప్తిలేదనియు నర్జునుని హృదయమును మండించు వాక్కు లుపయోగించెను. అంతలో వారు రణస్థలిని సమీపించిరి. ఈ భాగము ప్రయాణఘట్టముగాన నిరుత్సాహజనకమును నిరుపయోగకరమును గా సామాన్యప్రేక్షకునకు కన్పించును. కాని కవి దీనిని మహత్తర ప్రయోజనకారిగా మార్చుకొనెను.

అర్జును డుత్సాహపూరితుడై యహంకారరహితుడై "నీతోడ్పాటున నే త్రిష్టపములం గెల్వంగనుంకింతు, నా చేతం గర్ణుడు రూపుమాలి చను, మెచ్చింతుగా నినుం జూడు మీ దైతేయాంతక!" యని తమ ఆత్మీయ సంబంధము చెప్పిన మాటలలో తన కర్తవ్య నిర్వహణసంకల్పము ప్రకటించెను. పైగీటుంచినపదములు "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అన్న భావమునకు పోషకములు.

కౌరవసేన యర్జునునిపై తలపడి "మందరము చేత మథితమై తిరుగుసాగరము సులివు గెలిచె"నని వర్ణితమైనది. ఈ యుపమానము "వీరవారనక కౌరవసేన మొత్తముగా కర్ణుతాకినదనియు, తాకి మొత్తముగా చలించి మథింపబడినదనియు చూపును. ఇదియే కృష్ణ ధర్మజు లర్జునునకు కూర్చిన యుత్సాహఫలము. అందరొకుమ్మడి కౌరవవీరులు దలపడగా నర్జునుడు వారిని గుంచి "వలగ్రచ్చికొని లీలనిసుచు బోఉవాలె"వర్తించెనట. భీముడు విజృంభించి శకునిని మూర్ఛితుని జేయగా కౌరవమూకలు వెరచరచి యవిసిన కలుముజనములు దీవి సేరినయట్లు కర్ణుంజేరి కాలుదన్ని నిలిచినవట. ఇవికూడ సుచితములైన యుపమానములే. వీనిని భావించిచూచినచో నప్పటిదృశ్యములు కన్నులకు గట్టును. ఈ యుపమానములు సామాన్య సాదృశ్యద్యోతకములుగాక సమగ్ర రణరంగదర్శకము లని తెలియనగును.

కర్ణుడు భీము నెదుర్కొని పాండవబలమును చికాకు పరచినవిధమును బోధించుటకై "పెక్కండ్ర తోడ గర్ణుం డొక్కడ పోరాడియెక్కు డుక్కున వారింజిక్కువశంజేయుట గడునక్కజమైయుండె" నను పల్కుల ద్విత్వకకారప్రాసయు ననుప్రాసయు విషయ స్పష్టీకరణమును, చికాకుపరచినవిధము స్ఫురింపజేయుటకును సహకరించును. అంతలో నర్జునుడేతెంచు రీతి యందలి యుదాత్తతను స్ఫురింపజేయు శైలి చూడుడు:

"కేతనకపి భయదంబై తోతేరగ చక్రరథచతుర సారథ్యద్యోతితవల్గన చారుశ్వేతహయములు మెఱయవచ్చు వీరుని గంటే" ఇవి శల్యుపల్కులు. అర్జునుని రాక యాతనికి హర్ష హేతువు. కర్ణునకు క్రోధకారణము. ఈ శైలి రెండిటికి ననువైనది. తరువాత, "నవ్వదుతలలును క్రొవ్వారు చేతుల బిరుదులువెట్టిన చరణములును," అను సీసము నందలి తీరైన శైలియు శబ్దవిన్యాసమును క్రీడి కౌరవబలము నెవ్వరడ్డమువచ్చిన నించుకయును దవుల బడక చేయు రణక్రీడను స్ఫురింపజేయునది. అంతలో పోరు ఘోరమై కొందరు ధార్తరాష్ట్రులు మడిసిరి. దుశ్శాసనుడు భీమునిపై తలపడెను.

ఈ ఘట్టమున భీముని మూర్తి యుగ్రసుందరమై హృదయంగమమై యొప్పినది. ఈ భాగమున తిక్కన కర్ణుని, భీముని ప్రత్యేకశ్రద్ధతోడను మమకారముతోడను చిత్రించెనేమో యనిపించును. ఇచ్చటి భీముని పల్కులు యుద్ధముకన్నను రుచిరములు. ఇందలి తెనుగునుడి కౌరము సంస్కృతము కన్నను సన్నివేశచాతు

తను కలిగించినదన్న దోషము లేదు. తిక్కన యుద్ధపర్వములు నిరుత్సాహజనకములు గాకుండుటకు యుద్ధ ఘట్టములలో పాత్రల యుద్దీపక సంభాషణలును, జీవచ్ఛల త్పాత్రచిత్రణమును, వర్ణనా వైవిధ్యము నే కారణములని మనము గ్రహించగలము. తిక్కన కళాచాతురి యీ భాగములను ప్రత్యేకతు ములట్లు చేసినది. చూడుడు:

'ఆ సభలోన గన్న ఋణమంతయు నీగగ గంటి వడ్డితో
బాస కొకింతయుం దొలగబారక తీర్చితి నిప్డు, నేడు నా
చేసిన పుణ్య మెవ్వరును జేయరు, నిన్నిటు నేర దెచ్చుటం
జేసి విధాత నాకు గృపసేయుట గానగ వచ్చె తమ్ముడా!'

కీచకవధ ఘట్టమున కొంచెముగా పొడసూపిన భీముని చమత్కార సంభాషణ మిందు పరిస్ఫురణము నందినది: క్రోధమున కాలంబనమైన యీ మూర్తియు, భయానక బీభత్సముల కాటపట్టయిన యీ ఘట్టమును, భీముని వ్యంగ్యోక్తి మూలమున మనోహరములైనవి. దుశ్శాసనుడును మొదట తీసిపోనివాని వలెనే కన్పట్టి వాక్చమత్కారమును యుద్ధ నైపుణ్యమును, జూపెను. ఈ భాగమున నిరువురి సమత్వమును జూపుటకు తగిన సమచ్ఛందమును తుల్యరచనాశిల్పమును తిక్కన యవలంబించెను.

భీముడు : కందము : భల్లములు మూట......

దుశ్శాసనుడు: కందము : తురగములదాన......

భీముడు — దుశ్శాసనుడు' ధనువొండు గ్రత......

యను నొక్క మత్తేభమున నే!.

ఒకే పద్యమున నిర్వుర క్రియాకలాపము వర్ణించుట వేరు పద్యము వ్రాయునంత తీరిక కూడ లేనంత వేవేగ యుద్ధము జరుగుటను సూచించును. వృకోదరుడు విరథుడై మెయి వెంచి,

గద కేలం గొని తేరుడిగ్గి మెఱుగుల్ గ్రమ్మంగ సారించి
యున్మదయానంబున గిట్టి ఘోటకములన్ మ్రందించి బాహాబలం
బుదలిర్పన్ భవదీయ సూను నరదంబుం బ్రద్దల్ద్రోవంగ
బెట్టిదపుందోసర మెత్తి కొంచతడు దాబెన్ నేలకు
న్ద్రొక్కనన్

ఇందు భీముడు మత్తేభమువలె క్రీడించి దుశ్శాసనుని దుస్థితికి తెచ్చుటయు, దుశ్శాసనునిశక్తి తక్కువగుచుంటయు సూచించుటకై భీమవిజృంభణము మూడు పాదములను దుశ్శాసను పూనిక్కి యొక్క పాదమునను చూపెను. తరువాత దుశ్శాసనపతనము వచనమున జరిగినది. పద్యము ప్రయత్నపూర్వకమైనది. వచనరచనకు యత్నము తక్కువ. అట్లే దుశ్శాసనుడంత త్వరలో పదునుకొనినంతలో భీముడు గదాదండము విసరివైవగా సులువుగా దుశ్శాసనుడు నెత్తురుదొరగ పడియెను. కర్ణార్జునుల ఘట్టము ముందుండగా దుశ్శాసన వధను పొడిగించుట తగదు. అయినను భీముడిం దద్వితీయుడుగా వర్ణింపబడెను. ఇందలి భీముని భీమమూర్తి కర్ణదుర్యోధనులకు నిర్విణ్ణతను నిశ్చేష్టతను కలిగించినది. ఆ దృశ్యమునందే భీమపాత్రచిత్రణము జరిగినది. అందుచే నీ సన్నివేశమంతయు భీమమయమై యొప్పినది.

ఎదుటిపక్షమునుండి భీమునకు ప్రతిసమాధానము లేదు. కౌరవానీకమా యాకస్మిక భయానక దృశ్యమునకు దిగ్భ్రాంతులైరని భావము.

మెడత్రొక్కిపట్టి దుశ్శాసనుతో భీముడు "నీమాటలు వినుటకు నాకినుక సాల వేడ్కపడియెదు," నను తెనుగునుడికారపు సొంపున భీముని క్రోధజ్వాలల తీవ్రత గమనింపదగు. ఇచ్చట మూలమున "తదాతు విక్రమ్య రణే వృకోదరో మహాగజం కేసరీ యథా వ్యబాధత" అన్న యుపమానమును తిక్కన "బెబ్బులి లేడికొదమం బొదువు పోలిక" ననుదానిగా మార్చి దుశ్శాసనుని యల్పత్వమును, భీమదుశ్శాసనుల తారతమ్యమును సుస్పష్టము చేసెను. తన యుపమానమునకు తగినరీతి నే వారిరువురి పాత్రల వర్తనమును చిత్రించెను. క్రిందపడిన దుశ్శాసనుపై భీమ విహారము చాలకాలము జరిగినది. దుశ్శాసనుడుగాని కౌరవవీరులుగాని ప్రతిఘటించి యాతనిడికేగాని నోరెత్తరే. ఈ స్థితియే బెబ్బులి లేడికొదమను బొదువునప్పటిది. భీముని మహోగ్రలోచన ప్రభలకు కౌరవానీక మతి భీతి గదిరి నలుగడవిచ్చినదట! అతడు చక్కని బయలమెరసెనట. ఇట్టిచోట సంజయుడు ధృతరాష్ట్రుని సంబోధించుచు తమబలముల దుస్థితిని తెల్పుట చాలయుక్తము. భీముడు చక్కని బయలమెరయూట యప్పటి దృశ్యము. దాని నూహించిన రణరంగమంతయు కన్నులకు గట్టును. కౌరవవీరులు "రణరంగమునుండిరా?" యన్నట్లు తోచును.

భీముని విశృంఖల విహారమును, క్రోధాతిశయమును, నాతని తీక్ష్ణతీక్ష్ణ వైవిధ్యమున మెరయు నాట్యోల్లాసమును, కవి కడు సుందరముగను ప్రత్యక్షముగ నట్లును చిత్రించెను.

'లీలం గేల నమర్చి మత్తగజకేళీసుందరోల్లాసమా
ఖీలత్వం బలరింప, త్రిప్పు చదలన్, పృథ్వీస్థలిన్
వైచు, ముం
గాలంద్రోచు మొగంబు వ్రేయు, దెస లుగ్రస్ఫూర్తి
వీక్షించు, మో కాలూదుం బయి, గ్రమ్మరంగ మెడ
చిక్కం ద్రొక్కి నిల్చున్, నగున్'

ఇందలి భీమమూర్తి యొకరికి సుందరోల్లాసముతోడను, మఱియొకరికి సాఖీలత్వముతోడను కన్పట్టుట ప్రశంసావహము. పై పద్యమున నెన్ని క్రియలు వరుసగా జరిగినవో చూడుడు. అన్నిటి కొసను "మెడ చిక్కం ద్రొక్కి నిల్చున్, నగున్." మెడపై త్రొక్కి నిల్చుట మొదటి స్థితి. మధ్య మార్పు చెందియు మరల నా స్థితికే చివరకు వచ్చుట కవి జాగరూకతను ప్రకటించును. తుదకు నగుట. పై కేళీ సుందరోల్లాసమునకు, సాఖీలత్వమునకు కారణ మిది. ఈ నవ్వు భీముని భీమసుందరమూర్తికి వ్యాఖ్యానము. ఇది ప్రత్యక్షముగ నాట్యరంగమున నటించు పాత్రను కన్నులకు కట్టు దృశ్యము.

"ఏ నురము వ్రచ్చి నెత్తురు తేనియ యిదె త్రావెదం,
గడిసినను గడిమిన్ మానుప దిక్కు
గలిగినన్ నిమ్మెలిగింపు మీ మొనంగలవారిన్."

మూలమున : "నిహన్మి దుశ్శాసన మద్య పాపం సంరక్ష్యతా మద్య సమస్తయోధాః" అని యన్న భీముని పల్కులను తిక్కన తెనుగు నుడికారమున "దిక్కు గలిగినన్ రానిమ్ము, ఎలిగింపు మీ మొనం గలవారిన్"గా జేసి మెరుగువెట్టినవాడు. ఇది తిక్కన యనువాద వైఖరి.

మూలమున :

ఉత్కృత్య వక్షః పతితస్య భూమా
వథా పిబచ్ఛోణి తమస్యకోష్ణమ్,
ఆస్వాద్యచాస్వా ద్య చ వీక్షమాణః
క్రుద్ధోహి వైనం నిజగాదవాక్యమ్.

స్తన్యస్య మాతు ర్మధు సర్పిషోర్వా
మాధ్వీక పానస్య చ సత్కృతస్య
దివ్యస్యవా తోయరసస్య పానాత్
పయోదధిభ్యాం మథితాచ్చ ముఖ్యాత్.

అని యుండగా తిక్కన మహాకవి—

నరసింహుం డసురేంద్రు వ్రచ్చు కరణి న్రౌద్ర
బుదగ్రంబుగా
నుర మత్యుగ్రత జీరి గ్రమ్మ రుధిర మ్ముల్లాసియై
దోయిట
స్వైరవారం గొని త్రావు, మెచ్చు జవికి, న్మేనున్
మొగంబున్ భయం
కర రేఖం బొరయంగ జల్లికొను నక్రూరవ్య
జూచుం బోరిన్.

ఇది ప్రతిజ్ఞాకరణ పూరణంబు నకట! లేకున్న జ్ఞాతివధ దోషమే కాక సోదర రక్తపానదోషము గూడ గల్గును.

తల్లి చనుబాలేను త్రావ నెట్టు
లాననే పలు తెరగుల తేనియలును
ఖండ శర్కరతోడి దుగ్ధంబు లనుభ
వింప బడవే యవియు నింత యింపు గావు.

"ఉత్కృత్య వక్షః పతి తస్య భూమా వథాపి బచ్ఛోణితమస్యకోష్ణమ్" అన్న వాక్యమున కుపమానమును గూర్చి పై పద్యమును వ్రాయుటయే గాక, క్రమ్మ రుధిరమ్ముల్లాసియై దోయిటన్ వెరవార త్రావినట్లును, చవికి మెచ్చినట్లును మేనున్ మొగంబున్ భయంకర రేఖం బొరయంగ జల్లికొనినట్లును వర్ణించెను. వీని నన్నిటిని మించినది "అక్రూరవ్య జూచుం బోరిన్" అనునది. ఎంత చేసియు భీమునకు కచ్చ తీరలేదని తాత్పర్యము. ఇదియంతయు క్రోధసస్ఫూరకము. ఇప్పుడాత డుగ్రసుందరమూర్తియై యొప్పెను. మూల వాక్యమున గూఢముగా నున్న "ఆస్వాద్యచాస్వాద్యచ" అన్న ద్విరుక్తిలోతును గ్రహించి తదుచిత మూర్తిని పై పద్యమున చక్కగా తిక్కన చిత్రించెను. "తల్లి చనుబాలు" అను పద్యమున నాతని రక్తపుటింపుదనమునకు మెచ్చి మరల నుత్సాహోగ్రుడై—

"అని యెలుగెత్తి పల్కు, నలినాడు, మహో
ద్ధతి ద్రుళ్లు, నార్చు, బె
ల్చన భుజమప్పళించు."

దీనితో నిరువాగులవారికి నతడు 'రక్కసుడా' యనిపించినదట. అంతట రణము చాలించిరట!

# తిక్కన కర్ణపర్వ నిర్వహణము

దుశ్శాసనుని మరల పొడిచి,

"ఏమిర! పసులని యార్చవు,
నీ మాటలు నిలువబడియె నే పసరమ! మి
మ్మేమి మగుడని దె యార్చెద,
మీమాటకు మారుపల్కు రెవ్వరు గంటే."

అనుచు వన్నె చిన్నెలుగా తన హృద్గతమై పదమూఁడేఁడులుగా జ్వలించు క్రోధాగ్నిని బహుముఖములుగా గ్రక్కుచు తుదకు-

"పైఁబడిపోయెఁ గాక ధృతరాష్ట్రసుతు కన్నది యేమి? ఆసభందావలదన్న కీడుడుగదా, పతిలేనబడ్డ కాంత నేడీవు కనుంగొనంగ పతియే డైరనొప్పె పకుల్ విజృంభిత శ్రీ విలసిల్లఁ గామినులు చేఁపడిరి ట్లపలిత్వ దీనతన్."

ఈ ఘటమున భీమ విజృంభణమునకు మొదటి పద్దెము "ఆ సభలోన గొన్న ఋణము," ను చివరి పద్దెము గూడ "ఆసభం దావల దన్ని," యుకొగా, రెండిటియందును "ఆ సభ" యుండుట గమనింపదగినది.

అద్యంతముల యానుపూర్వి యోగ్యముగా గలదు. దీనిభావ మేమనగా: దుశ్శాసనవధ కాలమునందంత టను రాజసూయావభృథమునందు వసుధామగ మంత్ర పవిత్ర వారి ధారావళిజేసి పావనములైన శిరోజములం దె మల్చిన పాపావహుఁ దుశ్శాసనుని దుష్కృతియు, దాని నుపేక్షించిన ధృతరాష్ట్రు దుర్నీతియు, దాని కెరయైన ద్రౌపది దుర్యోగమును, వీనితో నిండిన నాటి ఘోర సభయు, కన్నులయెదుట తాండవించినవని, యా శ్లో కములందలి "ఆ సభ"యను శబ్దము చే మనకు ద్యోతమాన మగును. ఇంత వ్యంగ్యవైభవము విలసిల్ల వ్రాయుట మహాకవులకే సాధ్యము.

భీముడు రెండవ ప్రతిజ్ఞ నెరవేర్చుట కుత్సహించెను. సూతనందనుండు భీతుండై వదనంబు వెలవెల బార నూరకుండెను. ఇది కర్ణుని దౌర్బల్య ప్రారంభ సూచకము. శల్యునకు సమయము దొరికినది. కర్ణుని పురిగొల్పసాగెను.

కర్ణుని కుమారుడు వృషసేనుడు ముందుకు దుమికెను. అదియే యదవని "కెలకుల యోధులం గడిచి క్రీడి వడిన్" వృషసేనుమీద తలపడెను. వృషసేనుని విజృంభణము జూచి అర్జునుడు భ్రుకుటి స్ఫూర్జిత ఫాలభాగుడగుచుం బొంగారెను. ఎందులకు? అభిమన్యు నన్యాయముగా కర్ణాదులు చంపిన కినుక భ్రుకుటిరూపమైనదని సూచన. ఒక్కదెబ్బకొ పసికూనను బాణకళాదుర్దముడైన అర్జునుడు "పతియుణ్ రాధేయుఁడుం జూడగన్" ద్రుంచెనట. ఈ భాగమా పద్దెమునకు చివర భాగమున గలదు. ఇది యీ వధకు పర్యవసానము. అర్జునుని కుమారు నాతని పరోక్షమున చంపిన వారు వారిద్దరును. వారి సమక్షముననే కర్ణకుమారుని చంపి వారికి వారి దుష్కృత్యఫలము రుచిచూపుటయు, తన నిజస్వరూపము నెరుకపరచుటయు నర్జుననికోర్కె. అందుచే నది కోసకు వచ్చినది. తన కండ్ల యెదుట తన కుమారుని వధ జరుగుట కర్ణుని తోక త్రొక్కిన భుజంగమును జేసినది. ఇంక దీని పర్యవసానము మాదిని డే యూహింపగలడా! కాని గుండెజారి ప్రీలిపోవుట యారంభమైన ఘట్టమిది.

నమ్మి, తన మంచిచెడ్డ లన్నియు కర్ణునిపై నుంచిన రాజరాజగు దుర్యోధనుని తమ్ముని యొరుకటను, కర్ణు నెదుటను, చిత్రవధ చేయుచుండగా నేమియు చేయజాలక నిస్సహాయుడైన కర్ణునికి రోగు చుట్టుమీద రోకటిపోటన్నట్లుగా నాత్మజు ఘోరవధ గూడ చూచు దుస్థితి కలిగినది. క్రోధజ్వాలలు భగ్గని దరికొన్నను గుండె, వీలి నరములు దౌర్బల్యమునంగుట మొదలిడినట్టెటు పైన జూడగలము. కాన కర్ణార్జునుల పోరు ఘోరరూపము దాల్చినది. కర్ణదుర్యోధనుల కచ్చ తీవ్రతనందినది. ఇది యే అసలైన యుద్ధఘట్టము. ఇచ్చట సన్నివేశము పరాకోటినందె. భీష్మద్రోణులు పాండవ పక్షపాతులు. వారియెడ పాండుకుమారులకు భక్తివినయములు గలవు. కాని కర్ణార్జునులు, భీమదుశ్శాసనులు నాజన్మవిరోధులు. కాన నీ భాగమున కున్న ప్రాముఖ్యము, ఇందలి పోరునగల రుచి మరి యొక చోట నుండుటకు వీలులేదు. అందు చేతనే యీ భాగము యుద్ధపంచకమునకు మకుటాయమానమైనదని యనిపించగలదు.

కర్ణార్జును లిరువురును సమాన శక్తియుక్తులు గల మహామహులే. కావున నింద్రుడు తన కుమారునకు జయము కలుగునట్లు సంకల్పింపవలసినదిగా బ్రహ్మను కోరగా నాతడర్జునుడే జయించునని చెప్పెను. వీరిరువురి యుద్ధము విశిష్టము కావుననే మిగిలిన వారెల్లరును రణముమాని ఖేచరులతో సహా వారి పోరును జూడ నుత్సహించిరి.

ముందుభయకేతనములందలి కపిహస్తులు కయ్య మారంభించినవి. తరువాత సారథులైన కృష్ణశల్యులు దృక్కలహము సాగించిరి. మొత్తమున నర్జున పక్షమునకు బలమును కర్ణున కోటమియు సూచితములైనవి. అప్పుడు కర్ణుడు శల్యుని జూచి యొకవేళ నర్జునుడు తనను జయించిన నెట్లని అహంభావ పూరితుడును, నాత్మవిశ్వాస పరిపూర్ణుడును నైన కర్ణనడిగెను. ఈ హృదయ దౌర్బల్యమే యాతని యోటమికి బీజము.... శల్యుడు తానట్టి స్థితిలో వాని నిర్జించుట తప్పదనెను.

అట్లే అర్జునుడు కృష్ణునడిగెను. కృష్ణుడు "ఇనుడు కూలినను, ధరిత్రి పరియలైన, మేరు వొరిగిన కర్ణుచే నీవు గోలుపోవుటెల కలుగు" ననెను. మాటుడు కృష్ణ శల్యుల సమాధానములందలి భేదము.

అర్జును నోటమి యసంభవమని సూచన. కృష్ణుని యుత్సాహ జనక వాక్యమును, శల్యుని నిరుత్సాహ జనకవాక్యమును నాయా వీరులకు జయాపజయ కారకములు. అర్జునుని ధైర్యస్థైర్యములను జూచుటకై కృష్ణుడు మరల "అట్టి స్థితి కలిగినచో తాను కర్ణ శల్యుల రూపుమాపగలిగి"నట్లు ప్రకటించెను. వెంటనే అర్జునుడు "నవ్వులకంటెగాక యని నాకు నశక్యమె?" అని చమత్కారకముగా తనమాట నేర్పును జూపి త్రిప్పివేసెను. ఆత్మగౌరవ విశ్వాసములుగల శక్తిమంతులు లోకమున నిట్లే యాత్మావమాన సూచక ఘట్టములతో మాట నేర్పును చూపుదురు. ఇది తిక్కన లోకజ్ఞత. నిజమునకు గూడ నిప్పుడు కర్ణు దౌర్బల్యము గోచరించి యర్జునునకు తన జయము నిశ్చయమయ్యెనని కూడ చెప్పవచ్చును.

ఇట్టి దుస్థితిలో నశ్వత్థామ దుర్యోధనునితో సంధిచేసుకొనుట లగ్గనగా నాతడు మొదటినుండి యెట్లుండెనో యట్లే మార్పులేని తనమును ప్రకటించుచు, నింకను పూర్తియైన దురాశతోడను, పట్టుదలతోడను, కచ్చతోడను "ఇష్ట దుస్ససేను పనిదీర్చి మారుతతనూభవు డాడినమాట యొగ్గడన్వినియును సంధిసేయుట కభిలాషయా? పెనకువ కర్ణుడేలుడుగు?" ననియు, "శ్రాంతిం బొందినవాడు పార్థుడ పరిశ్రాంతుండు కర్ణుండు దుర్దాంతోదగ్రత గీటడచు" ననియు తన దురాశను ప్రకటించుచు, తదనుగుణమైన చక్కని సమాధాన మిచ్చుటచే దుర్యోధన పాత్రశీలమునకు, సముచితపోషణము జరిగినది. కథాఘట్టమున కొక మెరుగు పెట్టబడినది.

ఇక కర్ణార్జునులు తలపడుటయు యుద్ధక్రమమును నెంత జాగరూకతతోడను, శిల్ప వైశిష్ట్యముతోడను, తిక్కన రచించెనో తిలకించుదము.

'కరి కరి, గిరి గిరి, నంభో
ధర మంభోధరము, బెలుచ దాకిన క్రియ, దా
కిరి కడగి, గగన తటియును
ధరణియుఁ గ్రేరాయుచు వడంక, ధరణీనాథా!'

ఇందలి యనుప్రాసయు, లఘువులతో ప్రారంభించి గురుత్వము నందుటయు క్షణ క్షణ తీవ్రతావాప్తిని సూచించును.

చూపఱనత్తొలుతొరు వెరగు పడజేసినదట. కర్ణార్జునులకు వారి వారి పక్షము లిచ్చు నుత్సాహపు వాక్యములు సమాన వృత్తములలో చేయింపబడినవి. వారి సమత్వమునకు తగిన శైలిని, ఛందస్సును, వర్ణన శిల్పమును కవికూడ తన రచనలో పాటించి స్ఫురింపజేసెను. చూడుడు :

అర్జు:-శా. ఆయుగ్రాహవకేళి......జెట్టెసె
కర్ణు:-ఉ. అంతక కోపవహ్ని......

ఇరువురికిని వృత్తమే వాడబడినది. యుద్ధ తీవ్రతను వేగమును సూచించుట కిరువురు నొకే పద్యమున వర్ణింపబడుట గమనింపదగినది.

అర్జు:-ఆ. వె. ఫల్గునుండు మేఘబాణమేసిన...
సూత సూను డనిలాస్త్ర మేయుడు

అర్జునుడు చాల పూనికతో నైంద్రాస్త్రము ప్రయోగింపగా సూత సూతి త్రుటిలో దాని నాపి పార్థుమేన శితశరములను బరగించెను.

అప్పుడు భీముడు కనలి అర్జునుని దౌర్బల్యమును కర్ణు విజృంభణమును నిరసించి అర్జునునికి ధైర్యోత్సాహములు కూర్చును. కృష్ణు డర్జునుని హేళనచేసి చక్రమిత్తు ననెను. ఇట్టి పలుకులే యీ యుద్ధ వర్ణనము లందు గల్గు విసుగుదలను తొలగించి యుద్రేకోత్సాహములను రేకెత్తింపగలవి. ఇట్లు సమబలులై రణ నిర్వహణము చేయుచుండగా కర్ణు డర్జునుని కిరీటము పడగొట్టెను. అప్పుడు-

"శృంగము లేని నీలగిరి చెల్వున క్రీడి కిరీటహీను డయ్యెంగను పట్టె" – నట!

ఈ పద్యమున ప్రాసస్థానమున చేసిన విరుపు లెంతయు మనోహరములు. ఈ మనోహరత యర్జునుని

గెల్పునకు స్ఫోరకము. ఆనాగాస్త్రమున కర్ణుని బాహుబలి కౌశలంబుచే కలిగిన యుత్సాహానందములే యీ విరుపులతో కూడిన మనోహర రచనకు మూలములు.

ఇట్లే కర్ణుడు నర్జునుని బాణజాలముచే మేఘములు గప్పిన భూధరము పోల్కి వహించెనట.

అమ్మేయి నుగ్రుడై మఱియు నర్జును డుజ్జ్వగ
ళత్స్యదంత కోల
దమ్ములు పెక్కు సత్వర దృఢస్ఫురణం బలరంగ
నేసి, ర
థ్యమ్ముల సూతు గేతనము నాతని తేరునుగూడ
గప్పె మే
ఘమ్ములు గ్రమ్మి భూధరము గప్పిన భంగి దలంప
బట్టుగన్.

ఇచ్చటి యుద్ధమునందలి హృదయంగమత్వమును సూచించుటకు దీని ప్రాసస్థానమున విరుపులును, ద్విత్వమకార ప్రాసమును వాడబడినవి గమనింపుడు. అప్పుడు కర్ణు డరుణోజ్జ్వల మండలకాంతి పూరముగ్ మెత్తపు దీప్తులుందగ నినుండ పరాద్రి వెలుంగు చాడ్పున నొప్పెనట. ఈ యుపమానము కర్ణ నస్తమయమును సూచించును. నిత్యోదయాస్తమయ కార్యక్రమశీలుడైన సూర్యునికి కుమారుడౌటచే కర్ణు నంతిమకాలము నస్తమయముగనే వర్ణించుట కడు నుచితమైనది.

రథచక్రము క్రుంగినది. అట్టి దుస్థితిలో యుద్ధము చేయుట యర్జునుని పక్షమున నధర్మమని కర్ణుడనెను. కాని కృష్ణుడు కర్ణుని యాధ్వర్యమున దుర్యోధనుడు పాండవుల కొనరించిన యొగ్గులన్నియు నేకరువుపెట్టి తుద కభిమన్యు వధను పేర్కొనెను. దానితో "తోడ్తోడం బెరిగిన యర్జునంజయు మనంబు రోషానలంబు రోమకూపంబుల జ్వాలారూపంబున వెడలిన"దట. అప్పు డాజ్యధారాచ్ఛటా సేకంబున నుద్రేకంబు నొందిన హుతవహుండునుబోలె మండి యుద్ధము నర్జునుడు సాగించెనట. తుదకు మురారాతి, రుద్రుల చక్రంబును శూలముం బెగడు క్రూరపు భల్లమున కర్ణుశిరము ద్రుంచెనట. శివకేశవ శక్తు లొక్కటియై (హరిహరనాథ) గాని కర్ణుని ద్రుంపలేవయ్యెను !

తిక్కన భారతమున పాత్ర చిత్రణములోను, సన్నివేశ వర్ణనములలోను తన కభిమతమున్న వానితో నైక్యము చెంది ప్రత్యేకత నాయాపట్టుల చూపునని సూక్ష్మముగా పరిశీలించినచో మనకు తెలియును. కర్ణార్జునులలో కర్ణునెనిన తిక్కన కభిమత మెక్కువ. భీమ దుశ్శాసనులలో భీముడన్న మక్కువ యెక్కువ. ఈ విషయ మీ భాగమున స్పష్టముగా కన్పట్టును.

అస్తం గచ్ఛన్ యథా దిత్యః,
ప్రభా మాదాయ గచ్ఛతి
తథా జీవిత మాదాయ
కర్ణ స్యేషు ర్జగామ సః.

ఇది మూలమునందలిది. దీనిని తిక్కన కథ కనుగుణముగను తన దృక్పథమున కనుకూలముగను మార్చి సూర్యునికిని కర్ణునకునుగల జన్యజనకభావమును పురస్కరించుకొని ప్రకృతమునకు మెరుగులుపెట్టి యీ ఘట్టమును జాలిగొల్పుదానిగా జేసెను. తిక్కన సూర్యాస్తమయమును కథకు ముఖ్యాంగముగా వర్ణించెను. ఇది యౌచితీ నిర్వహణ దక్షత.

'నిడుగేలన్ బలుతొడలు వెడద యురము సైర
భావనిం గర్ణు నొడల్,
పడియున్న గని విసాదం, బడరి తొలగుచూడ్కి గ్రుంకె
నర్కుం డంతన్.

నిర్గతప్రాణు రాధేయు నిజకరముల
గరుణ బెంపున నిమిరిన కారణముగ
పావనస్నాన మొనరింప బోవునట్లు
లవరజలనిధి లోనికి నరిగె నినుడు."

ఇందలి భావకల్పన కడు నుచితమై పాఠక హృదయమున కరుణరసము నుబికింపజేయును. జగచ్చక్షువు కర్ణునకు క్రుంగు నొక పాత్రగా భారత పాత్రలలో లీన మొందింపబడినాడు. కర్ణునంతటి యాత్మజుడు ఘోరమరణమొందుట జూచి సూర్యునట్టి తండ్రి ప్రతిదినమునవలెనే యస్తమించునా? విసాదము నందుటయు. జనకత్వసూచకముగా వర్ణించుటయు వలదా? అందులకే కవి సూర్యుని లోకము తండ్రు లట్లుగా సహజ పాత్రగ చిత్రించి పావనస్నానాదికము జేయింపించెను,

ఈ యుద్ధభాగము లోకమున నెందును లేనిదని తిక్కన శల్యుముఖమున చెప్పించెను.

"నరవర! యెందుజూడమె రణంబులు, కర్ణుడు నర్జు
నుండు నం
గర మొనరింతురే యటులు, క్రౌర్యనిరూఢికి దివ్య
లాంది ర
చ్చొరు వది యట్టులుండె, విను! చెప్పెద, నెంతయు
భీతి పొందిరా
హరియు నరుండు కర్ణువడి, కంత విధాతృడుమెత్తె
వానికిన్.

బ్రహ్మ యింద్రుని కనుగొలముగా నాతని కోర్కె ననుసరించి కర్ణునర్జునుడు నిర్జించునని పల్కిన పల్కులలోనే విధాత్రుడు తప్పుట వ్యక్తమైనది. ఆ పల్కులిక్కడ పర్యవసించినవి. "విధాత్రుడు తప్పె వానికిన్" అని తిక్కన జాగరూకతతో వాడి తన పూర్వాపరసమన్వయ దక్షతను ప్రకటించుకొనెను. ఈ శక్తి భారతమునందెల్లెడలను కన్పించును. నరనారాయణులైన అర్జున వాసుదేవులు కర్ణునిజూచి బెగడొందిరని మొదటనే తెల్పితిని. ఆ బెగకు కర్ణవధ మనుపరమును కలదు. కర్ణవధయందున కర్జునుని పరాక్రమము నిమిత్తమాత్రమేయని మొదట వ్రాసియుంటిని. కర్ణ పరాక్రమ మెంత దుర్నిరీక్ష్యమో శల్యుడుకూడ నిండు స్పష్టపరిచినాడు. ఈ పర్వము నందంతటను నీ భావమే పొందుపరుపబడినది కాని యది యిచ్చటనే ప్రకటితమైనది. ఇట్టి యానుపూర్వియు, దక్షతయుగల కథాకథనము సమర్థుడైన కవితల్లజునకే సాధ్యము. ఇట్లు తూచి శబ్దములను అర్థపరిపుష్టములుగా వాడుట సుసాధ్యము కాదు.

కృష్ణార్జునులు ధర్మజుని కలిసినప్పుడు కృష్ణుడు "భువనము లన్నియును నొక్కట గలిసియు కర్ణు బరిమార్పగా నోపునె భూధవ! భవదీయ క్రోధాగ్ని విహతుడై క్రాగెగాక నిక్కంబరయన్." అనెను. పూర్వము పరాభూతుడైన ధర్మజు నోదార్చుచు కృష్ణుడన్న "నీ వాతనికి నలిగినప్పుడమా మడిసె"నన్న వాక్కులతో ప్రారంభించిన కర్ణవధను మరల నా పలుకులతోడనే ముగించెను.

కర్ణవధ ప్రాముఖ్యమును జూపుచు, "రధికవరుడైన రాధేయు బొలిసినపుడ యెల్లబొలిసె కౌరవుల కడంగె వైరము - నీకింక నెగురులేద" అని కృష్ణుడు ధర్మజునితో ననెను. ధర్మజుడును కర్ణవధవిని "సకల ధరణి సామ్రాజ్యమునకు నేడేను భర్తనైతి"ననెను. అసలు రాజైన దుర్యోధనుడు బ్రతికియుండగా వాని సహోదరుడైన కర్ణుడు మడిసినంతనే తనకు సామ్రాజ్యమబ్బెననుట యెట్లు సమంజసము?

మూలమునగూడ :

"అద్య రాజాస్మి గోవింద! పృథివ్యాం భ్రాతృభిస్సహ"

ఇదియే కర్ణుతలభారతమును లోకవాక్యమునకు మూలము. వ్యాసుడు కర్ణున కిచ్చిన ప్రాముఖ్యమును తిక్కన సరిగా, గుర్తించియే యీ ఘట్టమును వ్రాసెను. ఈ ఘట్టమునకుగల వైశిష్ట్యమును జూడుడు :

మూలము :

"ఇదం మహాయుద్ధమఖం మహాత్మనోర్ధనంజయస్యాధిరథేశ్చ యః పఠేత్
స సమ్యగిష్టస్య మఖస్య యత్ఫలం తదాప్నుయాత్సం శ్రవణాచ్చ భారత!
మఖోహి విష్ణుర్భగవాన్ సనాతనో వదంతి తచ్చాగ్న్యనిలేందు భానవః
అతోనసూయః శృణుయాత్పఠేచ్చ యః స సర్వలోకానుచరస్సుఖీభవేత్.

తిక్కన భారతము :

'అనలుడు భాస్కరుండును సుధాంశుడు నధ్వరసంప్రవర్తకుల్
వినుము నరేంద్ర! యీ క్రతువు విష్ణుమయంబిది నిర్వహించి ర
ర్జునుడును కర్ణుడున్ సమరరూపమునందగ నీప్రబంధమిం
పొనరబఠించినన్ వినిన నొందుదురుం జిరసౌఖ్య సంపదల్.'

ఈ ఘట్టమొక మహాక్రతువట. దీనికి అనలుడును భాస్కరుడును సుధాంశుడును ప్రవర్తకులట. ఈ యజ్ఞము విష్ణుమయమట. నిర్వాహకులు కర్ణార్జునులట.

ఇందలి అనల భాస్కర సుధాంశులు తేజోమూర్తులు. కాలస్వరూపులు. కాలవిధాతలు. దుష్టశిక్షణ శిష్టరక్షణాత్మకమై ధర్మగ్లాని నంతమొందించు కృష్ణావతారము ఆశ్వాసాంతమున "జగత్త్రయీ విధాయక, పరిరక్షక, ప్రతిసమాహృతికారక!" అన్న త్రిమూర్త్యాత్మకము. నన్నయ "శ్రీవాణీ గిరిజా శ్చిరాయ దధతః" అన్న మూర్తిత్రయము భారతమున కాయువుపట్టయిన యీ ఘట్టమునందు తిక్కన యన్నదే. కావునే కవిత్రయము మూర్తిత్రయమువంటి వారనిన సత్యదూరము కాదు.

"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"
—భగవద్గీత.

అన్న పరమాత్ముడు సారథియై తన వాక్యము నుద్ధరించుకొనిన ఘట్టమిది. దైవాంశ సంభూతుడును, అహంకారమూర్తియునైన వాడు కర్ణుడు. వాని వధ

సామాన్యముగ జరుగునా! ధర్మజునలుక దానికి కారణమైనది. దానికి భగవానుడు కృష్ణుని సంకల్ప యత్నములు దోహదము చేసినవి. ధర్మజు నవమానమే ధర్మగ్లాని. కాన విష్ణుమయమైన యీ యజ్ఞము రణరూపమునంది యర్జునునిచే నిర్వహింపబడినది. కర్మసాక్షి కాత్మజుడైన కర్ణుడే యజ్ఞమున నశ్వరాగ్ని. మూలమునగల "యజ్ఞావసానే గ్నిమివ ప్రశాంతమ్-కర్ణమ్" అన్న యుపమానము దీనికి పోషకము. దుర్యోధనాదులు పశువులు. అర్జునుడు హోత. కృష్ణుడధ్వర్యుడు. ధర్మజుడు సోమయాజి. కర్ణవధతో రణయజ్ఞము పరిసమాప్తినందినట్లే అందుచేతనే కర్ణవధతో ధర్మజుడు సామ్రాట్టయ్యెనని వ్రాయబడినది.

అశ్వాసాంతమున తిక్కన వ్రాసిన

"ప్రకట మహార్థ సౌరభ పరాశరనందనవాక్య మంజరీ
ప్రకర సమర్చితా! పరమపావననామ! జగత్త్రియీ విధా
యక, పరిరక్షక, ప్రతిసమాహృతికారక! చిత్తవృత్తి భా
వక! భవబంధమోచన <u>దివాకర, చంద్ర, కృశానులోచనా!</u>"

యను పద్యమును తిలకింపుడు. ఇందు గీటుంచిన భాగము రుద్రుని తెలుపును. ఇందలి దివాకరచంద్ర కృశానురూపములైన లోచనములే పై పద్యమునందలి "అనలుడు, భాస్కరుండును, సుధాంశుడు" నైనవి. వీరు ముర్వురు నశ్వర సంప్రవర్తకులనగా రుద్రుడే యని భావము. కాలరూపములును, కాలవిధాయకములును, సృష్టిస్థితిలయ కారకములును, యజ్ఞవిధాయకములును నైన తన నేత్రత్రయముచే పై రణయజ్ఞమున కాది మధ్యాంతములు కలిగించెనను భావము నిగూఢముగా నిందు కూర్పబడినది. ఇది మహాధ్వరము. తిక్కనయు, వ్యాసభగవానుడును తెల్పిరిగదా. దీని పరిసమాప్తికి నర్జునుడు ప్రయోగించిన భల్లము కేశవరుద్రుల చక్ర శూలముల రూపమైనదని తిక్కన వ్రాసెనుగదా!

అందుచేతనే యీ రణయజ్ఞము విష్ణుమయమై రుద్రుని లోచనములైన యనల భాస్కర సుధాంశులచే ప్రవర్తింప జేయబడినది. భగవానుని హరిహరరూప మెంత చక్కగా రూపొందింపబడినదో చూడుడు.

మఱియొక విశేషము. ఇది మహాప్రబంధమట. దీనిని జదివినను వినినను చిరసౌఖ్య సంపదలు కలుగునట. ఈ భాగ మొక్కదానికేనా యీ ఫలశ్రుతి! కర్ణపర్వమున కెంతటి యౌదాత్యము!

ప్రకట మహార్థ సౌరభ పరాశరనందన వాక్య మంజరీ ప్రకర సమర్చితుడైనట్లుగా తన కృతిభర్తయైన హరిహరనాథుని తిక్కన సంబోధించెను. వ్యాసుని కవితామహత్త్వమును తిక్కన ఇనుమిక్కిలిగా కొనియాడినదీ ఘట్టముననే. మూలభారతమున సాక్షాత్పరమాత్ముడైన వ్యాసభగవానుడు గుప్తపరిచిన మహార్థముల గుబాళించు వాక్యమంజరులను సేవించి, యుపాసించి, తన కృతిభర్తకు తాను గూడ వాని వాసనల నన్నిటిని చేర్చి కూర్చిన హారముతోడనే సమభ్యర్చన జరిపినట్లు పై వాక్యము ద్యోతింపజేయును. భారతమునకు గుండెయైన భగవద్గీతయందలి పరమార్థమైన దుష్టశిక్షణ శిష్టరక్షణలును, ధర్మోద్ధరణమును, వైదిక కర్మప్రవర్తకతయు, జ్ఞానోపదేశమును, హరిహరాభేదమును నిందు మహార్థముగా భాసింపజేయబడినవి. ధర్మన్యక్కారము పతనహేతువనియు, "ధర్మమేవ జయతి" యని నిరూపింపబడినది.

ఇందలి పూర్వాపరసమన్వయ కౌశలమును, పాత్రపోషణ దక్షతయు, సంభాషణ చాతురియు, ప్రత్యక్ష సన్నివేశ నిర్వహణ కథాకథన నైపుణ్యమును, మహార్థగుంభనమును, నానారసాభ్యుదయోల్లాసితయు, వ్యంగ్యవైభవమును సముచిత పదవాక్యప్రమాణజ్ఞతయు నీ భాగమునకు ప్రబంధతను సమకూర్చి తరువాతి ప్రబంధయుగమునకు దివ్వెపట్టినవి.

తిక్కన శిల్పఖని. మహాకవి.

# ఫలశ్రుతి

శ్రీ శనగన నరసింహస్వామి

ప్రతినిమేషము పంకిల భావభంగ
తుంగ హృదయ సముద్రముప్పొంగు క్రుంగు
వేదనా బడబానలోద్వేల జృంభ
ణములు భరియించి హాస ఫేనములు గ్రక్క

క్రోధ మదలోభ మత్సర కూర్మ నక్ర
మకర పాఠీన సంచార మలిన మగును
వక్రజాతక ఝంఝా ప్రభంజన జవ
లబ్ధ నిమ్నగావర్త సంక్షుబ్ధ మగును

మహిత ముహురను పతదద్రి మథ్యమాన
మానసక్షీరసాగరమధ్యసీమ
నమృతకలశోద్భవాపేక్షణములు పఱప
బాహిరమ్మయ్యె భయదహాలాహలమ్ము

కాలకూట వైశ్వానర జ్వాలలందు
తప్తమయ్యెను స్వాంత రత్నాకరమ్ము
తడవిచూడగ లేవు ముత్యములు మణులు
పగడములు—నత్తలాలిచిప్పలు వినాగ

అంత లయ రుద్రమూర్తినై—అంతరుత్థ
గరళము పెకల్చి కబళించి కంఠపార్శ్వ
పదవి భూషణ మొనరించి పావనాశ్రు
జాహ్నవీ తోయధారలు చల్లినాను.

# దీపకరాగం

శ్రీ కె. వి. యస్. అచ్యుతవల్లి

"సీతా!" అన్న పిలుపుతో వెనక్కి తిరిగిచూసింది. తెల్లగా పొడుగ్గా దృఢంగా వున్న యువకుడు నవ్వుతూ ముఖంలోకి చూశాడు. ఒక క్షణంలో సీత నిర్ఘాంతపోయింది. విశాలమైన నుదురుమీద పడుతున్న వుంగరాల జుట్టూ, "టెరిలిన్ బుష్‌షర్టు," "గాబర్డీన్ పాంటు," "హవాయ్ చెప్పులూ" "ఐలాష్ వేసుకున్నట్టున్న నల్లని కళ్ళూ" అతని "అరిస్టోక్రసీ"ని చాటుతున్నయ్. సీత బెదిరిపోయింది. ఎవ రితను? తన పేరుపెట్టి పిలుస్తున్నాడు? పేరు ఎలా తెలిసింది? కంగారుపడుతూ రెండడుగులు వెనక్కి వేసింది! అతను వుత్త మొండిమనిషిలా బిహేవ్ చేస్తూ.

"కంగారుపడుతున్నావని తెలుసు సీతా. అయినా ఇన్నాళ్ళకు దొరికిన జీవిత పెన్నిధిని పోగొట్టుకోలేను." అంటూ దగ్గరగా వచ్చి రెండు చేతులూ పట్టుకుని లాగుతూ ఇసకలో చతికిలబడ్డాడు. సీత చేసేదిలేక కూలబడింది. ఆమె మనస్సు అనంతమైన వేదనతో నిండింది. ఇవ్వాళ శనివారం. తప్పకుండా ప్రొద్దుట దుర్ముహూర్తంలో లేచివుంటుంది. హోప్ లెస్ కదా! అని సాయంత్రం ఉప్పుడుపిండి చేసుకుని మూత పెట్టుని కాఫీగిన్నె బొగ్గులార్పేసిన కుంపటిమీద వుంచి కొన్నేపు షికారుగా వుంటుంది కదా అని బీచివైపు వచ్చింది. వీ డెవడో! ఖర్మానికి లేచిన వేళావిశేషం కాకపోతే ఇలాంటివాళ్ళకి తనే తటస్థపడాలా? ఇతను చూస్తే గొప్పవాడల్లే కనపడుతున్నాడు. తనలో ఏ అందం చూసి వెంటపడుతున్నాడు? నాన్న వచ్చేటప్పుడు అన్న మాటలు జ్ఞాపకం వచ్చాయి సీతకి!

"పట్నంలో జాగ్రత్తమ్మా సీతా! ఎవ్వరితోనూ అట్టే స్నేహాలు చేయకు. కొల్లీగ్సుతో కూడా అధికంగా మాట్లాడకు! బాస్‌తో అవసరానికి మించి మాట్లాడితే తెల్లవారేసరికి మీ పేర్లు గోడలమీద వుంటాయి. ఎల్లా నెగ్గుకొస్తావో! ఏంచేయను? నా పరిస్థితులవల్ల నీచేత వుద్యోగం చేయిస్తూ వూరుకాని వూరుకి పంపాల్సొస్తోంది. ఒక అయ్య చేతిలో పెట్టలేకపోతున్నాను. ఈ ముసలితండ్రినుంచి నీవు కష్టాలు పడుతున్నావు. సీతా! మన పరిస్థితులు నీకు తెలుసు. నామీద కోపం వుంచుకోకు తల్లీ!" సీతకళ్ళు తడి అయ్యాయ్. సముద్రపుగాలికి ముఖం మీదకి పడుతున్న ముంగురులను రెండు అరచేతులతోనూ పైకి త్రోసుకుంటూ ధైర్యంచేసి తనకే తెలీని భావంకోసం అతని వంకచూసింది. నీళ్ళతో నిండిన ఆమె కళ్ళు అప్పుడే వుదయిస్తూన్న చంద్రుని కిరణాలలో తళతళా మెరుస్తుండగా దిగ్భ్రాంతితో చూస్తున్న ఆ యువకుడు....

"ఎంత మారిపోయావు సీతా? కళ్ళల్లో ఇన్ని అందాలు సంతరించుకోగలవని నేను వూహించుకోలేకపోయాను. నీ మెత్తటి జుట్టునీ, నీ కుడిచెంపమీది పుట్టుమచ్చనీ, నేనాలోచించని ఘడియ లేదంటే నువ్వు నమ్ముతావా? నే ననుకున్న దానికంటె మిన్నగా తయారయ్యావు. అందులో సగంచాలు, నా బ్రతుకు తీయని పాటగా సాగిపోవటానికి." ఏదో కవిత్వం మొదలెట్టాడు. సీతకు పూర్తిగా మతిపోయింది. ఈ రోజుల్లో గొప్పింటి మగపిల్లలు "డోసు"లు తగిలించి ఆడపిల్లల వెంటబడటం ఆమెకు తెలుసును. అదే ప్రజ్ఞగా భావిస్తున్న ధనికయువకులు అంటే ఆమెకు చిరాకు. ఇతనుకూడా ఆబాపతు మనిషేమో అనుకున్నది. ఇతను వ్యూహాగానంలో వుండగానే తప్పించుకుపోదామని గమ్మున లేవబోయింది. ఆ యువకుడు కని పెట్టాడు:

"సీతా? నేను వెర్రివాణ్ణనుకుంటున్నావా? చిరకాలంనించీ నా మనస్సులో ముద్ర వేసుకున్న దానివి కన్పించావన్న సంతోషంతో నా శరీరము అవశమైపోగా ఏవేవో అంటున్నాను. క్షమించు. నేను ఎవర్నో జ్ఞాపకం రాలేదా? అంతత్వరగా ఎల్లా మర్చిపోగలిగావ్ నన్ను?" రెండు జబ్బలూ పట్టుకుని కూర్చోపెట్టాడు. చంద్రుడు ఏం జరుగుతుందోనన్న ఆత్రతతో రాకెటు వేగంతో ఆకాశం మీదికి పరుగు మొదలెట్టాడు. దూరంగా కారులు స్టార్ట్ చేయటం, అందమైన తల్లులు పిల్లలకోసం వెతుకుతూన్నట్లు నటి

న్నాంటే వారికి సాయం చేయడం కోసమే కాచుకు కూర్చున్న యువకుల అష్టప్రశ్నల్లో సముద్రపుహోరు కలిసిపోయి సీతని అయోమయావస్థలో పడేశాయ్. భయంగా అతని ముఖంలోకి చూసి

"నన్ను వదలండిప్లీజ్! నాకు మీరెవరో తెలీదు ప్లీజ్!!" అన్నది. అతను ఫ్రీగా నవ్వాడు.

"నీకు తెలీకపోవచ్చును. నాకు తెలుసంటున్నాగా! మా ఇంటికి పద! నెమ్మదిగా నీకే జ్ఞాపకం వస్తాయి అన్నీ!" అని చేతులు వదలకుండానే లేవదీశాడు. సీతకు హృదయం దడదడలాడింది:

"భగవంతుడా? కలలోకూడా అనుకోలేదు. తన కోసం తపించే మగవాడుంటాడని. ఏమిటిలా తయారయ్యింది పరిస్థితి? తన్నెరుగున్నానంటున్నాడు. తన్ని చూట్టానికి వచ్చిన పెళ్ళికొడుకులందరూ తనకు బాగా జ్ఞాపకమే. ఇంత స్టేటస్ గా వున్న వాళ్ళని తన్ని చూట్టానికి తనతండ్రి ఎప్పుడూ ఆహ్వానించలేదు. ఏం దారి భగవంతుడా? అని విలవిల్లాడసాగింది సీత.

"ఎందుకింత కంగారు సీతా? ముందు కారెక్కు! తరువాత నన్ను గురించి ఆలోచిద్దువుగాని."

ఆమాటలువిని కళ్ళు తెరిచింది. ఒక్కసారి జాగ్రదవస్థలోనికి వచ్చింది. కాడిలాక్ కారు ఎదురుగా నోరు తెరుచుకున్న సింహంలావున్నది, ఆమెకళ్ళకి. తాను వదలివచ్చిన చోటుకోసరం వెనక్కి చూసింది. నూరు గజాలదూరం అతని చేతుల్లోంచే నడిచివచ్చానన్న స్ఫూర్తి రాగానే ఆమె కుంచించుకపోయింది. స్థాణువులా నిలబడిపోయింది. అతను ఆమెకేసిచూసి నవ్వాడు,

"ఏమిటిసీతా? మాటిమాటికీ చంటిపిల్లలా మారాం చేస్తావ్? ఇంటికెళ్లాక నేను అంతా చెప్తాగా? ముందు కారెక్కు. మళ్లీ ఎవళ్ళన్నా చూస్తే పెద్దగొడవ అయిపోగలదు" అన్నాడు. ఎదురుగా వచ్చే కారు హెడ్‌లైటు వెలుతురును ముఖం ప్రక్కకు త్రిప్పుకుంటూను. సీత సుషుప్తిలోకి వెళ్లిందాని మళ్లే కారులో కూలబడింది. డ్రైవరు సీటులో స్టీరింగుముందర కూర్చుని కారు స్టార్టు చేయబోతూ వెనక్కి తిరిగి "ఇంటికెళ్ళేదాకా నన్ను జ్ఞాపకం చేసుకోవటం మొదలెట్టు!" అన్నాడు.

ఆ చనువు ఆ మాటలు ఎక్కడో పూర్వజన్మలో విన్నట్లుగా తోచాయ్. ఎంత తరిచినా జ్ఞప్తికి తెచ్చుకోలేకపోతోంది. స్ట్రీటులైట్లు వరసాగ్గా వెనక్కి పోతూంటే తారురోడ్డుమీద మెత్తగా జారిపోయే కారులో తను ప్రయాణిస్తున్నట్లు స్ఫురణరాగానే సీత మనస్సు జీవితంలో ఒకపర్యాయమైనా ఖరీదయిన కారులో తిరిగిన ఘనతకు గర్వించింది! ఇతను తన్ని ఎందుకు తీసుకవెళ్తున్నట్లు? బాగుంది. మహాబాగుంది. తన చచ్చుప్రశ్న! ఒక ధనికుడయిన యువకుడు స్త్రీని ఎందుకు తీసుకువెళ్తాడు? సీతకు మగత క్రమ్మి మూర్ఛ వచ్చినట్లు ఫీలయింది. ఆమె కళ్లు తెరచేటప్పటికి కారు తలుపుతీసి ఎదురుగా నవ్వుతున్న యువకుడు కనపడ్డాడు. గమ్యస్థానము వచ్చింది కాబోలుననుకుని అతని చేయి ఆసరా అక్కర్లేకుండానే దిగేసింది. అజిత్ సింగులా వున్న ఒకమనిషి ఆ యువకుణ్ని సీతనీ మార్చి మార్చి చూడసాగాడు.

"చూడు అలీ! వనమాలకి నేను ఈ రాత్రి రానన్నానని ఫోను చెయ్యి" అన్నాడు. వనమాలా! వనమాల! ప్రఖ్యాత ఫిలింతార! సీతకు కొంచెం కొంచెం అవగతమయింది. ఇతనెవరో సినిమాలకి "ఎక్‌స్ట్రా సప్లయర్" అయివుంటాడు. తన్నుకూడా ఇందులోకి దింపుదామని తీసుకొచ్చి వుంటాడు. తను సినిమాల్లోకి పనికివస్తుందా! ఏమో! సముద్రంవొడ్డున తెగవర్ణించాడు మహానుభావుడు. వరండాదాటి హాలులో ప్రవేశించారు. హాలంతా అయిదారువందలు ఖరీదు చేసే కార్పెటు పరుచబడివుంది. ఎర్రని ముఖమల్ సోఫాసెట్టులు. ఒకవారగా రౌండు టేబులుమీద "మార్బుల్ స్టోను"తో మలచబడిన తాజ్‌మహాల్ రిప్లికా. ఫాన్ గాలికి వూగుతూ గలగల్లాడే షాండిలియర్స్, చూస్తూంటే సీతకి తానొక అరేబియన్ రాకుమార్తెనయినా నేమోనన్న భ్రమకలిగింది. తనవంటిమీద సాయంత్రం ధరించిన తెల్లగులాబీరంగు వాయిల్ చీర వుంటంచేత తనొక మామూలు అమ్మాయిననీ ఇంకొకరి ఇంట్లో అతిథిగా వున్నాననీ నిర్ధారణకొచ్చింది.

"పైకిపోదాం. అక్కడ మాట్లాడుకోవచ్చును. పిన్నిగారూ? రెండు భోజనాలు పైకి పంపించండి" అన్నాడు, హుషారుగా ఆయువకుడు.

"నాకు శనివారం. నేను భోజనం చెయ్యను. ఈపూట" అనేసింది సీత.

"అలాగా! అయితే ఫలహారం చెయ్యి. పిన్నిగారూ భోజనం కాదు. ఫలహారం, ఫలహారం. వూ.

పడు" అని సీతని అడక్కుండానే చేయిపుచ్చుకుని మేడపైకి లాక్కునిపోయాడు. అతని సాహసానికి కోపం వచ్చినా సీతకు కొంచెం భయం వదిలింది.

"అలా లాగేయకండి. నేను మీ వెంటే వస్తాలెండి. చెయ్యినొప్పి పుట్టుతోంది" అని నెమ్మదిగా చేయి విడిపించుకుని అతనివెంట నడవసాగింది. మెట్లకిరుపైపులా వాలుగా నున్నగా జారిపోయిన ఇనుప కడ్డీలను చూస్తూంటే ఆమెకు జరజరా ప్రాకిపోయే నల్లత్రాచులు జ్ఞాపకానికొచ్చాయ్. డిమ్‌గా వెలుగుతున్న ఎలక్ట్రిక్ బల్బులు లేత వెన్నెల స్ఫురించగా చలువగాలి మేడమెట్లు ఒక్కొక్కటే వెనక్కి పోతూంటే వారిరువురూ బాల్కనీదాటి ఒక గదిలోకి వచ్చారు. అది కూడా పొడవుగా ఒక చిన్న హాలంతే వున్నది. గాడ్రెజ్ పందిరిమంచం, పైన నెమలి ఆకారంలోంచి వ్రేలాడుతున్న దోమతెర, లేత నీలి ముఖమల్ కవర్సు తొడిగిన "డన్‌లోపిల్లో" సోఫాలు, నాలుగడుగుల అద్దం అమర్చిన బీరువా. వేరొక అద్దం అమర్చిన డ్రాయరుమీద బ్రిల్‌క్రీమ్, పౌడరు, మొదలయిన టాయిలెటు సామగ్రీ ఆకాశం కన్పించేటంత పెద్ద పెద్ద కిటికీలకు పలుచగా కట్టబడిన నైలాన్ కర్టెన్లు, పరీక్షిస్తూ సీత నిలబడిపోయింది.

"కూర్చో సీతా! నిలబడిపోయావేం? చాప వెయ్యమంటావేమిటి? అలా సోఫాలో కూర్చో. మరేం ఫరవాలేదు" అన్నాడు. సీత గది అంతా కలయ చూస్తూ ఒక సోఫాలో కూర్చుంది.

"ఏమిటి సీతా ఈ మౌనం? నువ్వింకా షాక్ నించి తేరుకోలేదు కదూ?" సీత అతనికేసి ఏదో వెతుకుతూన్నట్టు చూసింది.

నేనెవరో జ్ఞాపకం రావటం లేదూ?

వూహుఁ అన్నట్టు తల అడ్డంగా వూపింది. ఈలోగా గది తలుపులు త్రోసుకుని శ్వేత కిరీటధారిణి వచ్చింది.

"పిన్నిగారూ! కొంచెం ఫలహారం పంపించండి ఈమెకి"

"మరి నువ్వో?" అన్నది ఆమె చనువుగా.

"నాకూ ఫలహారమే. భోజనం తర్వాత చేస్తాను." ఆమె సీతను నిలువునా పరీక్షించిచూసి క్రిందికి వెళ్లిపోయింది. సీత అతన్ని ఏదో అడగబోతుండగా ఒకమ్మాయి ట్రేలో ఫలహారం తీసుకవచ్చింది. రెండు ప్లేట్లలో మధ్యకికోసిన కాబూలుదానిమ్మ చెక్కలు, రెండేసి తెల్లచక్కరకేళీ అరటిపళ్లు, ఎర్రగా పండిన రెండుయాపిలుపళ్లూ, రెండు నల్లద్రాక్షగుత్తులూ, నాలుగు ఒలిచిన కమలాఫలాలు, రెండు గ్లాసుల్లో చిక్కని పాలూ, రెండు చిన్న పింగాణీ గిన్నెల్లో చక్కెరా, వున్నయ్. అవి గోడకి వారగావున్న ఆకుపచ్చని గాజు పలక బిగించిన డ్రాయరుమీద వుంచి గోల్డ్ కలరుతో అశోకచక్రం చెక్కిన వెండి కూజాలో అగరు వత్తులు వెలిగించి కిటికీలకున్న నైలాన్ కర్టెన్లు వత్తిగించి అవతలకు పోబోతూంటే.

"అనసూయా! కొత్త తాంబూలం సామగ్రి కూడా ఇచ్చావంటే ఇక నిన్ను పిలవను" అన్నాడు.

"సీతా! ఇలావచ్చి ఫలహారం చెయ్యి!" అన్నాడు తనొక పేముకుర్చీలో కూర్చుని ప్లేటు ముందుకు లాక్కుంటూ. సీత తటపటాయించింది.

"రా! అనుమానిస్తావేం? మళ్లీ చేయి చేసుకోవాలా ఏం? "ఈజబర్దస్తీ ముందెన్నడో అనుభవమయినట్టుగా జ్ఞాపకాలపొరలు తెరలుగా కదులుతున్నాయ్. లేచి నుంచుంది. "వూఁ బలే సిగ్గువే? అసలే ఆలస్యంగా అవుతోంది అమ్మాయికి! నేను ఆకలికి ఆగలేను. గమ్మునరా! మరి!" అన్నాడు. ఈ మాటలు అన్నీ తానెప్పుడో విన్నవే! ఈ ధోరణి తనకు కొత్తగాదు. యథాలాపంగా డ్రస్సింగు టేబులు వేపు చూసింది. ఫోటోఫ్రేంములో తనకు చిరపరిచితమయిన అబ్బాయి ముఖం చిరునవ్వు చిందుతూంది. చేతుల్లోకి తీసుకుని చూసింది. వెనక వేపు "దీపక్ వర్మ!" అని వుంది. ఒక్కసారి త్రుళ్లిపడింది, సీత. దీపక్ వర్మ! వేల కన్నెల కన్నుల్లో దీపాలు వెలిగించే దీపక్ వర్మ! ప్రఖ్యాత సంగీతజ్ఞుడు. తన బాస్ కూతురు పెళ్ళంటూ చేసుకుంటే "దీపక్"ని తప్ప మరెవ్వరినీ చేసుకోనని ప్రతినపట్టింది. అప్రయత్నంగా అతని దగ్గరగా వెళ్ళింది. ఆబగా అరటిపండు నోట్లో కుక్కుకుంటున్న అతని ముఖంవేపు గుచ్చి చూసి "మీరూ! మీరూ!! దీపక్ వర్మ!!!" అన్నది.

"అవును. ఏం?"

"ఏం లేదు." కళ్లు పెద్దవిచేసి ఆలోచనల్లో పడింది.

"మళ్ళీ మొదటికొచ్చావా! నాదయిపోయింది. ఇంక నీ వంతు. ఛా! ఇల్లా బతిమాలించుకోవటం ఏం

బాగుండి లేదు. నీవంటి మంచమ్మాయిలు బ్రతిమాలించుకోరు. మీరే మమ్మల్ని బ్రతిమాలాలి" అని చేయి పట్టుకుని కుర్చీలో కూర్చోపెట్టి ద్రాక్ష గుత్తిని ఆమె పెదిమలమీద పెట్టాడు. ఒక పండు త్రుంచి నోట్లో వేసికొని "అబ్బ! చచ్చే పులుపు!" అన్నది చనువుగా.

"పులుపు అందనివాటికి. అందాయిగా! ఇంక తీయగానే వుండాలి!" అన్నాడు. అతని మాటల్లోని శ్లేషకి చిరాగ్గా చూసింది సీత.

"ఎందుకింత అలక సీతా? నిజంగా ఈ దివ్యమైన భవనం, కారూ, నెలకు లక్షరూపాయలార్జించే నావంటి భర్తా వస్తుంటే కాదనగలిగే ధైర్యం మీ ఆడవాళ్ళకుంటుందా? నీకు ఇవన్నీ చూస్తుంటే ఈ భోగభాగ్యాలన్నీ నీ జీవితాంతం వరకూ ఉండేలాగున చేయమని భగవంతుని ప్రార్థించవూ? ఇప్పుడు నీ మనసు నాకు తెలీటంలేదనుకున్నావా సీతా?" సీతకు లజ్జవేసింది. ఏ ఆడపిల్ల అయినా బంగారుకలలే కంటుంది. మనస్సుపరిభ్రమించటానికి పరిధిలేదు. చాపమీద వొరిగి నిద్రపోయే ఆడపిల్లకూడా! ఏనాడో ఒక రాజకుమారుడులాంటివాడు తనను చేపట్టి తను వూహించలేని దివ్యలోకాలను చూపిస్తాడని ఆరాటపడుతుంది కన్నెహృదయం. తను స్వప్నంలోనైనా తలవగలేనివాడు దీపక్! నక్కెక్కడ నాగలోకమెక్కడ? అతనికి తనమీద దయకలగటం తన పూర్వజన్మ సుకృతం! "బాస్" కూతురు వనజ విన్నదంటే ఆమె హార్టు ఫెయిలవటం తథ్యం. ఆమె అచ్చంగా సినీతారలా సింగారించుకుంటుంది. బాబ్డ్ హెయిర్, చెవులకు ఎర్రరాళ్ల రింగులు, చేతికి వజ్రాలుపొదిగిన వాచీ, టిష్యూలో జరీవున్న చీరలు. ఆమె హేండ్ బాగ్ లో ఎప్పుడూ దీపక్ వర్మ ఫోటో ఉంచుకుంటుంది. ఆమె వచ్చిందంటే తమ ఆఫీసులో పెద్ద సంచలనం బయలుదేరుతుంది. ఫైళ్లు వ్రాయటం మానేస్తారు క్లర్కులు. ఇరువదినాలుగ్గంటలూ, ఫైళ్లలో తలదూర్చివుండాల్సినవాళ్లకి వనజ రాక ఆనందరేఖ! "టై" సర్దుకునేవాడొకడూ, జేబులోంచి అద్దంముక్క తీసి ముఖం చూసుకునేవాడొకడూ. నానా అవస్థలూ పడతారు వనజకోసం. ఆమెచూపు చూడపోతే "దీపక్"మీద. ఈ దీపక్ మీద!! సీత లోలోపల నవ్వుకున్నది. ఆ నవ్వుతో ఆమె ముఖం ప్రఫుల్లమైంది. పట్టలేని ఆనందంతో కాంతివంతమైన ఆమె నుదురు చూస్తూ పాలగ్లాసునోటికి అందిచ్చాడు. గ్లాసుపుచ్చుకుని పాలన్నీ త్రాగేసింది. "ఇక చెప్పండి" అన్నట్టు అతనికేసి చూసింది.

"అనసూయా? ఇవన్నీ తీసెయ్యి!" అన్నాడు. అంతవరకూ వరండాలో నించున్న అనసూయ వచ్చి "ట్రే" తీసుకుంటూ "మీకు ఫోను వచ్చిందండి. అలీ రిసీవ్ చేశాడు. నయనతార కాబోలు చేస్త" అన్నది.

"ఫోను ఎవరయితేనేం? ఈ రాత్రి నేనెవర్నీ చూడదలచలేదు. మీకు కావాలిస్తే తీసుకోండి" అన్నాడు దీపక్. సీతకు ఏమీ తోచటంలేదు. కళ్లు బరువెక్కాయి. అవులిస్తూ చిటికెలు వేయసాగింది.

"ఏం నిద్రొస్తుందా! ఆ మంచంమీద పడుకో! నిరభ్యంతరంగా!" అన్నాడు దీపక్. సీతకి నిజంగా నిద్ర ముంచుకువస్తోంది. కాని ఈ ఆతిధ్యానికి కారణమేమిటో అడగాలి! అడిగితే చెప్పే జవాబు ఆమెకు లీలగా తెలుసుకున్నది. కాని ఆభావం మనస్సులోకి వచ్చేసరికి శరీరం కంపించసాగింది. ముందర ఎక్స్ట్రా సప్లయర్ అనుకున్నది. ఇంతలో హీరో "దీపక్" అయి కూర్చున్నాడు. ఇంకా ఎన్ని అవతారాలు ఎత్తుతాడో ఈ మహానుభావుడు? ఇతని నిజస్వరూపం తెలుసుకోవాలన్న ఆకాంక్ష ఆమెకు అధికమయింది. ఏదో ప్రమాదం శంకిస్తూనే తెగించి అడిగేసింది.

"మీరు! నన్ను ఇలా పిల్చుకురావటానికి కారణం......!" నీళ్లు నమిలేసింది. దీపక్ పెద్దగా నవ్వాడు. దగ్గరగావచ్చి ఆమె వీపుమీద ఒక్క చిన్న చరుపు చరిచాడు. ఒక్కసారిగా సీతకు మత్తు వదిలింది. పదేళ్ళక్రితం ఈ శర్మ తనకు ఆప్తుడు!

"నువ్వా నువ్వేనా శర్మ!" ఆనందంతో అనేసింది.

"అమ్మయ్యా! ఇప్పటికి తెలిసివచ్చింది అమ్మాయికి. ఇందాకట్నించీ ఒక్కడ్నీ "విరహగీతం" పాడుకోలేక ఛస్తున్నాననుకో సీతా!"

"ఇప్పుడు డ్యూయెట్లు మొదలెడ్దామంటావేమిటి!" అంది తేలిగ్గా నవ్వేసి. "ఓ తప్పకుండా! కాని నాకు ప్లేబాక్ పాడించాలి. నీకు తెలుసో తెలియదోమరి!" ఇద్దరూ వెనక్కి చూసుకున్నారు.

## 2

పదేళ్ళక్రితం శర్మ రాజమండ్రిలో సీతావాళ్ళింట్లో అద్దెకుండేవాడు. ఏం చదివేవాడో తెలీదుకాని అస్త

మౌనం కిటికీలో కూర్చుని దొడ్లోకి చూసేవాడు. అది సీత కొత్తగా కంచువాలు వేసుకునే రోజులు. మొదట్లో దొడ్లోకి ఏంపనిమీదవచ్చినా కిటికీలో కూర్చున్న ఇతన్ని చూసి చిరాకుపడేది. ఇతనికి చదువూ సంధ్యా లేదు లావుంది అనుకునేది. రెండు సినిమాలు చూసి అందులో తత్వం జీర్ణించుకొన్నాక ఇతను తనకోసమే కూర్చుంటున్నాడు. అని స్పష్టపడుచుకుంది. ముందు కోపంవచ్చినా రానురాను అతనిమీద అపేక్షకలిగింది. ఎప్పుడయినా తను పెరట్లోకివచ్చేసరికి అతను కిటికీలో కనపడకపోతే ఏదో వెలితి అనిపించేది. కిటికీలోంచి తొంగిచూసేది. అతను చాపమీద నిద్రపోతూనో, ఏవో పుస్తకాలు చదువుతూనో కనపడేవాడు. ఆరోజుపూర్వం అతను నాలుగురోజులనించీ కిటికీలో కూర్చోవటం మానేశాడు. సీతకు కోపమువచ్చింది. ఏమయితే అదవుతుందని మొండి ధైర్యముతో కిటికీ దగ్గరసావెళ్లి

"ఏమండీ" అని పిల్చింది. అతను చాపమీద బోర్లగిల పడుకున్నాడు.

"ఏం? ఇవ్వాళా మిగలలేదా?" అన్నాడు లేవకుండానే. సీతకు అర్థంకాలేదు. ఏమిటో.అనుకున్నది.

"కాదు నేనూ" అంది. ఒక్కసారిలేచి నిలబడి కిటికీ దగ్గరసావచ్చి "నువ్వా! ఇంటి వారమ్మాయివా! ఏం?" అన్నాడు. ఏం? అంటే ఏం చెప్తుంది సీత మాత్రం! చెప్పలేని సిగ్గువేసింది. ఎలా అడుగుతుంది? మీరు కిటికీలో కనపడటం లేదేం అని కజాకాను అడగదల్చుకున్నది? తలవంచుకున్నది సీత. ఏంమాట్లాడాలో తెలీక నవ్వుకున్నది. అతను తలుపు తీసి చేయిపట్టుకుని "లోపలికిరా! ఇక్కడేం మాట్లాడుతావు!" అని చాపమీద కూర్చోపెట్టాడు. సీత బుద్ధిగా కూర్చుంది.

"ఏం పిల్చావు?" సీత మాట్లాడలేదు.

"బాగానే వుంది. పిల్చినదానివి ఎందుకు పిలిచావో చెప్పటానికి సిగ్గయితే ఎల్లాగ? ఏవన్నా పుస్తకాలు కావాలా!" రెండు కినిమాలు, నాలుగు భారతులు ఆమెముందర పడేశాడు. సీత అవి తిరగేసింది. వెళ్లే ప్రయత్నం చేయలేదు.

"ఏం చదువుతున్నావు?"

"ఘోర్దుఘోరం"

"వూహుఁ. అయితే నీకు కథలు అర్థంకావు. కినిమాలు చదువుకో చాలు." భారతులు తీసి దాచేశాడు.

నీకు పాడటం వచ్చునా?

రానట్టు తలతిప్పింది.

పోనీ మాట్లాడటం?

తలెత్తి అతని ముఖంలోకి చూసి చటుక్కున తల వంచేసింది.

"అభ్భా! గుడ్ గర్ల్!" వీపుమీద ఓ చరుపు చరిచాడు. సీతకి వీపు మండింది. మనసులోకి కారంగా ఎక్కి పొలమారింది. వుక్కిరిబిక్కిరయిపోయి కళ్లు నీళ్లపర్యంతమయింది.

అబ్బ! అన్నది, బాధగా. ఈలోగా వాళ్ళమ్మ కేకేస్తే లోపలికి పరుగెత్తుకుపోయింది. సీత పొడుగాటి జడలోని రిబ్బను ముక్క నూనెజిడ్డువల్ల జారి అతనిమీద పడింది!

మర్నాడు కిటికీక్రిందనించి సీత పోతూవుంటే జడపట్టుకుని గుంజాడు.

"అబ్బ! అలా గుంజుతావేమిటి? మోటుగాను! పిలిస్తే పలకనా?" అంది.

"నీదొకటి దొరికిందినాకు" అన్నాడు. తెల్లగా కోలగావున్న అతనిముఖములోని నల్లటికళ్లు తమాషాగా మెరిశాయ్. సీత గాభరాగా చెవిలోలకులు తడుముకొంది. "ఏమిటో చెప్పు" అడిగింది. కుతూహలంగా. జేబులోంచి రిబ్బనుముక్క తీసి ఆమె ముక్కుదగ్గర పెట్టాడు. నూనెకంపు! ఓక్!! అబ్బ!

"ఏమిటే వెకిలితనం నీకు కర్మ!"

"మాట! సినిమాకు వెళ్దామా!" సీత చురుక్కుమనేలా చూసింది.

"నీకు చూట్టమే కాని మాట్లాడటం రాదా! వుండు. లోపలికివచ్చి మాట్లాడుదువుకాని" అంటూ తలుపు తీశాడు.

"నాకు పనుంది బాబూ!" అంటూనే లోపలికి వచ్చి చాపమీదకూర్చుంది.

"నే నొకటి చెప్తా! కోపం తెచ్చుకోకూ!" ఏమిటన్నట్టు చూపింది."

"అలా గుడ్లెట్టుకుని చూడకపోతే ఏమిటని అడగలేవూ! పలుకే బంగారమేమిటి? అది సరే కాని,

ఇంటికి పెద్దమ్మాయివికదా ఇలా తిరగొచ్చా! మీ కుటుంబం అంతా అప్రతిష్ఠపాలు కాదూ?" అన్నాడు, శర్మ లాలించినట్టుగా.

"ఓ యబ్బో! ఎల్లా తిరిగితే నేమిటి?"

"ఇల్లాగే చిట్టీ! పట్నంమని పద్మాలు గోళ్ళు లేవు. అప్పుడు బోయ్ ఫ్రెండ్స్‌తో మాటలు కలపాలని ఆరాట పడుతున్నావ్!"

"నేనేం ఆరాట పడలేదు నీతో మాట్లాడాలని. నువ్వే రోజూ కిటికీలో కూర్చుని నాకేసి టక్కగా చూస్తుంటే జాలేసి పోనీకదా! అని నేస్తంచేస్తే ఇదా నువ్వనేదీ?" ఉడుకు మోత్తనంగా అంది.

"బాగుంది. సీతా! మహాబాగుంది. నీకోసం కాదు. నేను కూర్చునేది. మీ ఇంట్లో పనిమనిషి నాకు అన్నం తెస్తుంది దానికోసం నేను కూర్చుంటే...

"అన్నమా?" అంది సీత ఆశ్చర్యపోయి "అవును తింటానికి. అది పనిచేసేచోట చాలా అన్నము మిగులుతుందిట. నాకు ఒక బేడ డబ్బులికి అమ్మేస్తుంది. ఒక అణా మజ్జిగ కొనుక్కుని ఆవకాయ వేసుకుని తినేస్తాను. మూడణాలతో కడుపు నిండిపోతుంది." అన్నాడు. సీతకు జాలేసింది. తనుమాత్రం ఏంచేయ గలదు? ఇంట్లో ఏదయినా "టిఫెన్" చేస్తే తనవంతు పట్టుకు వచ్చేది. ఇద్దరూ పంచుకుని తినేవారు. శర్మ చాలా మంచివాడు అనుకునేది. ఘోర్తుఘోరం పరీక్షలయిపోయాయ్. శర్మ శెలవల్లో వూరికి వెళ్ళకపోవటం చూసి—

"నీకు ఇంకా సెలవులు ఇవ్వలేదా?" అంది.

ఇవ్వకేం ఇచ్చారు."

అయితే ఇంటికి వెళ్ళలేదేం?

నీ కోసం వుండిపోయాను, సీతా!

ఛా! ఛాఛా "నా కోసం నువ్వుండడం ఏమిటి? ఇంటికెళ్లి అమ్మ నీ నాన్న ని చూద్దామని లేదూ?"

వాళ్లుంటేగా వెళ్ళటానికి! చెప్పటానికి!" అన్నాడు విచారంగా. సీతకు శర్మంటే ఎంతో జాలి వేసింది. అమ్మానాన్నా లేకపోతే ఇంకెలాగ అనుకున్న ఆమె లేతహృదయం అతనిమీద ఆపేక్ష నింపుకుంది.

ఒక రోజు శర్మ మరీ బలవంతం చేశాడు, తనతో సినిమాకు రమ్మని.

"నేను రాను మా వాళ్లు తిడతారు." అంది.

"నేను అడుగుతా మీ అమ్మగారిని" అన్నాడు.

వద్దు బాబూ! కావలిస్తే మా చెల్లెళ్ళని తీసుక వెళ్లు. నీకు డబ్బెక్కువుంటేను!" అంది.

"వాళ్లెందుకూ ఏడ్చి మొత్తుకోడానికి? నాకు నువ్వే కావాలి!" సీత జడంతా విప్పేశాడు.

"అబ్బబ్బ! చచ్చిపోతున్నాను శర్మా నీతోటి! ఇప్పుడు నా జడంతా విప్పేస్తావు ఎల్లాగ? అవతల అమ్మావాళ్లు కేకేస్తోన్నారు." విసుక్కుంది, సీత.

"నాకు నీ పొడుగాటి జడంటే బలే ఇష్టం. సగం కత్తిరించి నా కిచ్చేయి నీకు నూనెఖర్చు తగ్గుతుంది. నాముచ్చటా తీరుతుంది."

"నీ కెందుకు ఆ ముచ్చట? సవరం కట్టించుకుని జడేసుకుని పూలు పెట్టుకుంటావా? వెధవ వేషాలూ వెకిలి మాటలూ."

"ఇదుగో! వెధవా గిధవా అని రానీకు సుమీ. ముందే చెప్తున్నాను."

"ఏం అంటే! ఏమంటానా! అని తిట్టానా!" వీపుమీద ఒక చరుపుచరిచాడు, శర్మ.

"అబ్బ! నన్ను ఇలా కొంచెం కొంచెం కొట్టి బాధించకపోతే పూర్తిగా ఒక్కసారి చంపేసు కూడదూ?"

"ముద్దు కిలా చేశానుకొని నిన్ను చంపగలనా సీతా?"

"మొద్దుపనిచేసి ముద్దుముద్దు అంటావేమిటి నామొహం?"

ఒకరోజు వాన జోరుగా కురుస్తోంది. చూరు క్రిందనించి నడుస్తూ శర్మకోసం ఉప్పుపిండి పొట్లం కట్టితెచ్చింది సీత. తలుపు తీస్తూనే

"ఒకమాట సీతా!" అన్నాడు.

ఏమిటన్నట్లు చూసింది.

"నాకు పదిహేను రూపాయలు కావాలి. అర్జంటు."

నా దగ్గ రెక్కడ్నుంచి వస్తయ్?

నీ దగ్గర లేవా?

వూహూ.

"వున్నయ్. నేను చూపిస్తాను. ఇయ్యవా?"

"ఏవీ?" అంది ఆశ్చర్యపోయి."

"నీ లోలకులు డబ్బుకాదేమిటి? అవి అమ్మితే వస్తయ్. రూపాయలు."

"అమ్మయ్యో !! మావాళ్లు తన్ని పాతరేస్తారు." అన్నది.

"మరేం ! ఫరవాలేదు. ఎక్కడో పడిపోయాయని చెప్పు."

"బాబోయ్ ! నేను చచ్చినా ఆ పని చేయలేను." అన్నది.

చటుక్కున దగ్గరగా వచ్చాడు శర్మ.

"ఎందుకు చేయవు సీతా చెప్పు ! మన భారత మహిళలు భర్త ఉన్నతికోసం ఎంతెంత త్యాగాలు చేసేవారు? ఇలా నువ్వు ముష్టి మూడురూపాయల లోలకులను నా కోసం త్యాగం చేయలేవూ సీతా? ఎప్పటికైనా నీ డబ్బు అణాపైసలతో లెఖ్ఖకట్టి ఇచ్చేస్తాను. సరా!" ఆమె రెండు చెంపలు నొక్కుతూ పుటుమచ్చవున్న కుడిచెంప తటాలున ముద్దుపెట్టుకున్నాడు. సీతకు చిరాకేసింది. చెంపను పమిట చెరగుతో తుడుచుకుంటూ నిలబడిపోయింది. శర్మ సర్వస్వతంత్రంగా సీత చెవిలోలకులను తీసుకున్నాడు. వానలో తడుస్తూనే బజారు వెంపు వెళ్ళిపోయాడు. సీత అలానే చాపమీద కూలబడింది. అరగంటలో ఈలవేసుకుంటూ వచ్చాడు శర్మ.

"మన అదృష్టం సీతా ! ఒక లోలకు అమ్మితేనే ఇరవయి రూపాయలు వచ్చాయి. తీసుకో నీ లోలకు" అని రెండోది సీతకి ఇచ్చాడు. సీత ముఖం విరిసిన చామంతిల్లే అయింది. "ఇప్పుడు మా వాళ్ళు లోలకు పడిపోయిందన్నా నమ్ముతారు." అని ఒక చెవిక లోలకు పెట్టేసుకుంది. ఆనందంలో అలవాటుగా వీపు మీద ఓ చరుపు చరవబోయాడు. ఆమె తప్పించుకుంది ! "ఇదుగో ! ఈ అయిదూ నీ దగ్గర వుంచు సీతా !"

"ఎందుకు? నువ్వే వుంచుకో శర్మా!" అంది.

"అఖ్ఖర్లేదు. నేను అడిగింది పదిహేనేకదా!" బలవంతంగా సీత వద్దన్నా వినకుండా ఆమె చెంగున ముడేశాడు. మర్నాడు తెల్లవారేసరికి నాన్నగారు వీధరిమీదనో కేకలేయటం విన్పించింది. బద్ధకంగాలేచి ఇవతలికివస్తూ,

"ఏమయింది నాన్నారూ?" అంది ఆరిందాలాగ.

"ఏంలేదమ్మాయ్ ! మనగదిలో లేడూ ? ఆ రాస్కెల్ ! రెండు నెలలనుంచి అర్దె నయా పైసా చెల్లుచెట్టలేదు. ఇవ్వాళ్ళ తెల్లవారేసరికి మాయమయ్యాడు. ఎవర్నని అడగం? పోనీ అమ్ముదామన్నా ఏంలేవు వాడి గదిలో !" అన్నారు సీత నాన్నగారు. సీతకు భయమేసింది. శర్మ గదిలోకెళ్ళింది. చాపా, మంచినీళ్ళ కూజా, పాతసినిమాపత్రికలూ అల్లానే వున్నయ్. అతను వున్నప్పుడు మాత్రం మహా సామాను ఏడిసింది కనకనా! ఆ పత్రిక లన్నీ పనిచేసేదాని కిచ్చి గది కడిగించి ఇవతలకు వచ్చింది. ఆ రోజంతా సీతకు ఏం తోచలేదు. సంవత్సరందాకా శర్మనుగురించి ఆలోచిస్తూనే వుంది. ఆ కిటికీ క్రిందనించి నడుస్తూంటే జడ ఎవరో గుంజుతున్నట్లు భ్రమించేది ! ఎప్పుడో వస్తాడు. రాకేం చేస్తాడు ? తన పదిహేనురూపాయలు తన కివ్వద్దూమరి? క్రమంగా అతన్ని మర్చిపోయింది.

## 3

ఇప్పుడు మళ్లీ అతనికేసి చూసింది. శర్మకూడా సీతకేసి తదేకంగా చూస్తున్నాడు.

"నీలో చాలా మార్పువచ్చింది శర్మా ! పత్రికల్లోనూ సినిమాల్లోనూ చూస్తూకూడా ఆనమాలుపట్టలేకపోయాను. ఇలా అవగలవని ఎన్నడూ వూహించలేదు." అంది.

"మరేం మజాకా అనుకున్నావా, శర్మంటే? సీతా నువ్వేం మారలేదుస్మా ! నా కంటికి నువ్వెప్పుడూ కనపడుతూనే వుంటావు నక్షత్రంలా. 'నీ చేతి చలవ వల్ల నేనింత పైకివచ్చాననేది నా జీవితంలో మరువలేను. నీ పదిహేను రూపాయలకు బదులు వజ్రాల దుద్దులు కొనిస్తాను." అన్నాడు శర్మ ప్రేమగా.

"వజ్రాలవా! నాకెందుకవి ? ఎక్కడో దొంగిలించావని జైల్లో వేస్తారు నన్ను" అంది సీత. కిటికీ లోంచి చల్లని గాలి లాన్ మీది మాలతీపువ్వుల సువాసనని మోసుకొస్తోంది. ఆకాశంమీది చంద్రుడు చుక్కల ధాటికి ఆగలేనట్టుగా మబ్బుచాటుకు తప్పుకుందామని ప్రయత్నిస్తే మబ్బులు అలిగిన భార్యకుమల్లే మరి కొంత దూరం జరుగుతున్నాయి. సీతలేచి కిటికీదగ్గరగా నిలబడింది. శర్మ వెనకాలనుంచుని

"అదేమా సినిమాల్లో అయితే రాగాలు ఆలపించుకోవాల్సిన వాళ్ళం. సీతా ! అమ్మా నాన్నగారూ చెల్లెళ్ళూ కులాసాగా వున్నారా?" అన్నాడు.

"వూఁ. బాగానే వున్నారు. రాజమండ్రిలో ఇల్లు అమ్మేశారు నా పెళ్లికోసం" అంది.

"ఇంకా పెళ్ళి కాలేదూ నీకు? పైగాడ్!" అన్నాడు.

"పెళ్ళయితే నీతో వస్తానా శర్మా! బీచిలో నే లెంపలు వాయించేదాన్ని."

"నువ్వయితే సంతోషిస్తానుకాని, మీ ఆయన అయితేమాత్రం తిరగబడతాను."

"ఇంక వస్తాను శర్మా! పొద్దుపోలేదూ?" అంది.

"ఆగాగు. చిన్న మనవి.ముందు నువ్వెక్కడుంటున్నావో ఏమిటో నాకు చెప్పాలి!"

"అల్వారుపేటలో వుంటున్నా."

పాపం!! ఒక్కర్తివే!

"అవును. కంపెనీలో వుద్యోగం చేస్తున్నాను" అంది.

"అయితే మిత్రావసు గారింటిలో కన్పించలేదేం?"

"ఎలా కనపడతానుశర్మా! అయన మా మా నే జరుకదు! మేము సర్వెంటులో వుంటాము. మొన్న వనజ బర్తడే పార్టీకి దీపక్ వర్మ "ఛీఫ్ గెస్ట్" అని ఎవరో అంటే విన్నాను" అంది నిర్లిప్తతగా.

"అప్పుడేనా "దీపక్ వర్మ"ని చూడ్దామని నీకు అనిపించలేదూ?"

తెలుసుకోవాలన్న దుగ్ధతో సీత భుజంమీద చేయివేసి కిటికీలోంచి కొబ్బరిఆకుల చివరవెలిగే వెన్నెలను చూస్తూ అన్నాడు.

"చూస్తే ఏం వస్తుంది? నయం! అంతమందిలో నన్ను గుర్తుపట్టి వీపుమీద ఓ చరుపు చరిస్తే ఎంత అవమానం? నా వుద్యోగం పూస్టింగయిపోదూ?"

"నీకింకా వుద్యోగం సద్యోగం ఎందుకు సీతా! హాయిగా నాకు దొరికిపోయాక!" ఆమె జడను చేతికి చుట్టుకున్నాడు.

"ఇంక వెళ్లివస్తాను. శర్మా!" అంది, సీత ఏదో భరించలేనట్టుగా.

"అదేకదూ చెప్తోంట సీతా! పన్నెండు అయ్యింది. ఇంతరాత్రి నీకోసం అంతదూరం రాలేను!" అన్నాడు చిలిపిగా.

"నిన్ను రమ్మన్నానేమిటి నేను! నేనుపోలేనా?," విసురుగా అంది. "ఇంక సిటీబస్సులు కదలవు. మా కారు "గరాజ్"లో నిద్రపోతోంది. అంచేత బుద్ధిగా ఆ మంచంమీద బబ్బుని నిద్రపో! కావల్సి వస్తే నేను "లోరీ"లు రికార్డ్సు వేస్తాను. నాకు పాట్టం రాదుకా!" అన్నాడు.

"వొద్దు శర్మా! మా ఇంటావిడ తెలుగావిడ. రాత్రి ఎనిమిది దాటాక ఇంటికివెళ్తే నన్ను తినేసేలా చూస్తుంది. అలాంటిది తెల్లవారితే షికార్లుచేస్తే ఇంకేమన్నావుందా? నన్ను చంపక పోనీ శర్మా!" బ్రతిమాలింది.

"మోడస్టీ పోలేదు, సీతా నీకు? ఎప్పుడూ ఎవరికో ఒకరికి భయపడుతున్నానంటావు. ఆమె అనుకోటానికి ఇప్పుడే ఎక్కువ వీలుంది. తెలుసా నీకు? అర్ధరాత్రి పరాయిమగాడితో కారులోవస్తే ఏం బాగుంటుంది? అంచేత నామాట విను. ఇక్కడే వుండిపో! రేపెల్లాగా ఆదివారమే కదూ. రేపు మనం సరదాగా వూరంతా తిరుగుదాం. రేపు నా ప్రోగ్రాం లన్నీ ఇప్పుడే "కాన్సిల్" చేస్తాను" అన్నాడు ఫోను తీస్తూ.

"కొదన్నా వూరుకోవు కదా శర్మా నీవు? నేరకపోయి నీకళ్ళ పడ్డాను" అంది మురిపెంగా.

"సోమవారం తెల్లవారేసరికి నిన్ను పూలల్లో పెట్టి మీ ఇంటావిడకు అప్పగించేస్తాను. సరా!" క్రిందనించి కారు పార్కు చేయబడ్డ ధ్వని వినపడ్డది. క్రింద హాలులో ఓ ఆడగొంతు విన్పించింది.

"వుండు ఇక్కడే! ఎవరో వచ్చినట్టున్నారు." అని అప్పుడే నిద్రలేచిన వాడల్లే అభినయిస్తూ క్రిందకు దిగాడు శర్మ.

"హల్లో మాలా! ఏమిటి కథ!" అన్నాడు.

"విశేషం ఏంలేదు. "వరుణా"నించి పోతూ నువ్వురాలేనని ఫోనుచేస్తే ఏటోనని చూసిపోదామని దిగాను." అంది. రుమాలుతో ముఖం తుడుచుకుంటూ సోఫాలో కూర్చుంది.

"అవును. ఈవ్వాళ హాయిగా నిద్రపోదామనుకున్నాను. కాని నీలాంటివాళ్లు నన్ను నిద్రపోనీరు కదా!" అన్నాడు తమాషాగా.

"నాకోసం రమ్మన్నావనా నీ వుద్దేశం? ఇవ్వాళ రెండువేలతో మొదలెట్టామన్నారు విశ్వంభరం గారు. ఆట!" అంది. ప్రఖ్యాత సినీతార వనమాలను చూడకుండా వుండలేక పోయింది సీత. తిన్నుతీసుకవచ్చావని చెప్ప

టానికి శర్మకి సంకోచమెందుకో తెలియలేదు. ఆమె తీయగా సన్నగా ఏవో కబుర్లు చెప్తోంది శర్మతో. సీత నాలుగుమెట్లు దిగి వనమాలను చూసి ఆశ్చర్యపోయింది. ఆమెను స్క్రీన్‌మీద దీపక్‌తో ఎన్నోసార్లు చూసింది తన మనస్సులో ఆదర్శప్రాయమైన జంటగా వాళ్లని వూహించుకునేది. ఆమెను చూస్తే వాంప్ పాత్రకే కాని హీరోయిన్‌గా ఎవరు వూహించగలరో అని దిగ్భ్రమ చెందింది. స్థూలంగా చామనచాయగా వున్న శరీరం చుట్టూ అంటీఅంటనట్లు వున్న అమెరికన్ ఆర్గండీ చీర. హార్స్‌టెయిల్‌గా కట్టబడిన జుట్టూ, చెవులకి దంతపు జిప్సీరింగులూ, కొట్టొచ్చినట్లు కన్పడే లిప్‌స్టిక్కు నవ్వినప్పుడల్లా పిల్లితలదూరేలా నోరుతెరుస్తున్న ఆమెను ఆ ఎర్రటి సోఫాలమధ్య చూస్తుంటే ఏదో గరగని మాస్తున్న భ్రాంతి కలిగింది సీతకి. ఇంతలో టెలిఫోను గణగణమంది. వనమాల లేచి ఒయ్యారంగా వళ్లు విరుచుకుంటూ "నీ డార్లింగు కాబోలు. నేపోతా!" అని చెప్పులు చప్పుడు చేస్తూ వెళ్లిపోయింది. సీత క్రిందికి వచ్చింది. సీతతో ఏదో చెప్పబోయేలోగా హాలు కర్టెను తొలగించుకుని వచ్చింది ఒక అమ్మాయి.

"కమిన్ తారా! ఏం విశేషం?" అన్నాడు దీపక్. సీతకు తార అనగానే ఏదో స్మృతికి వచ్చింది. ఈ పిల్ల పేరు ఎక్కడో చదివినట్లుగా గుర్తు వచ్చింది. ఏదో చిన్న సినిమా పత్రికల్లో చదివిన జ్ఞాపకం. ఈ అమ్మాయి ఇంకా పెద్ద తార అవలేదు. చిన్న చిన్న వేషాలు వేస్తుంది. పెద్ద యాక్టర్లని పూసుకు తిరుగుతుంది. పద్దెనిమిదేళ్ళుంటాయి. ఆమె కళ్ళల్లో "దీపక్" మీది ఆరాధన స్పష్టమౌతూంది. తెల్లగా సన్నగా పొడుగ్గా వుంది. బాబ్డ్ హెయిర్. లేత నీలి కమీజు. తెల్లటి సిల్కు గాగ్రా ధరించింది.

"ఈమె నా కత్యంత సన్నిహితురాలు. మిస్ సీతాదేవి! కంపెనీలో క్లర్కుగా వున్నది ప్రస్తుతం."

"ఇపటినించీ మీ సెక్రటరీ క్రింద తీసుకుంటారా! ప్రస్తుతం అంటున్నారు?" అన్నది తార జోక్‌గా.

"అమ్మయ్యో! మా "లూసీ" గోలెట్టెయ్యదూ! మిమ్మల్ని చూస్తుంటేనే నన్ను నమిలి మింగేస్తూంది" అన్నాడు దీపక్.

"పాపం! అక్కడికి ఎప్పుడూ స్లీవ్‌లెస్ ఫ్రాకులు వేసుకొస్తుంది. అయినా మీరు బొత్తిగా శుకమహర్షిలా ఫోజులేస్తారు కాని ముందు." అంది ఆ అమ్మాయి. సీతకు ఆ అమ్మాయి అంత లూజుగా మాట్లాడటం నచ్చటంలేదు. పమిట భుజంచుట్టూ తీసుకుని సోఫాలో కూర్చుంది. వాతావరణం ఒక నిమిషం స్తంభీభూతమైంది. "వుండు వస్తాను. ఆకలేస్తోంది. నీకేమయినా కావాలేమిటి?" అన్నాడు దీపక్.

"వద్దు. షూటింగు అయిపోగానే మస్తుగా టిఫిను పట్టించాను" అన్నది తార. సీతకు "ఈ అర్ధరాత్రీ, అపరాత్రీ ఈ విజిట్లేమిటి వీళ్ళకి" అనిపించింది.

"మీరు, దీపక్‌తో ఎందులో వేశారో గుర్తు రావటంలేదు. మీ ఫ్రెండా?" అన్నది తార నుద్దేశించి. ఆమె సున్నితంగా నవ్వుతూ "ఐసీ! మై ఫ్రెండ్, ఫిలాసఫర్ అండ్ గైడ్" అన్నది.

"ఏమిటి కోస్తున్నావ్ తారా? ఆమెని హడల గొట్టున్నావేమిటి?" అన్నాడు. దీపక్.

"హడలకొట్టే హడలిపోయేరకం కాదులెండి. రాకుసుల్ని జయించిన పతివ్రతలు!" అన్నది, తార. సీతకు ముళ్లు గుచ్చుకున్నట్లయింది. ఆమెకు చిన్న

సినీమాపత్రికల్లో వ్రాసేదంతా గుర్తుకు వచ్చింది. వీళ్లిద్దర్నిగూర్చి ఎన్నో వ్రాశారు. పెద్దపత్రికలు స్టార్ల వ్యక్తిగత జీవితాలను వ్రాయకపోయినా చిన్న పత్రికలు పాపులారిటీకోసం స్టార్లనుగూర్చి వున్నవీ లేనివీ వ్రాస్తాయి. అవి నిజమయినా కాకపోయినా భరించటం కష్టం. ఇలా ఆలోచిస్తూ నిద్రలో సోఫాలో వొరిగింది. ఆమెకు దీపక్, తారాకబుర్లు, నవ్వులు, స్వప్నంలోలా విన్పిస్తాయి. శర్మ నెమ్మదిగా ఆమె నుదుటిమీద చెయివేసి "సీతా!" అని పిల్చేసరికి ఆమె కళ్లువిప్పింది. చుట్టూ గాభరాగా చూసింది.

"లేచి లోపలికిపద సీతా! కాస్త రెస్ట్ తీసుకుందువుగాని. నాలుగయి పోతూంది." అన్నాడు ఆపేక్షగా.

"శర్మా! నువ్వు నిద్రపోలేదా ఇంకా!"

"మాకు నిద్రేమిటి సీతా! ఇలాగే ఎవరో ఒకరు వస్తూంటారు." అన్నాడు, కనురెప్పలు భారంగా మూస్తూను.

"నిద్రాహారాలు విసర్జించి ఇల్లా తిరుగుతూ నీ హెల్తుని ఎల్లా మెయింటెయిన్ చేయగలవు చెప్పు!" అంది, లాలనగా.

"అంచేత నేనొకటి ఆలోచించాను. నిశ్చింతగా సర్వం నీచేతుల్లో పెట్టేసి హాయిగా వుందామను కుంటున్నాను. నా కోరిక కాదంటావనుకోను." సోఫాలో ప్రక్కన కూర్చుని ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు. సీత కొన్నేపు వూరుకుని చేయి తీసుకుంది. "వొద్దు శర్మా! నన్నిలా బ్రతకనీయి. ఇంత ఐశ్వర్యం నన్ను గాభరా పెట్టేస్తుంది."

"ఈ ఐశ్వర్యం శాశ్వతమా సీతా! రేపీపాటికి మామూలుమనిషి నయిపోనూ!"

"అలా అనకు. ఇన్నాళ్ళకు కన్పించావన్న మమకారం కొద్దీ అంటున్నావు కాని, ఇంత లగ్జూరియస్ లైఫ్‌ని నాకోసం త్యజించావన్న అహంభావం నీలో బయలుదేరుతుంది. ప్రతిక్షణం నాకోసం ఇంత సంపదనీ త్యాగం చేస్తానన్న ధోరణి నువ్వు వ్యక్త పరుస్తూంటే నేను నిన్ను మామూలు భర్తలా గౌరవించలేకపోతాను. అది ఎంతవద్దనుకున్నా మన్ని లొంగదీస్తుంది. పోనీ ఇలా వుండగానే ఒప్పుకుంటామంటే నీస్నేహాలు చూస్తూపడివుండడానికి నేనురాయిని కానుకదా! మన స్నేహం ఇంతతో చాలు నేను జీవితాంతం నిన్ను మరువలేను. నాకు మామూలు భర్త వచ్చి బాధపెడుతున్నప్పుడు, "లక్షల కధికారి అయిన శర్మ అయితేనా!" అనుకునే సంతృప్తి నాకు చాలు! అన్నది, స్థిరంగా.

మన కలలు వమ్మేనా సీతా! అన్నాడు కవిత్వంగా.

"కవిత్వం మొదలెట్టకు. కలలు ఫలించటంలో కంటె ఫలిస్తాయేమోనన్న వూహాలోనే ఎక్కువ ఆనందం వుంది. మనం మామూలు మనుషుల్లా అయిపోయి ఒకరు నొకరు లక్ష అనుమానాలతో పీక్కు తినడంకంటే ఒకరి నొకరు ఆప్యాయంగా వూహించుకో వడంలో ఎంత హాయివుందో నీకు అనుభవమవ్వాలని నా కోరిక" అన్నది సీత. శర్మ మౌనంగా చూస్తూండి పోయాడు.

సోమవారం ప్రొద్దుటే ఇంటిముందర ముగ్గుపెట్టుతూన్న సీత ఇంటావిడ, పెద్దకారులోంచి దిగుతున్న సీతను చూసి ముక్కుమీద వేలేసుకుంది. శర్మ. "మరి వస్తా సీతా! గుడ్‌మార్నింగ్" అంటూ కారులోకి దూసుకుపోయాడు. సీత కలలోంచి తేరుకున్నదానిమల్లే వంటింట్లోకెళ్ళి పిల్లి బోర్లించిన వుప్పుపిండిగిన్నెనీ, చీమలుపట్టిన కాఫీ గిన్నెనీ చూస్తూ నిల్చుండి పోయింది. తాను గడిపిన రోజుల తీరు నెమరుకు వస్తూంది సీతకు. ఇంటామె వచ్చి "ఎక్కడకు వెళ్ళావమ్మాయ్? మొన్నట్నుంచీ జాడలేదూ!" అని సాగదీసింది. గుండె చిక్కపట్టుకుని "మా చుట్టాలింటికి వెళ్లానండి. సెలవేకదాని" అనేసింది.

"కారులో అతగా డెవరూ?" కనుబొమ్మ లెగరేసింది.

"మా కజినండి" అనేసి వంటపనిలో నిమగ్నమయినట్టుగా నటించసాగింది సీత.

"సీతా! సీతా! అంటూ వాడెవడో మేనత్త కొడుకులా మాట్లాడేస్తూంటే కజినుట! కజిను! నా దగ్గరా దీని వేషాలూ!" అని గొణుక్కుంటూ లోపలికి వెళ్ళింది ఇంటావిడ!

# పౌష్యశ్రీ

శ్రీ త్రిపురాన వేంకటకృష్ణ రావు

పొలములను బుట్టినది, జలములను బెరిగినది,
గొలగొలలు పండినది, గలగలను మ్రోఁగినది,
తళతళను బొలములను దాండవం బాడినది,
కలుము లిడఁ బయనమై గట్టెక్కి నిలిచినది,

చెలఁగి మన ధాన్యలక్ష్మిని బిల్వఁగా రండు!
మెలఁగి మన పౌష్య లక్ష్మిని గొల్వ రా రండు!

పసుపు పూసికొని మై పసలు తుంపెసలారఁ,
బసిఁడి నూనూఁగు మే ల్ముసుఁగు పైనెసలార,
నసువులను నిలుపఁగా నాహార మొసఁగఁగాఁ,
బొసఁగి ప్రజలను గావఁ బుట్టినది పంట సిరి!

పొలము పొలములఁ గూడి వెలికల్లములఁ జేరి
పొలికేకలను సలిగి కొలువఁబడి మండిగలఁ
గులుకుచును బలుకుచును గలుము లిల నొలుకుచును
గొలగారముల రైతు నిలుచేరె నల్లదిగొ!

రేనాఁటి కొలుపు నడి రేల వాడలఁదోఁచె,
వీనులకు మేల్కొలుపు వేకువను వినవచ్చెఁ,
బూనికను వాఁకిళ్ల ముగ్గులిడి బంతి పూ
లాన యిడి గొబ్బిళ్ల నాడిపాడిరిఁ చెలులు!

గంగిరెద్దుల వాని కమ్మని సనాయి రుతి
టంగు టంగున మ్రోఁచు జంగమయ గంటశ్రుతి
చెంగు కుచ్చులపాగ. చెంచు పిల్లనగ్రోవి
నింగి ముట్టి ధ్వనించి నిండె గుండెలలోన!

ఇలుగోడలను మెత్తి వెలవేసికొని, యలికి,
జిలుఁగు మ్రుగ్గులుఁబెట్టి యంచుఁ దోరణాఁగట్టి
తెలుఁగుసతి గృహములను దళుకు టద్దమువోలెఁ
దళతళను మెఱిపింపఁ దయసేసె సంక్రాంతి!

చెల్లెళ్ల పిలుపుతో నల్లుళ్ల రాకతోఁ,
దిళ్లు, తిరుగులతోడ నిల్లిల్లు చెలువారఁ,
గోళ్ల పందెములు, రంజిల్లు గొట్నములతోఁ
బళ్ల కజ్జెములతోఁ బల్లె పల్లెయు వెలసె!

మ్రుచ్చిలించిన కట్టె భోగిమంటలు వేసి,
వచ్చి స్నానముచేసి, కచ్చికల బొట్టులిడి,
పచ్చడియుఁ గుడుముఁదిని పట్టు బట్టలుగట్టి,
ముచ్చటగ బాలకులు మురిసియాడెదరదే!

# దేవవాణి సుభాషితాలు

## శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

### ఉపక్రమణిక

తన మొగం ముద్దు పెట్టుకుందామని తన తల్లితండ్రులు పార్వతీపరమేశ్వరులు లొక్కమాటే వంగారు తన మీదికి. వారి మొగాలు కలుపుదామనుకున్నాడు విఘ్నేశ్వరుడు. అనుకుని కిలకిల్లాడుతూ తన మొగం వెనక్కి తప్పించుకున్నాడు. అదిగో, ఆ విఘ్నేశ్వరుడు, మమ్మల్నీ, మిమ్మల్నీ రక్షించాలి.

[illegible]సలుబుద్ధులైన బుద్ధిమంతులు తమ దేశం అన్నా—తమ భాష అన్నా—తమ వేషం అన్నా చాలా అభిమానం చూపించుకుంటారు. ఇతర భాషల రచనలు కాదని తమ భాషలో వచ్చిన రచనలే ఆదరించుకుంటా రెక్కువగా. 1

స్వధర్మం నిర్వర్తించుకోవాలన్నా, డబ్బు సంపాదించుకోవాలన్నా, సుఖమూ ఆనందమూ అనుభవించాలన్నా, ఎవరికయినా దీర్ఘాయువు చాలా ముఖ్యం. అది సాధించుకోవాలనుకునేవారు, ముందు, ఆయుర్వేదం బాగా చదువుకోవాలి. క్షుణ్ణంగా అవగాహన చేసుకోవాలి. అది చెప్పినట్టు నడుచుకోవాలి కూడా, శ్రద్ధపట్టి. 2

అజ్ఞానులయినవారికంటే గ్రంథాలయినా కొల్లలుగా చేర్చిపెట్టుకునేవారు శ్రేష్ఠులు. ఊరికే చేర్చిపెట్టుకునేవారికంటే ఆ గ్రంథాలు బాగా వల్లించి జ్ఞాపకం పెట్టుకునేవారు ఉత్తములు. బండగా అలా జ్ఞాపకం పెట్టుకునేవారికంటే, ఆజ్ఞాపకం పెట్టుకుని వున్న గ్రంథభాగాలు బాగా ఆకళింపు చేసుకునేవారు గొప్పవారు. తిక్కపట్టి ఆకళింపు చేసుకునేవారికంటే, జ్ఞాపకం పెట్టుకునివున్న దంతా—తాము గడించుకున్న జ్ఞానం అంతా ఆచరణలో పెట్టుకోగలవారు బహూ ఉత్తములు. 3

వయసు చెల్లిపోయినా బుద్ధిమంతుడైనవాడు విద్యలు బాగా నేర్చుకోవాలి. దానివల్ల అప్పటి కప్పుడేమీ లాభం కలక్కపోవచ్చు. వచ్చే జన్మలోనయినా ఆవిద్యలు బాగా అంటుతాయి, సులభంగా. 4

ఒక్కొక్కప్పుడు క్రోధం రేగుతుంది మనిషికి. చాలా ముమ్మరమున్నూ అయిపోతుంది. ఆనందమూ కలుగుతుం దలాగే. పొంగి పోర్లిపోతుంది. వాటి వేగం చాలా దుర్దమంగా వుంటుంది. అయినా బాగా అణుచుకోవాలవి. ఎప్పుడయినా ఆపదలున్నూ వస్తాయి మనిషికి. వరాసగా వస్తాయి. తల్లకిందు లయిపోతాడా మనిషి, వాటితో. కాని మెల్లిగా తేరుకోవాలి.

అదిగో, అలా అణుచుకోగలవాడికీ, అలా తేరుకోగలవాడికీ సంపదలమీద సంపదలు వస్తాయి, తరవాత. ఎడతెరపి లేకుండా వస్తాయి. 5

జరిగిపోయిన దానికోసం విచారించగూడదు, తలుచుకుని తలుచుకుని. ఇకముందు జరగబోయేదానికోసమున్నూ బెంగపెట్టుకోగూడదు, ఏవో మూడుతుందని. ఇప్పుడు జరుగుతున్న దేమిటో పరకాయించుకోవాలి, బాగా. శ్రద్ధ అంతా బాగా దానిమీదే కేంద్రీకరించుకోవాలి. 6

మొగమేమో తామరపువ్వులా వుంటుంది. కలకల్లాడుతూ. మాటకూడా చల్లగా వుంటుంది మంచి గంధపుపూతలాగ. హృదయం మాత్రం భగభగ మండి పోతూ వుంటుం దెప్పుడూ, అగ్గిగుండం అయి. ధూర్తుల వాలకం యిది. 7

తోచినప్పుడల్లా పొగడవచ్చు గురువులను. మొగం యెదటే చెయ్యవచ్చు నాపని. బంధువులనూ మిత్రులనూ చాటున పొగడాలి. నౌకరులుంటారు, పనివాళ్లున్నూ వుంటారు. చెప్పిన పని చక్కగా పూర్తి చేశాక మాత్రమే పొగడాలి వాళ్లను. ఇక స్త్రీలుంటారింట్లో. బిడ్డలున్నూ వుంటారు. వాళ్లనిమాత్రం ఎప్పుడూ పొగడ గూడదు. 8

పరకాయించగా దుర్జనుడూ, సుజనుడూ, కూడా దేవతలూ దానవులూ కలిసి పాలకడలి తరిచి

సప్పుతో పుట్టా రందులో. కనుకనే, దుర్జనుడు కాలకూటవిషానికి అన్న అయినాడు. సుజనుడు, చంద్రునకు తమ్ముడయినాడు. 9

"జేహీ" అంటూ చెయ్యిచాచి దేవుళ్ళాడేవాణ్ణి సంతృప్తి పరచనివాడే భూమికి కంతకు భారం. అరణ్యాలు కావు. పర్వతాలూ కావు. సముద్రాలున్నూ కావన్నీ కలిసిన్ని. 10

సముద్రం నిండా రత్నాలే అన్నారు పెద్దలు. ఆశపుట్టింది. మొయ్యగలిగినన్ని రత్నాలు నోల్లకు తెచ్చుకుందామని గభీమని సముద్రంలో దూకాను. రత్నాల మాట దేవుడెరుగును, నోరు చెడిపోయింది, ఉప్పు నీటితో. 11

ఒకడి ఐశ్వర్యం మరొకడికి దఖలు పడుతుంది. భూవసతిన్నీ మరొక్కడికే కాదు. ఇంకొకడికిన్ని వశపడుతుంది. కీర్తి మాత్రం అలాంటిది కాదు. అచ్చంగా పతివ్రత అది. కనక, ఎవడు సంపాదించుకొన్నది వాడికే భుక్తపడుతుంది. 12

అజ్ఞానంవల్ల చెడిపోతారు కొందరు. ప్రమాదవశాన చెడిపోతారు కొందరు. తామే మహా తెలివిగలవాళ్ళం అనే గర్వంతో చెడిపోయారు. కొందరు. చెడిపోయిన వాళ్ల చేతుల్లో పడి చెడిపోతారు కొందరు.13

రసికుడైనవాణ్ణి యాచిస్తే, ఆ యాచన విఫలం అయినా గౌరవాస్పదమే. ద్విపాత్పశువన తగ్గవాణ్ణి యాచిస్తే అది సఫలం అయినా అగౌరవకరమే. 14

భేరీ దుందుభి కూడా పూర్తిగా అచేతనాలు. అయినా, వాటినోట ధనం ధనం ధనం అన్న శబ్దమే వస్తుం దెప్పుడూ. సచేతనుడు మనిషి. వాడు డబ్బో డబ్బో డబ్బో అంటూ దేవుళ్ళాడ్డంలో వింతేముందీ ? 15

మద్యం మూడు రకాలు. మొదటి స్త్రీ. రెండోది కల్లు. మూడోది ఐశ్వర్యం. స్త్రీని చూచినకొద్దీ మతిపోతుంది. కల్లు తాగినకొద్దీ మతిపోతుంది. ఐశ్వర్యం సంపాదించినకొద్దీ మతిపోతుంది. 16

తనకూ తన భార్యకూ ఎడబాటు సంభవించడం తనవాళ్లే తన కవమానం చెయ్యడం – ఎన్నిమాట్లు తీర్చినా ఎంతగా తీర్చినా ఋణం మిగిలే వుండడం– చెడ్డవాళ్లని సేవించవలసిన గతే పట్టడం-తనకి పేదరికం వచ్చి ఆ కారణం వల్ల తన మిత్రులే తనని విడిచిపెట్టెయ్యడం-వేగే అగ్గి అక్కర్లేదు, వీటిలో యే వొక్కటి సంభవించినా బుగ్గి అయిపోతాడు మనిషి, ఎంతటి వాడున్నూ. 17

ఎంత కాల్చినా పసిమీ మిసిమీ చెడదు బంగారానికి. ఎంతముక్కలు చేసినా తియ్యదనం తగిరిపోదు, చెరుకుల గడకు. ఎంత అరగతీసినా పరిమళం చెడదు మంచిగంధపు చెక్కకు. ఎంతప్రాణాల మీదికి వచ్చినా గుణం మారదు సజ్జనులకు. 18

దరిద్రుడూ, దీర్ఘరోగీ, మూర్ఖుడూ, దేశాలుపట్టి తిరిగేవాడూ, ఎప్పుడూ యెవరికో వొకరికి చాకిరీ చేస్తూనే వుండేవాడూ,— యీ అదుగురూ బతికే వుండినా చచ్చినవాళ్ల కింద జమ, వ్యాసుని లెక్కలో. 19

సామాన్యుడైనవా డుపకారం చేసినట్టు సమర్థుడైనవాడు చెయ్యలే డెప్పుడూ. నుయివుందంటే, అది చాలా చిన్నదే. కాని దప్పిక తీరుస్తుంది బాగా. అంతూ పంతూ లేని సముద్రం చెయ్యలే దాపని. 20

బుద్ధిమంతుడైనవాడు, డబ్బు కూడబెట్టడం అయినా మానుకోవాలి, అలా కూడబెట్టడంవల్ల వచ్చే చిక్కులయినా సహించగలగాలి. డబ్బే పావనం అనుకుని అది కూడబెట్టేవాళ్లలో చిక్కులపాలు కాని వాడెవడూ లేడు. 21

బీదవాడిమాట బాగా సహేతుకంగా వుంటుంది. పూర్తిగా సత్యమున్నూ అయివుంటుందది. కాని యెవరూ లెక్కచెయ్యరది. డబ్బున్నవాడి మాట లాచా మోటుగా వుంటుంది, పచ్చి అబద్ధమున్నూ అయివుంటుందది. అయినా, అదే నమ్ముతారు లోకులు. 22

మిక్కిలీ మూఢుడయినవాడూ, సర్వమూ తెలిసినవాడూ— ఈ యిద్దరూ సుఖంగానే వుంటారు. అటు కాక ఇటూ కానివాడు మాత్రం చిక్కులపాలవుతాడు. 23

డబ్బు చాలా శ్రద్ధగా జాగ్రత్తపెట్టుకుంటారు లోభులు, తమ కండలో కండే అన్నట్టు చూసుకుంటూ. ఆ డబ్బే కొంచెమూ మిగుల్చుకోకుండా విడిచిపెట్టేస్తారు సజ్జనులు, మలం అన్నట్టు భావించుకుంటూ. 24

తమ ప్రయోజకత్వంవల్లనే ప్రఖ్యాతి పొందుతారు కొందరు. వారుత్తములు. తమ తండ్రిని బట్టి

ప్రఖ్యాతి పొందుతారు కొందరు. వారు మధ్యములు. తమ మేనమామలను బట్టి ప్రఖ్యాతి పొందుతారు కొందరు. వారధములు. తమ మామగారినిబట్టి ప్రఖ్యాతి పొందుతారు కొందరు అధముల్లోనూ అధములు వారు. 25

మహాకవుల కవిత్వం విన్నవారి కళ్లల్లో ఆనంద బాష్పాలు జల జల రాలాలి. నోట, వా, వా, అన్న ప్రశంసా వాక్యాలయినా వెడలాలి. అలా జరగదూ? ఆ విన్నవాడు, ఎద్దయినా అయివుండాలి, దున్నపోతయినా అయివుండాలి. 26

ధర్మానికి ఫలం వైభవం, వైభవానికి ఫలం సుఖం. ఆ సుఖానికి మూలం స్త్రీ, స్త్రీ లేదూ, హరోం హర మరేమీ లేదు. 27

వంశపరంపరగా విద్వాంసు లయినవారికీ వంశ పరంపరగా ఐశ్వర్యవంతులయినవారికి గర్వం అన్నదే పుట్టదెప్పుడున్నూ. 28

శిష్టులను రక్షించడమూ, దుష్టులను శిక్షించడమూ ఆశ్రితులను ఆదుకోడమూ— ఇవే రాజలక్షణాలు, అభిషేకమూ, (కడగడమూ) పట్టబంధమూ గుడ్డలతో కట్టడమూ ఇవి కురుపులకూ వుంటాయి మరి. 29

ఎవడు ఎప్పుడూ ఏదో చదువుతూనే వుంటాడో— ఏదో రాస్తూనే వుంటాడో – ఏదో పరిశీలిస్తూనే వుంటాడో—పండితులు తారసపడితే వారి నేమిటేమిటో అడుగుతూ ఏమిటేమిటో తెలుసుకుంటూనే వుంటాడో - వారి ననుసరించిన్నీ మసులుకుంటూ నేవుంటాడో వాడి బుద్ధి చక్కగా పరిపక్వం అవుతుంది. సూర్యకిరణాలు తగిలితే తామర మొగ్గ ఎలాగ వికసిస్తుందో అదిగో, అలాగ వికసిస్తుంది కూడా. 30

గానంలో వుండే మాధుర్యం పసిబిడ్డా తెలుసుకోగలదు! నాలుగుకాళ్ళ పసువూ తెలుసుకోగలదు. నాగుబామూ తెలుసుకోగలదు. ఇక సాహిత్యంలో వుండే మాధుర్యమా? సాక్షాత్తూ శంకరుడయినా అది తెలుసుకోగలడో, తెలుసుకోలేడో? 31

తనదగ్గర వున్నది వెనకాముందూ చూడకుండా ఇవ్వడం-తన క్కావలసింది నిర్మొగమాటంగా అడిగి పుచ్చుకోడం-అడిగితే దాచుకోకుండా తన రహస్యాలన్నీ చెప్పెయ్యడం - సంకోచం అన్నది లేకుండా ఎదుటివాడి రహస్యాలడగడం-అన్నం పెట్టమని అడిగి తినడం-బలవంతమున్నూ చేసి తనయింటభోజనం పెట్టడం ప్రీతివుందన్నవాడి కివి ఆరూ నిదర్శనాలు. 32

గంపలకొద్దీ ద్రాక్షపళ్లుంటాయి, చేతికందుతూ కడవలకొద్దీ పాలున్నూ వుంటాయి, కలకండ కలిపినవి. అయినా అవేవీ కావని-ఒక్కొక్క చూలాలు దోసిళ్ల కొద్దీ మట్టిపెళ్ళలే తింటుంది ఆబగా. తత్వం బాగా పరిశీలిస్తే వొత్తి పీనాసి పడివుంటూ డామె కడుపున. అదిగో, ఆ మహానుభావుడి దా నోటిచారవ. 33

న్యాయమార్గాన బతకవచ్చు. అన్యాయమార్గానా బతకవచ్చు. పొదుపుగా బతకవచ్చు. దుబారా చేస్తూనూ బతకవచ్చు, సత్యం చెబుతూ బతకవచ్చు, సత్యం తప్పిన్నీ బతకవచ్చు, నౌకరీచేస్తూ బతకడంమాత్రం చాలా హీనం. 34

ఎవరితోనైనా గాఢంగా మైత్రి సంపాదించుకోవాలనివుందా నీకు? అయితే, ఆ మనిషితో మాట పట్టింపులు పెట్టుకో కెప్పుడూ. ఇచ్చి పుచ్చుకోడాలున్నూ పెట్టుకోకు-ముఖ్యంగా అతని భార్యతో మాటామంతీ పెట్టుకోకు కొంచెమున్నూ. 35

అటు మేఘాలూ, ఇటు డబ్బూ ఎక్కణ్ణించి వస్తాయో, ఎలా కూడతాయో, ఎందుకు విడిపోతాయో విడిపోయిన్నీ ఎక్కడికిపోతాయో ఎవరూ గుర్తించలేరు. ఇది చాలా చిత్రం. 36

సుభాషితం విన్నప్పుడూ, కమ్మని పాట చెవిని పడ్డప్పుడూ, మిటారికత్తెల విభ్రమవిలాసాలు చూచినప్పుడూ హృదయం స్పందిస్తుంది. అలా స్పందించని మనిషి మహాయోగిఅయినా అయివుంటాడు, దున్నపోతయినాఅయివుంటాడు. 37

ఎంత కష్టపడ్డా కొన్ని పనులు చేస్తే లాభం యేమీ వుండదు. పైపెచ్చు, చికాకులున్నూ వస్తా యేమిటేమిటో. కొన్ని పనులు చేస్తే లాభం బాగానే వస్తుంది. అయితే, అంతకంతా పెట్టుబడి అయిపోతుంది. దమ్మిడీ కూడా మిగలదు. కొన్ని పనులు చెయ్యడానికే సాధ్యం కావు. ఏదయినా వొక పని చెయ్యాలని చూసేవాడు, ఇదంతా బాగా పరకాయించుకోవాలి. ముందు. బుడుంగుమంటే మొదలు పెట్టెయ్యకూడ దేది పడితే అది. 38

బదులు చెప్పక పోవడం—రోజులు గడిపెయ్యడం—ఎక్కడికో వెళ్లి పోడం—నేల మాపులు చూడ్డం—కళ్లు చిట్లించుకోడం—పెడమొగం పెట్టుకోడం—చాలు. లేదు అనడాని కివి ఆరూ మారుమాటలు. 39

వస్తువొక్కటే, కాని మూడు విధాలుగా కనపడుతుంది చూసేవారిని బట్టి. యోగులు శవం అనుకుంటారది. కాముకులు చక్కని చుక్క అయిన పడుచు అనుకుంటారు. మాంసం ముద్ద అనుకుంటుందదే, కుక్క. 40

నోటికింత ముద్ద అందిస్తే స్వాధీనం కానివాడెవడూ? మొగాన యింత బోణం కొడితే మద్దెలకూడా కమ్మగా పలుకుతుంది మరి. 41

రూపం చూడకు. గుణం తెలుసుకో. కులం చూడకుగా. శీలం గుర్తించు, చదువెంతో అడక్కు. అది యెంత అంటిందో పరకాయించు. డబ్బెంత వుందో లెక్కించకు. ఉన్నది సొంతాని కెంత అనుభవిస్తున్నాడో అది పరిశీలించు. 42

ఆయువు బహూ పరిమితం. పోనీ అంటే, వయస్సు అశాశ్వతం దీనికి సాయం — గతించినది గతించిపోడమే, మళ్ళీ తిరిగిరాదు. అయినా, భోగాల కోసం పాకులాడేవారు తమ జన్మ యెందుకో, అదేమయిపోతోందో కొంచెమూ తెలుసుకోరు. 43

ఎవరికీ, యెప్పుడూ, యేలాంటి వుపకారమూ చేసి యెరగని మనిషికంటే గడ్డిపరకే చాలా గొప్పదని నా నమ్మకం. మేత అయి పశువులను పోషిస్తుందది. కసవు అయి యుద్ధరంగంలో ప్రాణాలు నిలువుతుందది, వీరికి పందలకు. 44

దూరాన కనపడింది. నడగొండలా వుంది. కారుమబ్బన్నట్టూ వుంది. అదొక పెద్ద యేను గనుకున్నాయి తుమ్మెదలు, రివ్వు రివ్వున వచ్చి వాలాయి మదం తాగుదామని. కాని, శ్రీ హరీ! దున్నపోతయి వూరుకుంది, చివరి కది. 45

పదార్థాలను యేదో ఆంతరికమైన కారణం వొకటి కలుపుతుంది. ప్రీతి అన్నది బాహ్యమైన ఉపాధినిపట్టి మాత్రమే వుండదు. సూర్యోదయం అయితేనే వికసిస్తుంది తామరపువ్వు. చంద్రకాంత మణి కూడా చంద్రోదయం అయితేనే ద్రవిస్తుంది, మరి. 46

కలుసుకుంటే బాధ కలిగిస్తాడు శత్రువు. కలుసుకోకపోతే బాధ కలిగిస్తాడు మిత్రుడు. మరి, శత్రువుకీ మిత్రుడికీ వున్న భేదం యేమిటీ? 47

దుఃఖాలు వస్తాయి. అనుభవించవలసినవే, వస్తాయి. అభిమానవంతులు — యుక్తాయుక్తాలు యోచించకలవారు ఎవరికీ చెప్పకోరవి. 48

ఆకాశాని కెగిరినా, పాతాళాని కుంగినా, భూమండలం అంతా పరుగులెత్తినా దానాలు చేసి వుంటే తప్ప యెవరికీ యేమీ అంటదు. 49

దుర్జనుడు చేసే ప్రాణివధ చాలా విపరీతంగా వుంటుంది. వాడొకడి చెవి కొరుకుతాడు. మరొకడి ప్రాణాలు పోతాయి. 50

చచ్చిపోయినవాడి డబ్బు మరొకడెవడో అనుభవిస్తాడు. వయస్సూ నిప్పూ వాడి శరీరం హరిస్తాయి. పుణ్యమూ పాపమూ—ఇవి, మాత్రమే చుట్టలు చుట్టుకుని, వాడి వెంట పడతాయి. 51

ఎవడైనా జబ్బుపడి వస్తే పడుకోడానికి పక్క యివ్వాలి. అలసిపోయి వస్తే కూచోడానికి స్థలం యివ్వాలి. దప్పిగొని వస్తే తాగడానికి మంచినీళ్ళివ్వాలి. ఆకట నకనకలాడి పోతూ, వస్తే అన్నం పెట్టాలి. 52

ధనవంతులైన బంధువులయింట నివసించడం కంటే, బీదవాడికి కత్తివాతిమీద నడవడం మంచిది. అడవుల్లో నివసించడం మంచిది. బిచ్చం యెత్తుకోవడం మంచిది. ఉపవాసం చెయ్యడం మంచిది. నరకంలో పడిపోవడం మరీ మంచిది. 53

మంచివాళ్ళకు తానేమిస్తాడో — తానున్న సొంతానికే మనుభవిస్తాడో అదే ఆ సంపాదించుకున్న తిండి, డబ్బు. తక్కినదంతా యితర్లనుభవిస్తారు. వాడి పెళ్ళాంతో కూడా సుఖిస్తారితర్లు. 54

లోభి డబ్బే చూసుకుంటా డెంతసేపూ. దాని వల్ల వచ్చే చిక్కులు చూసుకోడు. పాతే చూసుకుంటుంది పిల్లి. అవి ముట్టుకుంటే, దుడ్డుకర్రతో నడుం విరుగుతుందని గుర్తించుకోదు. 55

శోకం వల్ల రోగాలు పెరుగుతాయి. పాలవల్ల శరీరం పుష్టి చెందుతుంది, నేతివల్ల ఇంద్రియం వృద్ధి చెందుతుంది. మాంసం వల్ల కండలు పెరుగుతాయి. 56

ఎవరితోనైనా స్నేహం చెయ్యడం చాలా సులభం. ఆ స్నేహం నిలుపుకోడం మాత్రం చాలా కష్టం. 57

డబ్బు బాగా సంపాదిస్తాడు; కాని, కొంచెమున్నా అనుభవించలేడొక్కడు. పీకలలోతున నీటిలో వుండిన్నీ కుక్క నాలుకతోనే కతుకుతుంది, మరి, నీరు. 58

గుడ్డిగవ్వ అయినా సంపాదించడొకడెప్పుడూ. కాని యెందుకెందుకో ఖర్చుపెడుతూనే వుంటాడు,

మంచినీళ్ల ప్రాయంగా డబ్బు. ఒకడున్నా సాయం వుండ డొకడికి-కాని చక్రమంటూ కయ్యానికి సిద్ధపడుతూనే వుంటాడు వాడు, ఎవరిమీదపడితే వారి మీద. ఏదోరోగంతో తీసుకుంటూనే వుంటా డొకడెప్పుడూ. కాని యేదిపడితే అది తినేస్తూనే వుంటాడు వాడు కళ్ళుబడ్డం తడువుగా. ఇదిగో వీళ్ళుముగ్గురూ చెడిపోతారు త్వరగా. 59

లేళ్ళకు మాంసమూ, ఏనుగులకు దంతాలూ, పులులకూ సింహాలకూ చర్మాలూ, చెట్లకు పళ్ళూ, స్త్రీలకు సౌందర్యమూ, జనులకు డబ్బూ, ఇవి విరోధం పుట్టిస్తాయి, ఆపదలున్నా తెచ్చిపెడతాయి. 60

చాలా తక్కువమందే స్మరించగలరు సుగుణాలు. చాలా తక్కువమందే బీదవాళ్లతో స్నేహం చెయ్యగలరు. చాలాతక్కువమందే యితర్లకు తోడ్పడతారు. ఇతర్లకు దుఃఖాలు వస్తే చాలాతక్కువమందే తామూ దుఃఖించగలరు. 61

అలసభావం—అంటే దేన్లోనూ చొరవ లేకపోవడం—ఆడదాన్ని విడిచి వుండలేకపోవడం — ఎప్పుడూ ఏదో రోగంతో తీసుకుంటూ వుండడం— పుట్టినవూరు విడిచిపెట్టలేకపోవడం—ఎక్కడికక్కడికే సంతృప్తిపడడం-పిరికితనం-అంటే దేనికీ ధైర్యంలేకపోడం-తానుగొప్పవాడు కావాలనుకునేవాడి కి వి ఆరూ అడ్డంకులు. 62

రెక్కలుతెగిన పక్షీ, ఎండిపోయిన చెట్టూ, నీరింకిపోయిన చెరువూ, కోరలుతీసిన పామూ, పేదతనం వచ్చిన మనిషీ సమానం. 63

ఎంత విద్వాంసుడూకూడా వినయంలేకపోతే రాణించడు. వినయం వుండీ, వాడు మూర్ఖుడే అయినా విద్వాంసులదగ్గిర బాగా రాణిస్తాడు. 64

"నే నివాళ పశువన్నట్టు నడుచుకున్నాను, సజ్జనుడన్నట్టు ప్రవర్తించానా?" ఎవడికి వా డిలా పరీక్షించుకోవా లెప్పటికీ. 65

లోభి తనదగ్గర చాలా డబ్బుందనుకుంటాడు. ఆ అనుకోడం గర్వంగా మారుతుంది. ఆగర్వం ప్రత్తిదాని మీదా ప్రతీవాడిమీదా చిన్నచూపు కలిగిస్తుంది ఆ చిన్నచూపు వెగటుగా మారుతుంది. దానివల్ల చాలా క్లేశాలు కలుగుతాయి వాడికి. ధనతృష్ణ పెరిగిపోతుంది. మత్తు కలుగుతుంది. నిద్ర చెడుతుంది. నిజం గుర్తించుకో గలిగితే, వా డనుకు నేది డబ్బుకాదు, ఎండిగుండెల్లో నే పేరుకున్న జబ్బు. 66

మిక్కిలీ దాక్షిణ్యం గలవారికీ, చీటికిమాటికీ కళ్ళంకలు పెంచుక్కూచునేవాళ్ళకూ, ఇతరు లేమనుకుంటారో-ఏమనిపోతారో అని జంకేవాళ్లకూ దూరతి దూరం అయిపోతాయి సంపదలు. 67

నేర్చినచదువంతా కరిచిపెట్టుకుని వుంటే చచ్చిపోయినా తప్పలేదు. చెడ్డవాడికిమాత్రం చదువు చెప్పకూడదు. చెప్పాడా? గర్భశత్రువయి కూచుంటాడు చివరికి, ఆచెప్పుకున్నవాడు. 68

ఉన్నచోటు విడిచి బయలుదేరిందంటే, చలిచీమ వేలకొద్దీ ఆమడలు గడిచిపోతుంది. కదలడూ? గరుత్మంతుడుకూడా వొక్క అడుగున్నా కదల్లేడు ముందుకి. 69

సజ్జనులు చేటలవంటివాళ్లు. వాళ్లు దోషాలు విడిచిపెట్టేస్తారు, గుణాలే గ్రహిస్తారు. ఇక దుర్జనులున్నారు. జల్లెడవంటివాళ్లు వాళ్లు. గుణాలన్నీ విడిచిపెట్టేస్తారు వాళ్లు. దోషాలే పట్టుకుంటారు, గట్టిగా. 70

మెత్తనివాణ్ణి పరాభవిస్తా రందరూ. కరుగ్గా వుండేవాణ్ణి నిరోధిస్తారు. కనక, మెత్తగానూ కాకుండా కరుగ్గానూ కాకుండా మధ్యేమార్గంగా నడుచుకోవాలి, మనిషి. 71

ప్రయత్నపరుడికి, మేరుపర్వతం అయినా యేమంత యెత్తుకాదు. పాతాళ మయినా యేమంత లోతుకాదు. సముద్రం అయినా యేమంత విశాలం కాదు. 72

ఉద్యమమూ, సాహసమూ, ధైర్యమూ, బుద్ధీ, శక్తీ, పరాక్రమమూ—ఈ ఆరూ వున్నాయీ? దేవుడి సాయం వుందన్నమాటే వాడికి. 73

ఎప్పుడూ ఏపనీ చెయ్యకుండా కూచుంటాడొకడు - ఎప్పుడూ చెపతింటూ వుంటా డొకడు - లోకుల కందరికీ విరోధి అయివుంటా డొకడు-బహూమాయకాడయివుంటా డొకడు-మిక్కిలీ క్రూరుఁ డయివుంటా డొకడు. ఎక్కడెలా వుండాలో—ఎప్పుడేమి చెయ్యాలో గుర్తులేకుండావుంటా డొకడు - ఎప్పుడూ యెవరూ యిష్టపడని వేషం వేసుకుని తిరుగుతూవుంటా డొకడు. బుద్ధివున్నవా డెవడూ అలాటివాళ్ల నింటికి చేరనివ్వకూడదు. 74

వంద యివ్వడానికయినా సిద్ధపడి కజ్జా తప్పించుకోడం సజ్జనుల పద్ధతి, కారణం లేకపోయినా కజ్జాకి కాలుదువ్వడం దుర్జనుల పద్ధతి. 75

చెయ్యరానిపని చెయ్యడంవల్లా, చెయ్యవలసిన పని చెయ్యకపోడంవల్లా, ఇంద్రియాలు జయించుకోక పోడంవల్లా, చెడిపోతాడు మనిషి. 76

నీకు జనాదరణ పొందాలని వుందా? అయితే, రొంటిన్నో వొకణ్ణి విదోవిధంగా బాధించు. మరిచి పోకుండా వుండేటట్లు బాధించు. బేజారయిపోయే టట్లు బాధించు. చూసినవా రందరూ దద్దరిల్లి పోయే టట్లు బాధించు. అప్పుడుగాని నీశక్తి యెవరూ గుర్తిం చరు. అప్పుడుగాని నీగొప్పదనం యెవరూ వొప్పు కోరు. అలా చేస్తేనా ఒకట్లు- పదులు- వందలు- వేలు- లక్షలు- కోట్లు- నిన్నారాధించడం మొదలుపెడతారు జనులు. దుర్మార్గు డనిమాత్రం అనిపించుకోకు. బాగా జ్ఞాపకం వుంచుకో. అసాధ్యు డనిమాత్రమే అని పించుకో. "వీణ్ణి తప్పించడా, పాతేస్తాడు" అనిపించుకో ఏమంటావా? తాచుపాములను మాత్రమే పూజిస్తారు జనులు. గరుత్మంతుణ్ణి పూజిస్తారా? కడగొండల్లా వుంటా యేనుగులు. అంతకంటేనూ పెద్దజంతువు లున్నాయి. ఎవరైనా పూజిస్తారా వాటిని? కనక, ఉపద్రవాలు చెయ్యి. జను లదరిపోయేటట్టు చెయ్యి. 77

ఒక దాత వుంటాడు. అతని నడవడి మంచిది కాదు. వంశమూ మంచిది కాదు. అయినా, లోకు లతని చుట్టూనే తిరుగుతూ వుంటా రెప్పుడూ. 78

తనకి ముసలితనం రాదు. చావూ మూడదు. ఇలా అనుకుంటూ విద్యలు నేర్చుకోవాలి మనిషి. డబ్బూ కూడ బెట్టుకోవాలి. ఇది ప్రాజ్ఞుని లక్షణం. అయితే, మరో విశేషం కూడా వుండాలా మనిషి దగ్గర. మృత్యుదేవత వచ్చి తన జుట్టు పట్టు కూర్చుం దను కోవాలి. బరా బరా లాక్కుపోతోందని కూడా అను కోవాలి. అనుకుంటూ ధర్మం కూడా ఆచరించాలి. 79

అన్నహితవు తప్పిపోతుంది. కడుపు నిండుగా వున్నట్టుంటుంది. అప్పుడు తిన్నట్టుంటుంది. జ్వరితుని లక్షణం యిది. బాగా పరకాయిస్తే, ధనికునిదీ యిదే లక్షణం. ఒక్క భేదం మాత్రం వుంది. కటికి లంఘనం అంటే మహా యిష్టం జ్వరితునకు. ఉల్లంఘనం అంటే యెంతో యిష్టం ధనికునకు. 80

పండితు లనిపించుకునేవా రెందరో వున్నారు లోకంలో. వారి నందరినీ పండితు లనుకోడం తప్పు. నిజంగా పండితు డైనవాడికి అందని వెన్నో వుంటాయి. వాటికోసం పాకులాడడా మనిషి. ఏమయినా కష్టాలు వస్తా యతనికి, అవి తలుచుకుని శోకాలు పెట్టడు పండితుడు. చిక్కులు వస్తాయి. చాలానే వస్తాయి. అయినా గోలపెట్టడు. ప్రపంచం మునిగిపోతోందని తల్లక్రిందు లయిపోడు. పండిత లక్షణం యిది. అదిగో అలాంటివాడే పండితుడు. 81

పళ్లు కుట్టుకోడాని కయినా పనికివస్తుంది. చెవిలో గుబిలి తీసుకోడాని కయినా ఉపయోగిస్తుంది, గడ్డిపరక. చేతులూ కాళ్లూ వుండి మాట కూడా ఆడగల మనిషి ఎందు కయినా పనికివస్తాడు, ఆశ్చర్యం ఏం? 82

దుర్గుణా లుంటాయా? వాడి రూపం యెంత చక్కని దయినా లాభం లేదు. దుశ్శీలు డయి వుంటాడూ? వాడి వంశం యెంత మంచిదయినా ప్రయోజనం లేదు. చదువంటలేదూ? వాడెంతెంత పరీక్షలిచ్చి వుండినా లెక్కకు రావు. స్వయంగా అనుభవించడూ? ఎంత డబ్బున్నా దరిద్రుడే ఆ మనిషి. 83

స్త్రీకీ పురుషుడికీ మనస్సులు కలియాలి. అలా కలిసివుండిన స్త్రీపురుషుల సంయోగమే సంయోగం. కలియని స్త్రీపురుషుల సంయోగం శవాల సంయోగమే. 84

చతురుడు కానివాడు ప్రీతిగా మాట్లాడలేడు. దాపరికం యెరగనివాడు మోసం చెయ్యలేడు. ఏ ఆశా లేనివాడు అధికారం కోసం పాకులాడడు. కాముకుడు కానివాడు వేషాలంటే సరదాపడడు. 85

అసందర్భా లేర్పడితే సింహాలూ, సజ్జనులూ, ఏనుగులూ ఉన్నచోటు విడిచిపెట్టేస్తాయి. ఏమి జరిగినా, ఉన్నచోటే వుండి, చచ్చినశిపోతాయి కాపురుషులు కాకులూ, జంతువులున్నూ. 86

నీరూ, అన్నమూ, సుభాషితమూ—ఇవి మూడే రత్నాలు. మూఢులు రాతిముక్కలే రత్నాలనుకుం టారు. 87

ప్రతీవాడూ ఏదోపని చేస్తాడు. మంచి పనీ చెస్తాడు, చెడ్డపనీ చేస్తాడు. కాలక్రమాన అది మరిచి పోతాడా మనిషి. అది మాత్రం మరిచిపోదా మనిషిని. అదే పూర్వకర్మ అవుతుంది వాడికి, తరవాతి జన్మకు. పడుకుంటాడా, వాడితో పాటదీ పడుకుంటుంది. కూచుంటాడా అదీ కూచుంటుంది. పరుగెత్తుతాడా, అదీ పరుగెడుతుంది. ఒక్కక్షణమూ విడిచివుండ దది వాణ్ణి. 88

సజ్జనులను సేవించాలెప్పుడూ. ప్రత్యేకించి, వారేమీ-ఎప్పుడూ ఉపదేశించకపోవచ్చు తనకు. అయినా వారిని సేవించాలి. వారినడవడి వుంటే, అదే ఒక శాస్త్రం అయివుంటుంది, గుర్తించుకోగలిగితే. 89

మనిషికి మొదటిగతి, తనకు తానే. తనను తప్పిస్తే తనవాడుకే గతి. ఆవాడుకునూ తప్పిస్తే సజ్జనులే గతి. ఆసజ్జనులనూ తప్పిస్తే తాను చేసుకున్న ధర్మమేగతి. 90

ఏకారణంవల్లనైనా దుఃఖం వస్తుందీ? బుద్ధి వున్నవాడది మరచిపోవాలి. అదే మందు దానికి. తలుచుకో నేకొద్దీ దిక. తలుచుకుంటాడూ? మళ్లీ వస్తుందది. మళ్లీ వస్తుంది. మళ్లీ మళ్లీ వస్తూనే వుంటుంది. 91

చేసుకున్న భార్యను డబ్బిచ్చీ, మంచిమంచి చీర లిచ్చీ బాగా ఆదరంగాచూసీ, ప్రీతిగా మాట్లాడీ, పలికించీ, నెత్తిమీద పెట్టుకోవాలి. 92

దూరాన వున్నవాడికీ, నీటిలో మునిగివున్న వాడికీ, పరుగెత్తుతున్నవాడికీ, బాగా డబ్బుండి తన్మూలంగా గర్వించి వున్నవాడికీ, క్రోధంగలవాడికీ, చాలా మత్తెక్కి వున్నవాడికీ నమస్కారం చెయ్యగూడదు. 93

వృత్తి దొరకని చోటు విడిచిపెట్టెయ్యాలి. ఉపద్రవాలు తెచ్చిపెట్టేవృత్తి విడిచిపెట్టెయ్యాలి. మాయ కాడైన మిత్రుణ్ణి విడిచిపెట్టెయ్యాలి. డబ్బెంత వుండినా, అది ప్రాణాలమీదికి తెచ్చేటట్టుంటే విడిచిపెట్టెయ్యాలదిన్నీ. 94

ఏనుక్కి దంతాలు వస్తాయి; కాని వాటి నెప్పుడూ అది ముడుచుకోదు. తాంబేలలా కాదు. అది తన మెడ బయటికీ రిక్కించుకుంటుంది. లోపలికీ ముడుచుకుంటుంది. సజ్జనులు మాట అంటారు. కాని, అదెప్పుడూ తప్పరు వారు. నీచులున్నారిక. వారు అననూ అంటారు. మాట, తప్పనూ తప్పుతారు. 95

ఇతర్లతో రగడ వస్తుందీ? అప్పుడు తెలిసి వస్తుంది. నౌకర్ల విశ్వాసం యెంత దృఢమైనదో? చిక్కులు వస్తాయీ? అప్పుడు తెలిసివస్తుంది. బంధువుల ఆదరాభిమానా లెంతటివో? విపత్తులు వస్తాయీ? స్నేహితుల ఆత్మీయత యేపాటిదో అప్పుడు కనపడుతుంది. బీదతనం వస్తుందీ? అప్పు డవగాహన అవుతుంది చేసుకున్న భార్య ప్రేమ యెంతటిదో? 96

లజ్జావంతుడు పేదరికం వస్తే చాలా సిగ్గుపడిపోతాడు. దాంతో ఆ మనిషి సత్తా తగ్గిపోతుంది. సత్తా లేనివాడు పరాభవం పొందుతాడు. పరాభూతుడు నిర్విణ్ణుడయిపోతాడు. నిర్విణ్ణుడు శోకార్తుడవుతాడు. శోకార్తుడు బుద్ధి కోల్పోతాడు. బుద్ధి కోల్పోయినవాడు నశించిపోతాడన్నివిధాలా. ఇలాగ, దారిద్ర్యం, ఆపదల కన్నిటికీ మూలం. 97

తనకి ధన నష్టం కలుగుతుం దెప్పుడయినా. తన కెందుకో మనస్తాపం కలుగుతుం దప్పుడూ అప్పుడూ. తన యింట చెడ్డపనులు జరుగుతాయి. ఎవరైనా మోసం చేస్తారు తనని. అవమానమున్నా తటస్థపడుతుంది తన కెందువల్లనైనాకాని. బుద్ధివున్నవా డెవడూ బయట పెట్టుకోడివి. 98

బాల్యదశలో వివేకం వుండదు. అంచేత, ఎదుగు దిగుడుగా గడిచిపోతుం దావయస్సు. తరవాత యౌవనం వస్తుంది. పాలపొంగువంటి దది. అవయస్సున కామం యొక్కువ, ఉద్రేకమున్నా అధికం. ఆ పిచ్చితో గడిచిపోతుం దది. ముసలితనం అలుముకుంటుంది చివరికి. కాలూ చెయ్యీ వంగ వప్పుడు. ఆడను కూడా, కనక, ఉపద్రవాలతో కలిసిపోతుం దావయస్సు అంతా. 99

చూసినా, తాకినా, విన్నా, మాట్లాడినా మనస్సు కరిగిందా—అదిగో స్నేహం అంటే అదీ. 100

ఒక దేశంలో—వొకచోట చాలా సంపాదిస్తాడొకడు. చాలా దర్జాగా వుంటాడు. చాలా వైభవాలనుభవిస్తాడు. చాలా సుఖపడతాడు. పురుషోత్తముడే అనిపించుకుంటాడు. కాని రోజులు మారతాయి. ఆ సంపాదన అంతా చెదిరిపోతుంది. ఆ దర్జా యెగిరిపోతుంది. ఆ వైభవాలు మంటిపోతాయి. చాలాచాలా కష్టాలు వస్తాయి. అయినా ఆ దేశం విడిచిపెట్టడు వాడు. ఆ చోటు మారడు. పురుషోత్తము డల్లా పురుషాధము డనిపించుకుంటూ డప్పుడు. 101

పెద్దపనీ చెయ్యగల డొకడు చిన్నపనీ చెయ్య గలడు, సమానంగా. ఉపాయాలు తెలిసినవాడయి వుంటాడతను. ఒక యేరుంటుంది. చాలా గొప్పది అది. దాని వేగమున్నా చాలా హెచ్చు. మానుల నూ కూల్చుకుపోతుం దది, తుప్పలనూ తుడిచిపెట్టుకుపోతుంది. 102

ప్రీతిగా మాట్లాడుతూనే కొట్టాలెవ డయినా ముందు ఇష్టంగా మాట్లాడే కొట్టాలి, తరవాత అసలు, తల కొట్టేసి యేడవాలి. బాగా గోలపెట్టెయ్యాలి కూడా. 103

మంచివాళ్ళకు మనస్సున ఏర్పడుతుంది ముదిమి, మొదట. తరవాతే శరీరాన ఏర్పడుతుంది. చెడ్డవాళ్లకు శరీరాన ఏర్పడుతుంది మొదట. మనస్సున ఏర్పడనే యేర్పడ దెప్పుడూ. 104

దుర్జనుడితో స్నేహమూ చెయ్యకూడదు. విరోధమూ పెట్టుకోగూడదు. కుక్కవంటివాడు వాడు. ప్రీతి వస్తే, నోళ్లు నాకుతుంది కుక్క. కోపం వస్తే, ఏ చెయ్యో, యే కాలో కరుస్తుంది మరి.

ఇతర్లకు శ్రీ వస్తే సహించలేరు నీచులు. పోనీ అంటే, తామూ సంపాదించుకోలే రది. అంచేతే ఆడిపోసు కుంటారు ఇతర్ల నెప్పుడూ వాళ్ళు. 105

సంసార జంజాటంలో పడి కొట్టుకునే వాడికి, ఒకటి సంతానమూ, రెండు భార్యా, మూడు సజ్జనులతో మైత్రీ—ఈ మూడే ఊరట కలిగించేవి. 106

ఎంతో కష్టపడి సంపాదిస్తాడు మనిషి డబ్బు - ప్రాణాలకంటే యెక్కువగా చూసుకుంటాడు వాడది. అయితే, అది వొకళ్ల పాలు చెయ్యడమో, తానే కష్టా లనుభవించడమో—ఇంతే వాడి గ్గతి. 107

రాజూ, వేశ్యా, యముడూ, గ్రామకరణమూ, అగ్నీ, దొంగా, పిల్లలూ, పురోహితుడూ—వీళ్ళు ఎదుటివారి దుఃఖం గుర్తించరు. 108

శవంవంటివాడు లోభి. చచ్చయినాపోతాడు గాని, డబ్బివ్వడు వా డెవరికీ. కండలమీద కండలు పెంచుకుని కాకులకు మాత్రం చాలా వుపకారం చేస్తాడు. 109

ఒకళ్లని సేవించడం—అంటే వొకళ్లకి నౌకరయి వుండడం కుక్కపని అంటారు కొందరు. అది సరి కాదు. కుక్క మిక్కిలీ స్వతంత్రం. అదెక్కడ, వొకళ్లకు వొళ్లమ్ముకున్నవా డెక్కడ? 110

మంచి మాటాడి—లేక డబ్బిచ్చి—వారిలో వారికి కలతలు పెట్టి శత్రువులను సాధించాలి. మరేదో విధంగా అయినా పడగొట్టాలి. దుంపనాశనమే చెయ్యాలి. కాని—కాని—అందుకోసం యుద్ధం తల పెట్టడం తగదు. తగవులున్నా పెంచుకోగూడదు. వీధిన పడనేకూడదు. 111

ఓకుక్కా! జంతువు లన్నిటిలోనూ అధముడ వనుకుంటున్నావు నువ్వు. అనుకోడమే కాదు. బాధ పడిపోతున్నా వెంతో. అలాంటి దేమీ అక్కర్లేదు. నీకంటేనూ అధము డున్నా డొకడు. వాడెవ డంటావా? కృతఘ్నుడు. అంటే, వొకరు చేసిన మేలు మరిచిపోయేవాడు. 112

దుర్జనుడు సంపాదించిన డబ్బు దేవకార్యాలకు వినియోగపడదు. ధర్మకార్యాలకూ వినియోగపడదు. పోనీ అంటే, బంధువులకూ దీనులకూ అయినా మేలు చెయ్యదు. రాజు లాగేస్తా డెప్పుడో అది. తప్పితే, దొంగలు దోచేస్తారు. 113

ఓ దరిద్రమా, నీకో దండం. నీ అనుగ్రహంవల్ల సిద్ధుణ్ణయి వున్నా న్నేను. అందరూ కనపడతారు నాకు. నేను మాత్రం వొక్కడికీ కనపడను. 114

అనేకవిధాల కాపాడుకుంటా డొక్కొక్కడు తన శరీరం. వాణ్ణి, చూసి మృత్యుదేవత నవ్వుకుంటుంది. తన డబ్బు చాలా జాగ్రత్త పెట్టుకుంటా డొక్కడు. వాణ్ణి చూసి భూదేవి నవ్వుకుంటుంది. ఒకొక్కడు తన కొడుకు నెంతో ముద్దులాడుకుంటాడు అది చూసి రంకుటా లయిన వాడి పెళ్లాం తెగనవ్వుకుంటుంది. 115

ఆడదానికి లోబడిపోతా డొకొక్కడు. చెయ్యరానివన్నీ, చేస్తాడు వాడు. వెళ్లరాని స్థలాలన్నీ వెడతాడు. తినరానివన్నీ అన్నీ తినేస్తాడు. 116

ధర్మం తప్పనివాడూ, మానావమానాలు లెక్క చెయ్యనివాడూ, రోషం చంపుకున్నవాడూ, బాగా చదువుకుని వినయవిధేయతలు అలవర్చుకున్నవాడూ, ఏ విధంగానూ ఇతర్లను బాధించనివాడూ, పరస్త్రీలను కన్నెత్తి చూడనివాడూ, తన భార్యతోనే తృప్తిపడి వుండేవాడూ, - వీడికి భయం అనేదే వుండదు లోకంలో. 117

డబ్బుండీన్నీ అది అనుభవించలేని వాడికంటే మూర్ఖుడు మరి లేడు. సంపాదించడమూ - అది జాగ్రత్త పెట్టుకోడమూ ఎవరైనా అది కొట్టేస్తే ఏడ్చుకోడమూ- ఇంతే వాడికి దక్కుట. 118

ఔదార్యం కలవాడికి డబ్బంటే గడ్డిపరక. శౌర్యం కలవాడికి ప్రాణం అంటే గడ్డిపరక. విరక్తి పొందినవాడికి తన భార్య అంటే గడ్డిపరక. ఏ ఆశా లేనివాడికి జగత్తే గడ్డిపరక, పూర్తిగా. 119

అన్నదమ్ములూ, భార్యాభర్తలూ, తమలో తా మెంత కొట్లాడుకున్నా తామే సర్దుకుంటారు. ఏకమే అవుతారు మళ్లీ. ఇతర్లతో కొట్లాట వస్తేమాత్రం

అలా సర్దుకోలేరు. మళ్లీ ఏకీభవించాలే, ఎలాగ, మరెవరూ. 120

సజ్జనులకు జ్ఞానం అభిమానం పోగొడుతుంది. మత్తున్నూ వదలగొడుతుంది. అయితే దుర్జనులకు మాత్రం అదే అభిమానం పెంచుతుంది. మత్తూ కలిగిస్తుంది. 121

నెయ్యి అయిపోయిందని - ఉప్పు అయిపోయిందని-కూర లేనేలేదని-నూనె నిండుకుందని-బియ్యపు నూకలు చాలవని - పోనీ అంటే కట్టెపుల్లలయినా లేవని బెంగ - పట్టుకుందా? ఏమిటి గతి అని ఆలోచన పట్టుకుందా ఎంత కుశాగ్రబుద్ధి కలవాడి కయినా, తెలివి అప్పటికప్పుడు తెల్లవారిపోతుంది. 122

ఓ బీదతనమా, చాలా తెలివైనదానివి నువ్వు. ఎంత గుణవంతుడైతే అంత గట్టిగా పట్టుకుంటావు నువ్వు మనిషిని. ఆ మనిషి కులం లేనివాడవుతాడా? చదువున్నూ లేనివాడవుతాడా? మరి, నూడనైనా చూడవు, నువ్వు. 123

ఎంత ఆదరం వున్న యింటికయినా, తరుచు వెళ్లాడా? తరుచు అక్కడ భోజనమున్నూ చేశాడా? దేవేంద్రు డంతటివాడైనా వాడక్కడ తేలిక అయిపోతాడు. 124

జాతిచక్రం కొరడాదెబ్బ సహించదు. సింహం మేఘాల ఉరుము సహించదు. మానవంతుడు తన్ను ఇతరులు వేలెత్తి చూపించడం సహించలేడు. 125

అన్నదానంకంటే విద్యాదానం చాలా గొప్పది. అన్నం పెడితే అప్పటి కప్పటికే తృప్తి. విద్యలు చెబితే, బతికి వుండినంతకాలమూ తృప్తే. 126

ఎప్పుడూ ఏజబ్బూ లేకపోడమూ, విద్వాంసుడయి వుండడమూ, సజ్జనులతో సహవాసం చేస్తూ వుండడమూ, గొప్పకుటుంబంలో పుట్టివుండడమూ,— చాలు, డబ్బు లేకపోయినా చాలా ఐశ్వర్యం వున్నవాడే మనిషి. 127

మనిషికి శీలం ప్రధానం. అది చెడిందీ? మరి, ఎంత డబ్బున్నా ప్రయోజనం లేదు. ఎందరు బంధువులున్నా లాభం లేదు. బతికివుండినా వొక్కటే, చచ్చిపోయినా వొక్కటే ఆ మనిషి యిక. 128

లోభి అయినవాడు, తన డబ్బు దాచుకోడానికి, భూమిలో యెంత లోతుకు గొయ్యి తవ్వుకుంటాడో అంత లోతుదాకా తాను నరకానికి వెళ్లడానికి దారి చేసుకున్నా డన్నమాటే. 129

ఓ పేదతనమా! నీకోసం చాలా దుఃఖిస్తున్నాన్నేను. ఇంతవరకూ ప్రాణస్నేహితు డన్నట్టు చూసుకున్నావు. నన్ను ఇప్పుడు నా ఐశ్వర్యం అంతా పోయింది. నా శరీరమున్నూ బాగా జబ్బుపడి పోయింది. పాపం, మరి, నువ్వెక్కడికి పోతావో యిప్పుడు? 130

ఎంత పదునైన బాణాలతో కొట్టినా, నీచుల మోటుమాటలతో కలిగినంత బాధ కలగ దెవ్వరికీ. 131

కొడుకు పుడితే, వాడే తన డబ్బంతా కాజేస్తాడని, లోభి, తాను చేసుకున్న భార్యతో గూడా సంగమించడు. 132

కవిత్వ మాధుర్యాని కలవడ్డాడా, పతంజలి మహాభాష్యంమీద వెగటు పుడుతుం దా మనిషికి. సంగీతం రుచిపడ్డాడా, కవిత్వంమీద వెగటుపుడుతుంది. స్త్రీల విభ్రమ విలాసాలు రుచిమరిగాడా, సంగీతం అన్నా రోత పుడుతుంది. పేగులు ఆకటితో నకనక లాడిపోయాయా, స్త్రీలమీద కూడా యేవపుట్టేస్తుంది. 133

మిటారికత్తెలకు, తన ప్రియులయెడల, మూడు రకాల భావాలు కలుగుతాయి. ఆ ప్రియుడు గడ్డమూ మీసాలూ రానివాడయివుంటాడా, కలకండ కలిసిన పాలన్నట్టుంటాడు. గడ్డమూ మీసాలూ వచ్చినవాడయివుంటాడా, ఉప్పుకలిపిన పులిచల్లనీళ్లన్నట్టుంటాడు. ఆ గడ్డమూ మీసాలూ తెల్లబడ్డాయా, గుగ్గిలం కషాయం అన్నట్టయిపోయి రోత పుట్టిస్తాడు. 134

మేకలు కుమ్ములాడతాయి. ఎంతో కసిగా మొదలుపెడతాయవి. ఋషులు శ్రాద్ధాలు పెడతారు. ఎంతో తంతుంటుంది వాటి కనిపిస్తుంది. తెల్లవారే టప్పటి క్కారుమబ్బులు కమ్మేస్తాయాకాశం. భూమి అంతా జలమయం అయిపోతుం దనిపిస్తుంది. భార్యాభర్తలు తగువు లాడుకుంటారు. ఎంతో రోషంగా డీకుంటారు. కాని యిట్టే తేలిపోతా యివన్నీ. 135

భోజనద్రవ్యసమృద్ధీ, భోజనశక్తీ, సంభోగశక్తీ, మంచి భార్యా, వైభవమూ, దానంచేసే శక్తీ అఖండతపస్సు చేసివుంటేనే లభిస్తా యివి. 136

ఎవడేది కోరితే అదల్లా యిచ్చేవాడూ, యెవణ్ణీ యేమీ కోరనివాడూ యింతవరకూ పుట్టలే దెక్కడా. ఇకముందున్నూ పుట్టబోడు. 137

పీలు తప్పి వుండినంత కాలమూ, భుజాన యెక్కించుకుని తిరగాలి, శత్రువును. పీలు చిక్కిందీ? రాతి మీద వేసి కుండను కొట్టేటట్టు కొట్టాలి. 137

డబ్బు చూపించి లోభిని వశపరుచుకోవాలి. చేతులు జోడించి క్రోధిని వశపరుచుకోవాలి. వాడు చెప్పినట్లల్లా విని మూర్ఖుణ్ణి వశపరుచుకోవాలి. తత్వం తెలియజెప్పి విద్వాంసుణ్ణి వశపరుచుకోవాలి. 139

క్షమించగల రాజూ, దానం చెయ్యగల బిచ్చగాడూ, స్వర్గాని కింకో పైమెట్టుకే వెడతారు. 140

ఎవరి కయినా యేమయినా యిచ్చేటప్పుడు, ఇచ్చేవారికీ పుచ్చుకునేవారికి వొళ్లు గరిపొడిచిందా— యుద్ధం చేశాటప్పుడు ఎదటివాడికీ తనకీ కూడా పులకలు పెట్టాయా, చదివాటప్పుడు, చదివేవాడికి వినేవాడికీ కూడా గగుర్పాటు కలిగిందా, అదీ దానం అంటే-అదీ పౌరుషం అంటే — అదీ వినికిడిన్నీ అంటే. 141

నదులను నమ్మగూడదు. గోళ్లున్న జంతువులనూ, కొమ్ములున్న జంతువులనూ నమ్మగూడదు. ఆయుధాలు చేతివున్న వారినీ నమ్మగూడదు. స్త్రీలనూ, రాజకుటుంబీకులనూ గూడా నమ్మగూడదు. 142

ఒక కాలితో నడుస్తాడు పండితుడు. ఒక కాలిమీద నిలిచే వుండి, ముందేం వుందో బాగా పరకాయించుకుంటే గాని వెనకటి కాలెత్తనే యెత్తడు. 143

రేపెవడి కేం మూడుతుందో యెవడికీ యేమీ తెలియదు. కనక, రేపటిపని కూడా యివాళే కానిచ్చేసుకోవాలి. 144

తన పెళ్లాన్ని చూపిస్తాడు. ఇల్లంతా స్వాధీన పరుస్తాడు. తన రహస్యాలన్నీ చెప్పేస్తాడు. ఇంతకంటే మరేం వుందీ స్నేహం అంటే? 145

స్నేహంగా వుండడమూ, భూతదయ చూపించడమూ, దానాలు చెయ్యడమూ, తియ్యగా మాట్లాడ్డమూ—ఇంతకంటే మరేం వుందీ వశీకరణ మంత్రం అంటే? 146

సర్వనాశం తటస్థించిందా? డబ్బు విడిచిపెట్టేస్తాడు పండితుడు. డబ్బుకోసం మొగం చూసుకోడూ? ఆమనిషికి సర్వనాశం సంభవించనే సంభవించదు. 147

ఎవడి బుద్ధి వాడికి సుఖం కలిగిస్తుంది. గురుబుద్ధి మరీ సుఖపెడుతుంది. పరబుద్ధి వినాశం కలిగిస్తుంది. స్త్రీబుద్ధి ప్రళయమే తెచ్చిపెడుతుంది. 148

యోగసిద్ధికల సన్యాసీ, యుద్ధంలో ప్రాణాలు విడిచే వీరుడూ—వీరిద్దరూ సూర్యమండలం భేదించుకుపోతారు. 149

ఒక్కొక్క నీటి చుక్కతోనే నిండిపోతుంది కుండ - విద్యలు నేర్చుకోడానికీ, ధర్మం చెయ్యడానికీ, డబ్బు కూడబెట్టుకోడానికీ యిదే పద్ధతి. 150

ఎంత నింపినా, బ్రాహ్మడూ-అగ్ని-యముడూ-రాజూ-సముద్రమూ-కడుపూ-ఇల్లూ-ఈ యేడు నిండనే నిండ వెప్పుడూ. 151

కూర్చేవాళ్లే లేకపోవాలి, గాని మంత్రంగాని అక్షరం లేదు. మందుగాని మూకులేదు. అయోగ్యుడైన పురుషుడున్నూ లేడు. 152

గొప్ప శూరుడైనవాడికీ, బాగా చదువుకున్నవాడికీ, అందగత్తెలయిన స్త్రీలకూ ఎక్కడికి వెళ్ళినా ఆదరసత్కారాలే. 153

డబ్బుకి నలుగురు దాయాదులు—వారు వరుసగా ధర్మమూ, అగ్గీ, రాజూ, దొంగలున్నూ. వారిలో మొదటివాణ్ణి సరిగా చూడకపోతే, తక్కిన ముగ్గురూ చెలరేగిపోతారు. 154

శీలమూ, చురుకుదనమూ, శౌర్యమూ, పాండిత్యమూ, మిత్రబృందమూ—ఇవి దొంగలకు స్వాధీనం కానివి, తరిగిపోని నిధులున్నూ. 155

పగటిపూట చూడలేదు గుడ్లగూబ-రాత్రిపూట కాకి చూడలేదు-కామాంధుడు కొత్తరకం జంతువు. పగటిపూటా, రాత్రిపూటా కూడా చూడలేడు వాడు. 156

పుస్తకం చూస్తేనే ఉపయోగించే చదువూ. ఇతర్ల స్వాధీనంలో వున్న డబ్బూ, యుద్ధం వాసనప్పుడు ఇంట్లో వున్న సైన్యమూ — ఇవి వేషాలకు మాత్రమే. 157

దాత ఉదారుడనిమాత్రమే అనిపించుకుంటాడు. లోభి అంతకంటే గొప్పవాడు-పదిమందీ వాడిచుట్టూ చేరతారు, ఏమయినా ఇమ్మని దేవుళ్లాడుతూ. అయితే ఉదారుడు ముందే డబ్బిస్తాడు, తరవాత ప్రాణాలు విడిచిపెడతాడు. లోభి అలా కాడు. ముందే విడిచిపెడతాడు వాడు ప్రాణాలు, తరవాతే ఇస్తాడు డబ్బు. 158

ఆవులకూ వుంది, పాములకూ వుంది పాత్రాపాత్రవివేకం. గడ్డితింటే ఆవులకు పాలు పడతాయి. పాలు తాగితే పాములకు విషం అవుతుంది మరి. 159

దానాలు చెయ్యడమూ, ప్రీతిగా మాట్లాడ్డమూ, ధైర్యంగా వుండడమూ, ఉచితానుచితాలు గుర్తించ గలగడమూ—ఇవి నేర్చుకుంటే వచ్చేవి కావు. సహజంగా పుట్టవలసిన గుణాలు. 160

కోరల్లో విషం లేకపోయినా పడగ-విప్పాలి పాము. విషం వుండనీ, లేకపోనీ, పడగ విప్పితేనే భయంకరం పాము. 161

విషానికీ, విషయాలకూ చాలా భేదం వుంది. విషం తింటేనే చంపుతుంది-తలుచుకుంటేనే చంపేస్తాయి విషయాలు. 162

యుద్ధంలోకి వెడితే శూరులకూ, మహాసభల్లోకి వెడితే కవులకూ ప్రతిష్ఠ, అప్రతిష్ఠ క్షణంలో వచ్చేస్తుంది. 163

సాధారణంగా దుర్జనులకు చిక్కులు తెచ్చిపెడతాయి సంపదలు. విపత్తులున్నా సుఖాలు కలిగిస్తాయి, సజ్జనులైనవారికి. 164

దూరానవుండి చూస్తే చాలా బాగుంటుంది పర్వతం. అలంకరించుకున్న వేశ్యకూడా దూరానికి చాలా బాగుంటుంది. దూరాన వుండి వింటేనే ఎంతో బాగుంటాయి యుద్ధవార్తలు. 165

పండితుడనీ, మూర్ఖుడనీ, బలవంతుడనీ, దుర్జనుడనీ, రాజనీ, దరిద్రుడనీ భేదం లేదు మృత్యువుకు. అందరూ సమానమే. 166

మనస్సు మదించిన ఏనుగువంటిది. ఎక్కడికి పడితే అక్కడికే పరుగులు దీస్తుందది. జ్ఞానం అంకుశం వంటిది. అది వున్న బుద్ధి, ఆ మనస్సుని కదలకుండా చేస్తుంది. 167

అతిథులనూ, పిల్లలనూ, భార్యనూ, తల్లినీ, తండ్రినీ - వీరి నయిదుగురినీ పోషించితీరాలి మనిషి. ఇక తక్కినవారినా? శక్తినిబట్టి చూసుకోవచ్చు. 168

విన్నకొద్దీ ధర్మం బోధపడుతుంది. విన్నకొద్దీ దుర్బుద్ధి నశిస్తుంది. విన్నకొద్దీ జ్ఞానం కలుగుతుంది. వినగా వినగా మోక్షమున్నూ సిద్ధిస్తుంది. 169

శుశ్రూష చేసి గురువుని సంతోషపెట్టి విద్య సంపాదించుకోవాలి. బాగా డబ్బిచ్చిఅయినా సంతృప్తి పరిచి విద్య సంపాదించుకోవాలి. తానొక విద్య నేర్పి ఆనందపరిచి అయినా నేర్చుకోవాలి విద్య. చదువే సంపాదించుకోవాలని వుంటే మరోమార్గం లేదందుకు. 170

తమకు శ్రేయస్సు కోరుకునే సజ్జనులు, చవితి నాటి చంద్రుణ్ణి చూడ్డాని కెంత భయపడతారో అంతా భయపడతారు పరస్త్రీల ముఖాలు చూడ్డానికి. 171

గుణవంతుడు బతికివుండినట్టనిపించుకుంటాడు. ధర్మాత్ముడున్నూ బతికివుండినవాడే అనిపించుకుంటాడు. అటు గుణమూ లేక, యిటు ధర్మమూ లేని వాడు చచ్చిపోయినవాడికిందే లెక్క.

మత్తు కలిగించనిదే ఐశ్వర్యం. ఆశలు చంపుకున్నవాడే సుఖవంతుడు. నమ్మతగ్గవాడే మిత్రుడు. ఇంద్రియాలు జయించుకున్నవాడే పురుషుడు. 172

పడుచుదనమూ, చెయ్యిములగా వున్న డబ్బూ, అధికారమూ, అవివేకమూ- ఒక్కొక్కటే చిక్కులు తెచ్చిపెడతాయివి. నాలుగూ వుంటే, మరి చెప్పడాని కేం వుంది? 173

సుగుణాలకు శోభ కలిగిస్తుంది రూపం. కులాన్ని రాణింపచేస్తుంది శీలం. సిద్ధి, విద్యలకు ప్రకాశం కలిగిస్తుంది. అనుభవమే వన్నె తెస్తుంది డబ్బుకి. 174

ఉత్తము లయినవారికి దేవురింపుమాటలు బయటికి రానేరావు. రావడమే సంభవిస్తే అది, ప్రాణాలు పోయాకే. 175

ఎవడయినా మీద కాలు వేశాడా, చప్రున, ఎగిసి, వాడి నెత్తే యెక్కుతుంది ధూళి. అవమానం జరిగినా పడివుంటే మనిషికంటే అదే నయం. 176

చెయ్యరాని పాపాలు చేయిస్తుంది ఆశ. ఏ పాపమూ చెయ్యకుండా అడ్డు పెడుతుంది సిగ్గు. 177

అసలు, పర్వతమే పెద్దది. ఆపర్వతంకంటే పెద్దది సముద్రం. సముద్రం కంటేనూ పెద్దది ఆకాశం. ఆకాశంకంటే కూడా పెద్దది బ్రహ్మపదార్థం. ఆ బ్రహ్మపదార్థం కంటేనూ, చాలా పెద్దది ఆశ. 178

ఎవరినీ ఏమీ కోరకపోడమే గౌరవానికి మూలం మనిషికి. అదే సౌఖ్యం, అదే కీర్తి, అదే ఊర్జితమూ, అదే సౌభాగ్యమున్నూ. 179

అనుభవించాలనే మాపే లేక, ఎంతసేపూ డబ్బు సంపాదించడమే పెట్టుకున్నవాడికి, ఆడబ్బు ఆడపిల్లలాగ పెరుగుతూనే వుంటుం దింటో—మరొకడి కోసం. 180

నాలుగు మొగాలే లేవు గాని బ్రహ్మదేవుడే వ్యాసమహర్షి. రెండు చేతులే వున్నాయి గాని, అది

నారాయణమూర్తే అతను. నోసట, మూడో కన్నీ లేదు గాని సాక్షాత్తూ మహేశ్వరుడే అతను. 181

కవి వచ్చి తనమీద కవిత్వం చెబితే, తానూ ఎదురుకవిత్వం చెబుతాడు లోభి. యాచకు డేమయినా చదివితే తానూ చదువుతాడు. యాచకుడు స్తుతి చెయ్యడం ప్రారంభిస్తాడు తానూ ప్రారంభిస్తాడు- చివరికి, యాచకుడు మరి సెలవు పుచ్చుకుంటా నంటే చిత్తం చిత్తం రెండు అంటూ రెండు చేతులూ జోడించు కుంటాడు. 182

కట్టుకోడాని కెప్పుడూ కొత్తబట్టలే కావాలి. వేసుకోడాని కొక్క-త్తగొడుగే వుండాలి. అనుభవించ డాని కొక్క-త్త స్త్రీయే కావాలి. నివసించడానికిన్నీ కొత్తయిల్లే కావాలి. అయితే, నౌకర్లు మాత్రం పాతవాళ్లే వుండాలి. అన్నం కూడా పాతబియ్యపు టన్నమే వుండాలి. 183

వినయం రాజపుత్రులవల్ల నేర్చుకోవాలి. బాగా మాట్లాడ్డం పండితులవల్ల నేర్చుకోవాలి. అబద్ధాలాడ్డం జూదగాళ్లవల్ల నేర్చుకోవాలి. మాయలు చేయడం స్త్రీల వల్ల నేర్చుకోవాలి. 184

మనసులో యేం వుంటే అదే చెబుతారు వాచా. వాచా యేమి చెబుతారో చేత అదే చేస్తారు. మనసా, వాచా, కర్మణా వొక్క-టిగానే వుంటారు సజ్జను లెప్పుడూ. 185

ప్రాణాలు కడ అంటినా చెయ్యవలసింది చేసే తీరాలి. ప్రాణాలు పోతున్నా యన్నా చెయ్యరానిది చెయ్యనే కూడదు. 186

బిడ్డలకోసం ప్రాణాలు విడవని తల్లులను, క్రూరులైనవారు, పెళ్ళాలకోసం విడిచిపెట్టేస్తారు. 187

పశువు లన్నీ కుమ్ములాడుకుంటాయి. చిలకలూ గోరింకలూ చదువుతాయి. కాని, డబ్బివ్వడం యెవడికి తెలుసో వాడే శూరుడూ, వాడే పండితుడున్నూ. 188

ఒకేయ్! బుద్ధిహీనుడా, మూర్ఖత్వం నేర్చుకో, దాని కెనిమిది లక్షణాలు. ఒక్క-టి — నిశ్చింతగా వుండడం. రెండు,—తిండిపోతై వుండడం. మూడు,—పొగరుమోతయి వుండడం. నాలుగు,-ఏది చెయ్యవచ్చో, ఏది చెయ్యరాదోఅన్న ఆలోచన లేకపోవడం. అయిదు- మానమూ అవమానమూ సమానంగా చూసుకోడం. ఆరు- విజబ్బూ లేకుండా వుండడం. ఏడు - శరీరం బాగా దృఢంగా వుండడం. ఎనిమిది - పగలనీ, రాత్రి అనీ లేకుండా మత్తుగా నిద్రపోడమున్నూ. 189

మహారణ్యాల్లో వుంటూ, తమప నేమో అదే చేసు కుంటూ కాలంగడిపే మునులకున్నూ యేర్పడతారు మిత్రులూ, ఉదాసీనులూ, శత్రువులున్నూ. 190

చాలా శౌర్యం కలవాళ్ళన్నట్టుంటారు. ఎంతో మృదువుగా మాట్లాడతారు. చాలా నెమ్మదిగాకూడా మాట్లాడతారు. జితేంద్రియులూ సత్యపరాక్రములూ అయివుంటారు. చేరినకొత్తలో కొందరు నౌకర్ల వాల కం యిలా వుంటుంది. తరువాత మాత్రం తలకిందులయి పోతారు. అలాంటివాళ్ళు చాలాచిక్కు-లు తెచ్చిపెడ తారు పున్నకొద్దీ. 191

కాళిదాసు కవిత్వమూ, కొత్తవయసూ, గేదె పెరుగూ, కలకండకలిసిన పాలూ, వేడిమాంసమూ, లేజవరాలూ-జన్మజన్మకూ ఈఅదృష్టంపట్టాలి నాకు. 192

దుర్జనుడా మంచివాడు, తాచుపామూ అంటే, తాచుపామే నయం. కాలం మూడితేనే గాని కాటు వెయ్యదు పాము. దుర్జనుడా? క్షణక్షణమూ కాటు వేస్తూనే వుంటాడు వాడు. 193

అగ్నిహోత్రాలు చెయ్యడమూ, మూడు వేదాలూ చదువుకోడమూ, సన్యాసం పుచ్చుకోడమూ, బూడిద పూసుకోడమూ —ఇవి నాలుగూ, ప్రజ్ఞా పౌరుషమూ లేనివాళ్ళకు బతుకుతెరువు లన్నాడు బృహస్పతి. 194

కత్తివిసరి తానే పీకనరకదు కాలం. మరి, కాలాని కున్న బలం యేమిటంటే ? విపరీత పరిస్థితి కల్పించడమే. 195

శత్రువులదగ్గిర గుణాలుంటే చెప్పకోవాలి. గురువుదగ్గిర తప్పలుంటే అవీ చెప్పెయ్యాలి. 196

కూతుర్ని మంచికుటుంబంలో పడవెయ్యాలి. కొడుకుని చదువులో ప్రవేశపెట్టాలి. శత్రువును వ్యసనా ల్లోకి దింపాలి. మిత్రుణ్ణి ధర్మమార్గానికి మళ్లించాలి. 197

విలువగల బట్టలుకట్టుకుని కాలువుకప్పకుంటే బాగానే శోభిస్తాడు మూర్ఖుడు. అయితే, నోరువిప్పి మాట్లాడనంతసేపే ఆశోభ. 198

జీవితం అస్థిరం. ధనమూ, యౌవనమూ అస్థిరాలే. కొడుకులూ, పెళ్లాలూ కూడా అస్థిరాలే. ధర్మమూ కీర్తి ఇవి రెండే స్థిరాలు. 199

(సశేషం)

# పరివర్తనము

## శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

[శ్రీనివాస నాయకుడు పదునైదవ శతాబ్దమున పూనాప్రాంతమున నుండెడివాడు. అతని భార్య సరస్వతీబాయి. బీద సాదలకు తోడ్పడుచు పతివ్రతగా పేరుగాంచిన సాధ్వి. ఒకనా డొక బ్రాహ్మణుడు తన కుమార్తె వివాహమునకై సాయము కోరగా ఆమె తన ముక్కున నున్న భూషణము నిచ్చివేసెను. బ్రాహ్మణుడు దానిని శ్రీనివాస నాయకుని కడనే అమ్మజూపెను. ఆ సందర్భమున అతనిలో కలిగిన పరివర్తన వలన అతడే పురందరదాసయ్యెనని జనశ్రుతి.]

"ఘోరం బిట్టులు సంభవించునని కన్గోజాల కిన్నాళ్లు సా
ధ్వీరత్నమ్మని నమ్మి మోసపడితిన్; పెండ్లాడి ప్రేమించితిన్;
గారాబమ్మున గేహ నిర్వహణ భాగస్వామినిన్ జేసితిన్;
పౌరుల్ హెచ్చుగ మెచ్చుకోదగిన దాంపత్యమ్ము మాదే యనన్.

"తానేమో ఒక గొప్పయింటి సుత, విద్యా శీల సంపన్న, నే
వానిష్ఠన్ గృహకార్య మగ్నయయి సంభావించు మత్ప్రేమ బ్ర
హ్మానందమ్ముగ; అట్టి కాంత యొనరింపం బూనునే విజ్ఞతా
హీనంబైన అకార్య మిందలి నిజం బేదో గ్రహింపన్ వలెన్."

అని శంకించి, గ్రహించి భూషణము, మధ్యాహ్నమ్ము తన్మూల్యమున్
గొన నేతెమ్మని పల్కి భూసురునితో; గొంపోయి తద్భూషణం
బును భద్రమ్ముగ పెట్టెలోనిడి; గృహంబుం జేరి, అక్కాంతతో
తనకుం జూపుము భూషణంబనుచు నుద్ఘాటించె నుద్రిక్తుడై.

"ద్విజు డిచ్చోటికి జాలిగొల్పునటు లర్థింపంగ రానేల ఆ
త్మజ కల్యాణముకోసమై ధనము; యుక్తాయుక్తముల్ చూడకే
ద్యజియింపన్ సమకట్టనేల నగ; స్వాతంత్ర్యం బిటుల్ చెల్లునే?
నిజ మీలాగున నంచు పల్కినను ప్రాణేశుం డెదన్ నమ్మునే?

"హాయిగ సాగు కాపురమునందు జనించె మహావిషంబు; ఎం
తో యనురాగ పూర్ణుడు మనోహరుడే అనుమానమందగా
నీ యవమానపుం బ్రతుకు నెట్లు భరించెదుదాన? ఆ విషం
బే యిక దిక్కు నాకు నిజమెన్నటికైనను దాగియుండునే?"

అని కృతనిశ్చయాత్మ యయి ఆఖరుసారిగ నెమ్మనమ్మునన్
తన పతి పాద పద్మములు ధ్యానముచేసి విషమ్ముతోడి పా
త్రను గయికొంచు నోట నిడఁ దత్ క్షణ మెక్కడనుండి వచ్చెనో
కనులను నమ్మరాదు! నగ గ్రక్కున రాలె విషంబు మాయమై.

పరుగున వచ్చి భర్తకడ వ్రాలి యిదే నగయంచు జూప న
బ్బురపడి శ్రీనివాసుడు ప్రపూతచరిత్ర కళత్రమంచు నా
దరమున గౌగిలించికొని దైవముచేసిన యీ పరీక్షచే
గురుతర భక్తిమార్గమునకున్ పరివర్తన జెందె నాటితో.

ధనవంతుండని చేరవచ్చి నిగుపే
దల్ సాయ మర్థింపగా
ధనమే ప్రాణముగా దలంచు నత డ
త్యంతంబు క్రూరాత్ముడై
అనిపెన్ వారలఁ దోల్లి; దీనజన సే
వార్థంబె యైశ్వర్య మి
చ్చును సర్వేశ్వరుడంచు భార్యకడ ని
చ్చో నేర్చె యాథార్థ్యమున్.

# కలగూరగంప

## ఆర్యుల తొలినివాసం భారతదేశమేనా?

శ్రీ ఎ. కె. రంగారావు

ఆర్యుల తొలినివాసం భారతదేశం కాదా? అనే శీర్షిక క్రింద శ్రీ శేషగిరిరావుగారు గడచిన సెప్టెంబరు భారతిలో వ్రాసిన వ్యాసం చదివాను. ఆర్య ప్రథమ నివాసస్థలం భారతదేశమే కావచ్చు - ఆర్యావర్తమే ఆర్యుల జన్మభూమియని శ్రీ పావగీ చక్కని కారణాలతో నిరూపించ ప్రయత్నం చాలాకాలం క్రిందటే చేశారు (Aryavartic Home). వారితోబాటే శ్రీ పర్జీటర్ కూడా ఆ వాదాన్ని బలపరచారు. వారిని శ్రీ శేషగిరిరావుగారు వుదాహరించకపోవటంవలన వారి పుస్తకాలను వీరు చదువలేదనే ఊహించాలి. సహేతుక మనిపించే కారణాలు ఎన్నో అందు ప్రతిపాదింపబడ్డాయి. రావుగారు కొత్తగా ఎత్తిచూపినది యెక్కువ యేమీ లేదు. ఆ కొన్ని వాటిలో చాలమట్టుకు నాకు అసమంజసంగా కనిపిస్తున్నవి.

(1) ధ్రువమనేది స్థిరంగా ఉండక వలయాకారంగా పరిభ్రమిస్తూవుండడం నిజమే. కాని మారేది ధ్రువబిందువు కాదు; ఆ బిందువుపైన నక్షత్రం, ఎన్ని వేల యేళ్ళ క్రిందటనైనా బీహారు ప్రాంతంలో ధ్రువమండలం అసంభవం. ఒకవేళ అది సంభవమని గ్రహించినా, బీహారునుంచి యిప్పటి ధ్రువమండలానికి మారుటకు కొన్ని కోట్ల సంవత్సరాలు పట్టివుండాలి. వేదాలు ఎంత ప్రాచీనమైనా అంత ప్రాచీనాలా? ఈ సందర్భంలో డాక్టర్ బీర్బల్ గారి భూగర్భ పరిశోధనలో బయల్పడిన వృక్షజంతు అవశేషాలనుబట్టి ధ్రువం బిహారులో ఉండేదనటం అసమంజసం. బీహారు హిమాలయాలకు దగ్గరలో వుంది. ధ్రువమండలంలో వుండే జంతువుల వంటివి హిమాలయాల్లో వుండవచ్చనే విషయం తెలిసినదే. అక్కడనుంచి మంచు వరదలలో (Glaciers) కొట్టుకొని వచ్చివుండవచ్చు, లేదా మంచు యుగాలలో (Ice Ages) బీహారు ప్రాంతాలలోనే అటువంటి జంతు వృక్ష విశేషాలు వుండివుండవచ్చు.

(2) రామాయణ భారతాలు మహాకావ్యాలంటే ఒప్పుకొనవచ్చును గాని అవి చారిత్రక సత్యాలను నిరూపించే యితిహాసాలంటే కాదనాలి. శ్రీ దుంపల రామిరెడ్డిగారిది కూడ యిదే అభిప్రాయం (భారతి 37-9-60). ఒకవేళ ఆ కావ్యాలరీత్యా అయోధ్య హస్తినాపురాల విషయం మాత్రం వాస్తవం అని గ్రహించినా దానివలన నిరూపింపబడేదేమిటి? రామాయణ కథాకాలంప జరుగకముందు రామాయణం వాల్మీకిచే రచింపబడినదని ప్రతీతి కదా? రామాయణం వ్రాయబడిన పిమ్మట రామాయణ గాథ జరుగకముందు మహాభారత యుద్ధగాథ జరిగియుండకూడదా! భారత రచన రామాయణ రచనా కాలానికి తరువాతది అని స్పష్టం. రామాయణంలో రాముడు దక్షిణాపథమందు తిరిగి చివరనున్న లంకలో రావణసంహారం జరిపాడన్నది తెలిసిన విషయమే. మహాభారత నాగరికత యింకా గోసంపద స్థితిలోనే వున్నదని ఉత్తర దక్షిణ గోగ్రహణాలవలన, ఘోషయాత్రవలన విదితము. ఒకవేళ రామాయణగాథయే ముందు జరిగినదన్ననూ వలస వచ్చినవారు ముందు స్థాపించిన పట్టణాలే ముందు ఖ్యాతి గడించవలయునని నియమ మెక్కడున్నది?

(3) ఋగ్వేదంలో హిమాలయాలు, పుణ్యనదులు వర్ణితాలు. కాని ఈ వర్ణనలు మంచుగల యే పర్వతాలకైనా, జీవజలాలనిచ్చే యే నదులకైనా వర్తింపుతాయి. ఎక్కడ వుండేవారికి ఆ పరిసరాలే గొప్పగా కనిపించడములో వింతేమీ లేదు. బొబ్బిలిలో నున్నవారికి సువర్ణముఖి వేగావతులే పుణ్యనదులు. శ్వేతగిరి నూదికొండలే మహాచలాలు. ఋగ్వేదం లిఖితం కాక పూర్వం ఎన్నో యేళ్ళనుంచి అనుశ్రుతంగా వస్తుందని నిరూపించబడిన విషయమే. మొదట ఆర్యులు ఎక్కడ వుంటే ఆ ప్రదేశాలనే వర్ణించివుంటారు. వలసవచ్చిన వారు యే ప్రాంతానికి వెళ్ళితే ఆ ప్రాంతాల నైసర్గిక

విశేషాలనే ఆ వర్ణనలను నిర్వర్తింపజేసుకొనివుంటారు. సమష్టి జీవితం సమాజవ్యవస్థలు వలసవచ్చినవారికి వుండవా? అయినా వీరు మొదటినుంచి దేశద్రిమ్మరులని యెవరన్నారు? ఏవో కారణాలచేత వలస వచ్చినంత మాత్రాన మున్దున్న నాగరికతను వీరొక్క లిస్తారా? ఎక్కడవుంటే దానినే స్వదేశంగా భావించారు కాబట్టి వేరే దేశాలనుంచి వచ్చామనికాని వేరే దేవతల నారాధించామనికాని వేరే ఉగ్గడింపబడలేదు.

(4, 5, 6) ఆర్యసంప్రదాయాలను, నియమాలను ఉల్లంఘించనివారినే అనార్యులు అనే వారనటంకంటె ద్రావిడులతోబాటు వారినీ ఆపదంతో న్యూనతగా వ్యవహరించేవారని చెప్పుకుంటే బాగుంటుంది. ఒక దశాబ్దం క్రిందట కులం పట్టింపులేని వాళ్ళను ఛాందసులు 'మరీ కిరస్తానులు' అయిపోతున్నారనినిందించటం మనకు తెలిసినదే. దీన్నిబట్టి క్రైస్తవమతానికి భారతదేశం పుట్టినిల్లని చెప్పగలమా ?

(7) మొహెంజొదారో, హారప్పాల నాగరికత ఆర్యనాగరికతయేనని శ్రీ శేషగిరిరావుగారు నొక్కి వక్కాణించారు. ఈ రెండు పట్టణాల నాగరికతకు ఆర్యుల నాగరికతకు సంబంధమేలేదని ప్రముఖులైన మజుమ్‌దార్, రాయ్‌చౌధురి (An Advanced History of India) అభిప్రాయపడ్డారు. ఋగ్వేద నాగరికత ముఖ్యంగా గోసంపదకు చెందినదవడం, ఈ పట్టణాలలో పసువుల కంత ప్రాముఖ్యత లేకపోవడం వారి అభిప్రాయానికి ముఖ్యకారణాలు. మొహెంజొదారో హారప్పాలలో లింగార్చన వుండేది కాబట్టి ఆ నాగరికత ఆర్యనాగరికతయే ననుట సాహసం. ఆఫ్రికా, ఆస్ట్రేలియా దేశాలలో కూడా లింగార్చన ఉండేది, ఉన్నది. అటువంటప్పుడు ద్రావిడులకుగాని ఆ పట్టణాలలో వుండిన యితరులకుగాని లింగార్చన ఎందు కుండగూడదు?

ఇంక రెండవభాగంలో రావుగారు ప్రతిపాదించ ప్రయత్నించిన విషయాలు: తమ ఆధిక్యాన్ని నిరూపించుకొనుటకై ఆర్య నాగరికత ప్రాచీనమైనదికాదని పాశ్చాత్యులందరూ అన్నారనటం సత్యదూరం. అది సమంజసమూ కాదు; దేశభక్తీ కాదు. పరజాతి దూషణ స్వజాత్యభిమానం చూపదు. దురభిమానం చూపుతుంది. ఆంగ్లపాలన సుస్థిరం చేయాలని ప్రయత్నం చేసిన కర్జనుప్రైస్రాయి కూడా సంస్కృతభాష మిక్కిలి ప్రాచీనమైన లిథూనియనుకన్న ప్రాచీనతరమైనదని వ్యాఖ్యానించాడు. దీనికి భిన్నంగా యితరులు అభిప్రాయపడ్డారు. దీనిని భారతదేశపు ఆధిక్యాన్ని నిర్మూలించడానికై వారు చేసిన కుట్ర అనడం భావ్యం కాదు. వారికి తోచిన కారణాలు చూపి అవిధంగా నిర్వచించారు. ఒకరి అభిప్రాయాలతో ప్రమేయం లేకుండా 'కార్బన్ టెస్టు' (Carbon Test) ద్వారా ఎముకలనుబట్టి వాస్తవానికి చాలా దగ్గరగా కాల నిర్ణయం చేయడానికి అవకాశం నేడు వున్నది. దీనిని బట్టి ఈజిప్ట్ నాగరికత ఆరువేల సంవత్సరాలనాటిదనిన్ని మొహెంజొదారో హారప్పాలకాలం అయిదు వేలనాటిదని నిర్ధారించబడినది.

ఇండో యూరపియన్ భాషలలో సంస్కృతం ఒకటి. ఆ విభాగానికి చెందిన హిట్టైట్, టొఖారియన్ భాషలు సంస్కృతముకన్న ప్రాచీనమైనవి. ఈ భాషలు మధ్య ఏషియాలో వాడుకలో నుండేవి. (Maiopei) కాబట్టి, ఆయా భాషలలో చెందిన నాగరికత సంస్కృత నాగరికతకన్న ప్రాచీనమని అంగీకరించాలి గదా!

రావుగారి వాదనలను ఖండించడానికి కాదు నేను వ్రాసింది. ఇటువంటి చర్చలలో ఆవేశాలకు తావు లేదని మనవి చేయటానికే. ఒకదాంట్లో మాత్రం రావు గారితో పూర్తిగా ఏకీభవిస్తాను. పాతకాలలో చరిత్రను బోధించే పాఠ్యగ్రంథాలు చాల లోపభూయిష్ఠంగా వున్నవి. త్వరితంగా సంస్కరించే బాధ్యత ప్రభుత్వానిది.

# ఆంధ్రమహాభారతము : కొన్ని సందేహములు

## శ్రీ మంగిపూడి కృష్ణమూర్తి

కవిత్రయము చేత ఆంధ్రీకరింపబడిన భారతాన్ని మొదటినుండి చివరివరకు ఉత్సాహంతో చదివాను. ఎన్నిసార్లు చదివినప్పటికీ విసుగు పుట్టకుండా, మళ్లీ చదవాలనే కుతూహలం అధికమవుతున్నది. కాని ఈ ఆంధ్రమహాభారతంలో కొన్ని పరస్పర విరుద్ధాలైన అంశాలు నాకు కన్పించినవి. వాటిని పండితులకు మనవి చేస్తున్నాను.

1. కర్ణుని జననము :—ఆంధ్ర మహాభారతము లోని ఆదిపర్వములో—18 మొదలు 38 వరకూగల

పద్యములలో కర్ణుని జన్మవృత్తాంతం వివరింపబడ్డది. ఈ సందర్భంలో, కర్ణుడు కుంతికి సద్యోగర్భమున ఉద్భవించేడని చెప్పబడినది.

"అనిన విని సూర్యుండు దానికిఁ గరుణించి నీకు సద్యోగర్భంబునఁ బుత్త్రుఁ డుద్భవిల్లు నీ కన్యాత్వంబును దూషితంబు గాదని వరంబిచ్చినఁ దత్‌క్షణంబ యక్కన్యకు నంశుమంతు నంశంబునం గానీనుండై

'చ. సలలితమైన పుట్టుఁ గవ
చంబు నిసర్గజమైన కుండలం,
బుల యుగళంబు నొప్పఁగ సు
పుత్త్రుఁడు కర్ణుఁడు పుట్టె..."

ఇదే కథ ఆరణ్యపర్వమున సప్తమాశ్వాసములో వేరొక రీతిగా చెప్పబడ్డది.

"అని యొడంబఱిచి సూర్యుండు దత్సమాగమంబునం బ్రీతుండయి దానికి గర్భాధానంబుసేసి గగనంబున కరిగెనంతఁ బూర్వపక్షంబున చంద్రుండునుంబోలె గర్భంబును గ్రమంబున బ్రవర్ధనంబు నొందుచు నభివ్యక్తంబయ్యును బ్రభాకరు మహిమంజేసి లోకవిదితంబు గాకుండెఁ దత్ప్రకారంబు దాది యొఁతు రొక్కతియు యెఱుంగు నిట్లు వర్ధిల్లుచుం బదియగు మాసంబున నొక్కనాఁటి నిశా సమయంబునం గన్యాంతిపురంబునందు.

"శ్రీ. కొడుకుఁ గనియె సహజకుండల కవచాభిరాము..."

పై విషయాలు గమనిస్తే ఆదిపర్వంలో కర్ణ జననం ఒక తీరుగనూ, ఆరణ్యపర్వంలో వేఱొక తీరుగానూ, చెప్పబడింది. పై రెండింటిలో ఏది సరియైనది?

2. అక్షౌహిణీ సంఖ్య:— ఆదిపర్వంలో 81 వ పద్యమందు అక్షౌహిణీ సంఖ్య చెప్పబడ్డది.

"ఇరువదియొక్క వేయి నెనమన్నూట డెబ్బది రథంబులు నన్ని యేనుంగులు, నఱువదేను వేలు నాఱునూటపది గుఱ్ఱంబులు, లక్షయున్ దొమ్మిదివేలున్ మున్నూటయేబండ్రు వీరభటులును గల యొక్క యక్షౌహిణి యయ్యె......"

ఇటువంటి అక్షౌహిణులు 18 తో కౌరవ పాండవులు యుద్ధము చేసేరు. కౌరవసైన్యం 11 అక్షౌహిణులు; పాండవ సైన్యం ఏడు అక్షౌహిణులు. ఇంతవరకూ బాగుంది. కానీ భారత యుద్ధం ప్రారంభమైన 18 వ రోజున దుర్యోధన ధర్మరాజుల సైన్యబలాలు ఈ విధంగా నున్నట్లు చెప్పబడింది.

"...అనిన విని ధృతరాష్ట్రుం డప్పటికి మనకు బాండవులకుం గల సేనాంగంబుల కొలంది యెఱింగింపు మనవుడు సంజయుం డా జనపతి కిట్లను మనకుఁ బదునొకండు వేలు రథంబులును బది వేలు నేనూఱు గజంబులును రెండులక్షలు హయంబులును మూడుకోట్లు పదాతులును వారికి నాఱు వేలు రథంబులును మూడు వే లేనుంగులును లక్ష గుఱ్ఱంబులును గోటి కాల్బలంబులును గలిగి యుండె—" (శల్యపర్వం—ప్రథమాశ్వాసం. 113.)

కౌరవసైన్యం 11 అక్షౌహిణులలోగల కాల్బలం సంఖ్య పండ్రెండు లక్షల రెండు వేల ఎనిమిదివందల ఏభై ($=109350 \times 11$) యుద్ధ ప్రారంభంలో నే యింత మాత్రపు సంఖ్య కాల్బలంలో నున్నప్పుడు 17 దినాలు యుద్ధం అయిన తరువాత మూడుకోట్ల కాల్బలం ఎలాగు మిగులుతుంది? ఆ విధంగా నే పాండవ సైన్యంలో కూడా ఒక కోటి కాల్బలం మిగలడం ఏలాగు?

3. కర్ణుని తొడను కీటకము దొలుచుట:— కర్ణుడు పరశురాముని శిష్యుడై విలువిద్య నేర్చుతున్నప్పుడు జరిగిన విశేషములు కర్ణపర్వమున ద్వితీయాశ్వాసములో 88 వ పద్యం లగాయతు వర్ణింపబడినవి. వీటిని కర్ణుడే స్వయంగా శల్యునికి చెప్పేడు. ఈ సందర్భంలో పరశురాముడు కర్ణుని తొడపై తల నుంచి నిద్రిస్తున్న సమయాన ఒక కీటకంవచ్చి కర్ణుని తొడను దొలిచివేయగా రక్తం ధారాపాతంగా స్రవించినట్లున్నూ, తరువాత పరశురాముడు మేల్కొని రక్తధారను చూచి, ఆ కీటకాన్ని చూడగా అది 'అస్పృష్ట పూర్వ వికృతాకారంబై' యున్నట్లున్నూ, ఇంద్రుడే యీ కీటకరూపంతో వచ్చి కర్ణుని తొడ కరచి ఉండునేమోయని కర్ణుడు తలంచినట్లున్నూ, చెప్పబడియున్నది. (కర్ణపర్వం, ద్వి. ఆ. 89.) ఇదే కథ మళ్ళీ శాంతిపర్వం ప్రథమాశ్వాసంలో 20—24 పద్యములలో చెప్పబడింది. దీనిలో, ఆ కీటకం ఒక రాక్షసుడనిన్నీ, దానిని, పరశురాముడు చూచుటతోడనే ఆ రాక్షసుడు పూర్వరూపంతో కన్పించి తన పూర్వవృత్తాంతమును చెప్పినట్లునూ, వర్ణింపబడింది. తాను రాక్షసుడననీ, అతడు చెప్పిన మాటలను చెవులార వినిన కర్ణుడు, శల్యునితో ఈ వృత్తాంతం చెప్పినప్పుడు, ఇంద్రుడే కీటక

రూపంతో వచ్చి అట్లాగుచేసి ఉంటాడని చెప్పడం, అతనికి అనృతవాదిత్వాన్ని కల్పించడంలేదా ?

గాంధారి యుద్ధంలో చనిపోయినవారి కళేబరాలనుచూచి దుఃఖించడం :— పైన పేర్కొనబడిన అసందర్భాలన్నిటికంటే మిక్కిలి విచిత్రమైన దింకొకటి స్త్రీపర్వంలోని ద్వితీయాశ్వాసంలో కన్పిస్తుంది. గాంధారి తన కోడండ్రతో సహా పొలికలనికి వెళ్ళి మృతులైన పుత్రులయొక్కయూ, మనుమలయొక్కయూ, తదితర బంధువులయొక్కయూ, కళేబరాలను చూస్తుంది. కీటిలో అప్పటికి, ఐదు, లేక ఆరు రోజుల క్రితం చచ్చిపోయినవారి కళేబరాలను గుర్తించడం వర్ణించబడింది. నక్కలు, రాబందులు, పీకుకొని తిన్న కళేబరాలు, కుళ్లి వికృతరూపంలోనున్న కళేబరాలు, గుర్తించడం అసాధ్యం. పోనీ, ఆమెకు వ్యాసమునీంద్రుడిచ్చిన దివ్యదృష్టివలన వాటిని గుర్తించడం సాధ్యమయిందనుకొందాం. తక్కినవారికి ఈ పని అసాధ్యం కదా! అంతటితో సరిపోతే బాగుండును. మృతవీరులను పేర్కొంటూ గాంధారి, వారిలో భీష్ముడి పేరు కూడా కలిపివేసింది.

“కూలియుఁ గాంతియుక్తగఁ దేజము
గుందకవహ్నులు గ్రూరశిఖా
జాలమడంగియుఁ జాయవెలింగెడు
చందము నొందిరి శల్యుఁడు బాం
చాలుఁడుఁ గర్ణుఁడు జాపగురుండును
శాంతనవుండు నిజంబునకీ,
బాలుఁడు వీరి ప్రభంగడచెం గుణ
భద్రునిఁగంటె సుభద్రసుతున్.”

(స్త్రీపర్వం. ద్వి. ఆ. 12)

అప్పటికి భీష్ముడు ఇంకా సజీవుడై వుండగా, చచ్చినవారితో కలిపి అతనిని చెప్పడంలోని అర్థమేమిటి ?

ఇంకా ఇలాంటి సందేహాలెన్నో నాకు కలిగాయి. వాటి నన్నింటినీ ముమ్ముందు తెలియజేయగలను. పండితులూ, పెద్దలూ, ఎవరైనా, పై సందేహాలను తీర్చగలరని ఆశిస్తున్నాను.

# కళింగ చాటువులు

## శ్రీ నిడదవోలు వేంకటరావు

కమ్మని కవిత్వమునకు, సరసమైన చాటువులకు కళింగదేశము పేరెన్నిక గన్నది. వానిలోఁ గొన్నింటిని కొన్ని యేండ్లకుముందు ఆంధ్ర వారపత్రికలోఁ బ్రకటించితిని. ఇప్పుడు మఱికొన్ని సేకరించి పాఠకలోకమున కందించుచున్నాను.

### సాంఖ్యాయనశర్మ చాటువులు

ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మ (1863–1933) అద్భుత వ్యక్తి - కల్పలతాధిపతి-అసాధారణ మేధావి. సంభాషణాచమత్కారమునకు, చాటురచనకు నీతనికి పెట్టినది పేరు.

“ తే. గీ. ఆటవెలఁదులున్న తేటగీతములున్న
మనసు కరిగిపోవు మంచుపగిది
ఆట లేక తేట పాటయు లేకున్న
వెలఁదు లున్నఁ జాలు వేవరాలు.”

### దేశాభిమానులగు నాగరికులు

గీ. బిండె బిండెకు కాఫీకి పిడుసుతునక
కట్టుచుట్టలు కొల్చెడు పుట్టు భోగి
బుట్టె డాకులు నమలెడు పుణ్యజనుఁడు
నాగరికు లన్న వేఱెయున్నారె? వీరె.

ఉ. దంతపు బంతులాటకు ను
దారులు, రబ్బరు బంతులాటక
త్యంత మహాప్రవీణులగు
నద్భుతవీరులు, చీట్లపేక క
క్రాంతవిచార ధీరులు, ప్ర
సాదకషాయరసాది సేవనా
భ్రాంత మనస్కు లుందు రొక
పట్టున నాగరికాగ్రగణ్యులై.

# గ్రంథ విమర్శనము

## నవ్యాంధ్ర పంచకావ్య పరిశీలనము

విమర్శగ్రంథము : రచయిత శ్రీ నరసింహదేవర—ఉమామహేశ్వరశాస్త్రి. క్రౌను 77 పుటలు వెల రు 1–50. ప్రతులకు తూర్పు గోదావరిజిల్లా—ఆలమూరుపోస్టు పెదపళ్లలో ఉన్న గ్రంథకర్తకు వ్రాయవలెను.

సంస్కృత వాఙ్మయంలో రఘువంశ, కుమార సంభవ, మేఘసందేశాలూ, భారవి, మాఘకావ్యాలు పంచకావ్యాలుగా ప్రసిద్ధి చెందినవి. తెలుగుభాషలో వసు, మనుచరిత్రలూ, ఆముక్తమాల్యదా, పాండురంగ మహాత్మ్యలూ, పారిజాతాపహరణమూ పంచకావ్యాలని చాలామంది అభిప్రాయం! అవి ప్రాచీన వాఙ్మయానికి సంబంధించినవి. ఈ గ్రంథంలో నవ్య వాఙ్మయానికి చెందిన సౌందరనందం, రాణా ప్రతాపసింహ చరిత్ర, శివభారతం, ఆంధ్రపురాణం, బాపూజీ ఆత్మకథ అనే అయిదు గ్రంథాలను గురించిన విమర్శ, ప్రశంస ఉన్నవి.

నవ్యాంధ్ర వాఙ్మయంలో మధుర కావ్యాలు చాలా వెలసివున్నవి. వాటిలో రసఖండాలయినవీ చాలా వున్నవి. వాటిలో రచయిత ఏరుకొని పయి పంచకావ్యాల పరిశీలనాన్ని యీ పుస్తకంలో చేశారు. పంచకావ్యాలను గురించిన తమ నిర్ణయానికి శ్రీ ఉమామహేశ్వర శాస్త్రిగారు కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారినీ, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ కార్యదర్శి తెలంగాణా రచయిత శ్రీ దేవులపల్లి—రామానుజ రావుగారినీ ప్రమాణంగా గ్రహించారు. డాక్టర్ శ్రీ దివాకర్ల—వేంకటావధాని గారు ఈ అభిప్రాయాన్ని ఆమోదించారు. ఇట్టి పెద్దల నిర్ణయాన్ని పొందిన పయి పద్యకావ్యాలు పంచకావ్యాలని నిర్ణయించడానికి ఆక్షేపణ వుండదు.

అయితే—పంచకావ్యాలలో చేరనంతమాత్రానీ తక్కినవి రసవంతాలు కావనీ, వీటికి తీసికట్టన ఎవ్వరూ అనరు. ప్రాచీనాలయిన ఆంధ్ర పంచకావ్యాలలోనూ చేరనవి—ప్రశస్తమైనవి ఎన్నో వున్నాయి. వాటికి గల గౌరవానికి లోటులేదు. అందువల్ల ఇతర కావ్యకర్తలు తమ రచనలు పంచకావ్యాల పద్దుకి ఎక్కలేదే అని విచారించడం అనవసరం!

'విమర్శయనగా నిష్పక్షపాతముగా గుణదోషముల నిరూపణ' మాత్రమే అయినా రచయిత మాత్రం అట్టి విమర్శను గ్రహింపలేదు. 'ఇది మేలుకీళ్ల విమర్శనము కాదు; గుణస్మరణము మాత్రమే' అనే 'వక్తవ్యము'లోని వాక్యం యీ అంశాన్నే వెల్లడిస్తున్నది.

శ్రీ ఉమామహేశ్వర శాస్త్రిగారు ఎన్నుకొన్న అయిదు కావ్యాలూ ఆధునిక వాఙ్మయంలో ఉత్తమ శ్రేణికి చెందివున్నవే! ఇదివరలోనే ప్రజామోదాన్ని చూరగొన్నవే! ఇప్పుడు శ్రీ శాస్త్రిగారు తమ రచన మూలంగా ఆయా వాక్యాల వైశిష్ట్యాన్ని వివరించడం ముదావహం!

'సౌందరనందం' జంటకవులు శ్రీ పింగళి—లక్ష్మీకాంతం, శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగార్ల రచన. ఉదాత్త భావాలతో నిరర్గళధారతో సున్నితమైన కూర్పుతో కూడిన రసవత్కావ్యం. గౌతమబుద్ధుడు తన సోదరుడూ, సామ్రాజ్యాధిపతీ అయిన నందుడినీ, అతనితోపాటు అతనిభార్య సుందరినీ బౌద్ధ భిక్షుకులలో చేర్చి ధర్మప్రబోధం చేయించిన గాథ ఇందులో చక్కగా వర్ణించబడినది. దీని విమర్శలో రచయిత కావ్యంలోని అద్భుత సంఘటనలను చక్కని పద్యాలను ఉదాహరిస్తూ కళ్లకు కట్టించారు. "సౌందర నందము సాహిత్య విహాయసమున నొక యుజ్జ్వతార" అని కీర్తించారు.

'రాణా ప్రతాపసింహ చరిత్రము' శ్రీ దుర్భాక రాజశేఖరశతావధానిగారి రచన. ఇందు మేవాడ రాజ్యాధిపతి అయిన ప్రతాపసింహరాణా చరిత్ర వర్ణించబడినది. మొగలుసమ్రాట్టు అక్బరుతో ఇరవై అయిదేండ్లు హోరాహోరి పోరాడి, లెక్కలేని కడ

గండ్లకు పాలయి, స్వాతంత్ర్యాన్ని స్థాపించిన వీర ప్రతాపుని చరిత్ర యిందులో చక్కగా వర్ణించబడినది. ఇందులో నాయక, ప్రతినాయకులయిన ప్రతాప, మొగలుచక్రవర్తుల స్వభావం చక్కగా పోషించ బడినది. రచయిత, కావ్యగుణాలను సోదాహరణంగా వివరించి ప్రశంసించారు. కాని, ఇచ్చిన ఉదాహరణాలు కొన్ని అనుగుణంగా కానరావు.

'ప్రజలులేని మేవాడు లోనాడు —
తరులు రాపాడు మ్రోత వాతముల మ్రోత
మృగ వితతి మ్రోత పలుసెలయేళ్ల మ్రోత
ఖగతతుల మ్రోత గలిసి యోంకారనాద'

ప్రతిధ్వనించినది. ఇందు 'మ్రోత'తో సాధించిన యోంకారధ్వని అనుపమానము' అని విమర్శకుల అభిప్రాయం.

ఇక్కడ 'మ్రోత' అనే పదం 'ధ్వని' అనే అర్థాన్ని యిస్తున్నా వాయుధ్వని 'మ్రోత' అని అనడమూ, పక్షులధ్వని 'మ్రోత' అని అనడమూ, మృగముల అరపు 'మ్రోత' అని అనడమూ ఉచితంగా కానరాదు. వేణీసంహారంలో భట్టనారాయణుడు 'రవః శ్రవణభైరవః స్థగితరోదసీకందరః' అని ధ్వనిపరంగా 'రవ'శబ్దాన్ని వాడడం ఏమీ బాగులేదని లాక్షణికులు తీవ్రంగా విమర్శించారు. 'మ్రోత'తో ఓంకారధ్వని సాధించబడినదని అనుకోవడం విచిత్రమే!

'అంచుల మెఱయు సంధ్యారాగ పటలమ్ము
రమణీయ పీతాంబరమ్ముగాగ' (పుట 23)

అనే పాదంగల సీసపద్యం పోతన్నగారిని తలపునకు తెస్తుందని విమర్శకుల ప్రశంస. ఎఱ్ఱని సంధ్యారాగానికి పీతాంబరంతో పోలిక సరియైనట్లు తోచదు.

ఈ చరిత్రకాని విషయం చక్కగా ఉన్నదే కాని, రచనలో యిది సౌందరనందం మున్నగువాటికి తీసికట్టనే చెప్పవలసివస్తుంది.

'శివభారతం' ఛత్రపతిశివాజీ చరిత్రను తెలియజేసే చక్కని కావ్యం, రచయిత శతావధాని శ్రీ గడియారం "వెంకట శేషశాస్త్రిగారు. ఈయన తమ గ్రంథాన్ని" రసబంధుర బంధము గాగ, భారతామ్నాయము దీటుగా, నుభయమార్గ సమన్వయ ధోరణీ గుణధ్యేయముగా వ్రాసి "జగములున్నంతవరకు నెల్ల జనులు చదివి తనియగా" రచించినారట! ఇందులోని ఆయా ఘట్టములు దృష్టాంతపూర్వకంగా వివరించబడినవి. శాస్త్రిగారి లోకజ్ఞతను చక్కని ఉదాహరణాలు ఇయ్యబడినవి.

'ఆంధ్రపురాణం' నూతన పద్ధతిలో వెలసిన చరిత్ర కావ్యం. కర్త శ్రీ మధునాపంతుల—సత్యనారాయణ శాస్త్రిగారు. ఈ గ్రంథంలో ఆద్యులనుండి నేటివరకూ గల ఆంధ్రులచరిత్ర తొమ్మిదిపర్వాలలో వివరించబడినది. కథా సంవిధానమూ, అక్షర రామణీయకమూ అనే రెండు మహత్తరశక్తులూ ఒకే చోట వుండడం అసాధారణమనీ, ఆ రెండు శక్తులూ శ్రీ సత్యనారాయణశాస్త్రిగారిలో ఉన్నవనీ, ఈయన "కవితలో జగము, జగమ్ములో కవితయు వసగట్టి చూపు విద్వత్కవి" అనీ విమర్శకు ప్రశంసించారు. ప్రశంసకు ఆయన ఎంతైనా అర్హులు!

'బాపూజీ ఆత్మకథ' గాంధీమహాత్ముని ఆత్మచరిత్రను తెలిపే చక్కని పద్యకావ్యం! కర్త - అభినవ తిక్కన శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి. ఇందులో మహాత్ముని జననమునుండి అసహాయోద్యమమునకై నాగపూరులో జరిగిన సభవరకూ గల జీవితచరిత్ర ఉన్నది. శ్రీ చౌదరి గారిది మంచి శైలి. కూర్పు చక్కని పొందిక కలది. వీరి రమణీయకవితా శిల్పం దృష్టాంతాలతో కూడా యీపుస్తకంలో వివరించబడినది. శ్రీ చౌదరి గారి దేశభక్తీ, మహదారాధనా, జాతీయతా ప్రశంసించబడినవి. ఈ 'ఆత్మకథ' ఆంధ్రవాణికి మేలైన అలంకారం.

ఈ చిన్న పుస్తకం చదివితే పయిపంచకావ్యాల సారాన్ని సులభంగా గ్రహించ వీలవుతుంది. మూలగ్రంథాలను చదవాలనే ఆసక్తి తప్పక కలుగుతుంది.

## నా మహారాష్ట్ర యాత్ర

యాత్రాచరిత్రము. ప్రథమభాగము. రచయిత— సాహిత్యభూషణ శ్రీ జొన్నలగడ్డ—సత్యనారాయణ మూర్తి, ఎం. ఏ. బి. ఎల్, బి. టి. పి. డెమ్మీ 260 పుటలు. వెల నాలుగు రూపాయలు. ప్రతులు దొరుకు చోటు-వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, 292 ఎస్ప్లనేడ్, మద్రాసు—1.

విద్వత్ప్రకాండులూ, విమర్శకులూ, మహోపన్యాసకులూ, బహుభాషావేత్తలూ అయిన శ్రీ సత్య

నారాయణమూర్తిగారు కాలూనాల్లో యావద్భారత దేశాన్నీ పర్యటించి, తమ అనుభవాలనన్నింటినీ గ్రంథస్థం చెయ్యదలచారు. వారి యాత్రలలో మహారాష్ట్రప్రాంతయాత్ర ఒకటి. శ్రీ మూర్తిగారు మహారాష్ట్రంలోని నాసిక్, త్రియంబకాలలో చూసిన విశేషాలూ, స్వానుభవాలూ, వివిధ మానవుల చిత్త ప్రవృత్తులూ ఇందులో విపులంగా ఉన్నవి. ఈ మొదటి భాగంలో మహారాష్ట్రంలోని రెండు పుణ్యస్థలాలను గురించి మాత్రమే వున్నా, ఆయా సందర్భాలలో వెనుక ఆయన చేసిన హిమగిరియాత్రకూ, ఉత్తరప్రదేశ యాత్రకూ సంబంధించిన విషయాలుకూడా వివరించబడినవి. అందువల్ల యిది కేవలం మహారాష్ట్రయాత్రే కాకుండా ఇతర యాత్రలను గురించిన్నీ తెలిపే గ్రంథమని గ్రహించాలి. రచయిత ఆయా ప్రాంతాలను గురించి వ్యక్తులనుగురించీ నిర్మొగమాటంగా ఘాటుగా విమర్శించి యదార్థస్థితులను వివరించడం ఇందలి ప్రత్యేకత. ఈ యాత్రలలో ఆయన ఎట్టికష్టాలను అనుభవించినదీ, ఎట్టి ధైర్యసాహసాలు ప్రదర్శించినదీ వ్యక్తమవుతున్నది. సమకాలీనులు కాక, వెనుకటి వారెవరైనా దీన్ని వ్రాసివుంటే-ఇందలి కొన్ని సంఘటనలు వాస్తవమైనవి కావేమో అనే అనుమానించవలసి వస్తుంది. శ్రీ సత్యనారాయణమూర్తిగారు ఎంత ధీరులైనదీ అవి వ్యక్తం చేస్తూవున్నవి. చారిత్రకంగానూ, వైజ్ఞానికంగానూ కూడా యిట్టిగ్రంథాలు మహోపకారకాలు!

ఇందలి భాష గ్రాంథికమైనా, వ్యావహారిక పదాలు నిరాఘాటంగా ఉపయోగింపబడినవి. ఇట్టి గ్రంథాలు వ్యావహారికభాషలో వుంటే ఇతోధికంగా ప్రచారంలో వుండి అందరికీ సులభగ్రాహ్యంగా వుండగలవు.

ఈ గ్రంథం తొట్టతొలుత వ్యాసాల రూపంగా 'భారతి'లో ప్రకటింపబడి, తర్వాత పుస్తకరూపంగా ప్రకటితమైనది. మదరాసు, ఆంధ్ర విశ్వవిద్యాలయాలలో ఇంటర్మీడియేటు, బి. ఏ. పరీక్షలకు పాఠ్య గ్రంథమై విద్యార్థుల మెప్పు పొందినది. అందువల్లనే పునర్ముద్రణానికిన్నీ అవకాశం కలిగినది.

ఇది మహారాష్ట్ర యాత్రలోని మొదటిభాగమే! శ్రీ సత్యనారాయణమూర్తిగారు తక్కిన భాగాలనే కాకుండా, తమ భారత దేశయాత్రలను అన్నింటినీ ఈ విధంగానే గ్రంథరూపంగా ప్రకటిస్తే భాషకూ, దేశానికీ గొప్ప ఉపకారం కాగలదు.

## హృదయశ్రుతి

ఖండకావ్య సంపుటి, రచయిత: శ్రీ కోమల్లాజు-వినాయకరావు, పబ్లిషర్, దుర్గా అగ్రహారం, బకింగ్ హాంపేట, విజయవాడ-2. క్రౌను 13+80 పుటలు. మూల్యం రూపాయి. ప్రతులకై గ్రంథకర్తకు వ్రాయవలెను.

శ్రీ వినాయకరావుగారు రెండు దశాబ్దులక్రిందట అప్పుడప్పుడు వివిధ సాహిత్య పత్రికలలో ప్రకటించిన ఖండికలను ఏకైకపంయిగా చేర్చి యీ కృతిని ప్రకటిస్తున్నారు. భావకవిత్వపు ప్రభ మహోజ్జ్వలంగా వెలిగిన రోజులలో రచింపబడ్డవి యీ రచనలు. అనుదినమూ అభిరుచులు మారుతూవున్న యీ కాలంలో ఇవి ఎంతవరకూ ప్రజాదరాన్ని పొందగలవో చెప్పలేను. కాని, రచయిత తన రచనలను గ్రంథరూపంగా వెలువరించడం ఒక విశేషమే! అది అతనికి ఎంత సంతృప్తిని కలిగిస్తుందో అనుభవైక వేద్యం!

దీనికి కవిసమ్రాట్ శ్రీవిశ్వనాథ సత్యనారాయణ గారు ఉపోద్ఘాతం వ్రాశారు. శ్రీ పింగళి-లక్ష్మీకాంతం గారు పరిచయ వాక్యాలు కూర్చారు. రచయితకూడా తన రచనలను గురించి కొంత మనవి చేసుకున్నాడు. భావాలు క్రొత్తగా ఉండినా ఛందోయతిప్రాసాలకు భంగం కలగకుండా గ్రాంథికభాషలో రచన సాగించడం భావకవిత్వపు పరిపాటి. శ్రీ వినాయకరావు గారున్నూ ఆపద్ధతినే అనుసరించారు. కాని, యీపుస్తకంలో నాటికి విరుద్ధాలయిన ప్రయోగాలూ కొనవస్తున్నవి. "క్షణికము" (పుట 6, 7) అనేపదం 'క్షణము' అనే అర్థంలో ప్రయోగించబడినది. క్షణికం అంటే క్షణకాలంలో ఉండేదికాని క్షణంకాదు. 13 వ పుటలోని 'భంగరాజమ్మలా!' అనేది అలల సంబోధనానికి అర్థంగాలేదు. బహువచనంలో "రాజమ్మలార!" అని వుండాలికదా! పుట 23 లో "విస్మృతీమహారాంతర వీథులెల్ల" అని వుంది. 'విస్మృతి' శబ్దం ఇకారాంతం. 27 వ పుటలో 'తూరుపు కోనలో వికచతోయజ మిత్రుడు తోచె' అని వున్నది. సూర్యుడు ఉదయించడం సమంజసం; కాని వికసించడం సరికాదు. ఆపుటలోనే "ఈచిలుత సోనల పొంగుసంగీతగీతి" అనేచోట ఛందస్సూ, యతీకూడా తప్పిపోయాయి. 'కాల్బలిమి' (పుట 31) సరియైన పదంకాదు. 'వెలుగు దీపములకై పరువెత్తినారు' (పుట 45) ఇక్కడ ఛందస్సు

తప్పినది. 'నిర్మాణ దరించెదను నట్టి సుకృతి' (పుట 50) అనేచోట సుకృతం అనే అర్థంలో 'సుకృతి' ధర్మి వాచకం ప్రయోగించబడినది. ఇలాంటివి మరికొన్ని లేకపోలేదు.

భావకవిత్వపు రచనలు వెలువడే అవకాశం లేని యీ కాలంలో శ్రీ వినాయకరావు గారు తమ రచనలను సంపుటీకరించి గ్రంథంగా ప్రకటించడం ఒక విశేషమే! దీనివల్ల వెనుకటి భావకవిత్వపు దినాలు కళ్లకు కడుతూ ఉన్నవి.

## తెంకణాదిత్యకవి

కుమారసంభవ భాషానాద విమర్శ. శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి రచితము. క్రౌను 10+106 పుటలు. వెల 1.50. ప్రతులు దొరకుచోటు—శ్రీ డి. వి. కృష్ణారెడ్డి. ఉలవపాడు, నెల్లూరుజిల్లా.

ప్రాచీనాంధ్ర మహాకవులలో కవిరాజ శిఖామణి, తెంకణాదిత్యబిరుదాంచితుడు నన్నెచోడ మహాకవి ఒకడు. ఏభైఏళ్ళ కిందటివరకూ ఇతనిని గురించికాని, ఇతని కుమారసంభవాన్ని గురించికాని చాలామందికి తెలియదు. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు పై గ్రంథాన్ని ప్రకటించాక—ఆయన వ్రాసిన ఉపోద్ఘాతంపై తొలిసారి పెద్ద గాలిదుమారం చెలరేగింది. తర్వాత మద్రాసు విశ్వవిద్యాలయంవారు శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి కుమారసంభవ విమర్శనమునూ, కుమారసంభవ మూలమునూ ప్రకటించిన తర్వాత మరొకమారు తుపాను వచ్చింది. రమారమి రెండేండ్ల క్రితం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు నన్నెచోడునిగురించిన విమర్శ గ్రంథానికి బహుమానం ప్రకటించడంతో—మళ్లీ ఏతద్విషయక పరిశోధనలు జరిగి కొన్ని విమర్శగ్రంథాలు ప్రకటించడంలో మరొకసారి సాహిత్యరంగంలో కల్లోలం చెలరేగినది. దాని ఫలితమే యీ గ్రంథం!

శ్రీ దేవరపల్లి-వెంకట కృష్ణారెడ్డిగారు సాహిత్యోపాసకులు, పరిశోధక పండితులు, విమర్శకులు, వివిధ సాహిత్య పత్రికలకు చక్కని విమర్శ వ్యాసాలు వ్రాసి పేరు ప్రతిష్ఠలు గడించుకొన్నారు. ముఖ్యంగా నన్నెచోడుడు శ్రీ రెడ్డిగారి అభిమానకవి! అతనిని గురించి ఇదివరకే ఒక గ్రంథాన్ని వ్రాసి ప్రకటించారు. దానినిబట్టి, యీ గ్రంథాన్నిబట్టి వారి సునిశిత దృష్టి వ్యక్తమవుతూ వున్నది. ఈ గ్రంథంలో నన్నెచోడుని గురించిన పెక్కు విషయాలు చర్చించబడినవి. ముఖ్యంగా శ్రీ వేదం-వేంకటరాయశాస్త్రిగారి 'నన్నిచోడుని కవిత్వము' అనే గ్రంథంలోని విషయాలే ప్రధానంగా విమర్శించబడినవి. తమ సంకల్పం కూడా అదే అని "ఈ విమర్శ ముఖ్యముగా వేదం నన్నెచోడుని కవిత్వమునకు చెందినదే" అని శ్రీ రెడ్డిగారు 'తొలి పలుకు'ల్లో చెప్పి ఉన్నారు.

నన్నెచోడుడు తన కాలాన్ని గురించీ, తన్ను గురించి స్పష్టంగా ఏమీ చెప్పనందువల్లనూ, రచన గురించి ప్రస్తావించనందువల్లనూ, విమర్శకులు తమకు యుక్తమని తోచినట్లు వివిధమార్గాలను అనుసరించవలసి వస్తున్నది. ఎవరూ, ఏవిధంగా వ్రాసినా, అవి ఊహలపైని ఆధారపడినవే! ఈ గ్రంథానికి మూలప్రతి ఒకే ఒక్కటి తంజావూరు లైబ్రరీలో చాలా శిథిలావస్థలో ఉన్నది. దాన్ని-ఎట్టి మార్పు చెయ్యకుండా యథాతథంగా ప్రకటిస్తే ఎవరి వ్యూహాలు ఎంతవరకూ సబబుగా వున్నదీ తెలుస్తుంది.

శ్రీ రెడ్డిగారు చాలా కాలం నుంచి నన్నెచోడుని గురించి గొప్ప పరిశోధనలు చేస్తూ వున్నందున అనేక విషయాలు ఇందులో వివరించారు. విమర్శకులకూ, పరిశోధకులకూ తెంకణాదిత్యుని గూర్చిన యీ గ్రంథం ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది.

## భారతీయ తత్వశాస్త్రము

ప్రథమభాగము, రచయిత శ్రీ నిర్వికల్పానంద స్వామి, క్రౌను 192 పుటలు. వెల 2-00. ప్రకాశకులు-సాధన గ్రంథమండలి, తెనాలి.

ఈ గ్రంథంలో న్యాయ వైశేషికములు, సాంఖ్య యోగములు, పూర్వోత్తరమీమాంసలు అనే షడ్దర్శనాల తత్త్వమూ సంగ్రహంగానూ, సమగ్రంగానూ ఉన్నది. ఉత్తర మీమాంసా (వేదాంత) దర్శనంలోని తొమ్మిది మతాలూ — వాటి తారతమ్యమూ చక్కగా వివరింపబడినవి. వీటినిగురించి తెలుసుకోవాలంటే ఇదే చాలా అనుకూలమైన గ్రంథము. ఇది యిదివరలో వ్యాసాలరూపంగా 'భారతి'లో ప్రకటింపబడినదే! ప్రజా సమాదరణను చూరగొనడంవల్ల గ్రంథరూపంగా వెలువడి' ఇప్పుడు ద్వితీయ ముద్రణ భాగ్యాన్ని పొందింది. క్రమంగా ఆస్తికతా దృష్టి లోపిస్తున్న మన దేశంలో — ముఖ్యంగా ఆంధ్రదేశంలో దేశీయుల దృష్టిని తత్త్వజిజ్ఞాసకై అభిముఖమయేటట్లు చెయ్యడానికి సంకల్పించి, ఈ గ్రంథాన్ని రచించిన శ్రీ స్వామివారి సంకల్పం మిక్కిలీ ప్రశంసించదగినది.

# వార్తలు

## ఆస్థానకవి శ్రీ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి అస్తమయం

మహామహోపాధ్యాయ కవిసార్వభౌమ కళాప్రపూర్ణ శ్రీ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారు డిసెంబరు 29 తేదీ ఉదయం అయిదుగంటలకు రాజమహేంద్రవరంలో స్వర్గస్థులయినారు. శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు. 1933 లో గండపెండేరం బహూకృతి అందుకొన్నారు. 1936 లో సాలూరు పౌరులు వీరిని గజారోహణోత్సవంతో సన్మానించారు. వీరు రామాయణ భారత భాగవతాలు అమూల్యంగా ఆంధ్రంలోనికి అనువదించారు.

## సారనాథ్ వద్ద బౌద్ధవిహారం

సింహళప్రధానమంత్రిణి శ్రీమతి సరిమావో డిసెంబరు 28 వ తేదీన వారణాసిలో బౌద్ధవిహారనిర్మాణానికి శంకుస్థాపనం జరిపారు.

## బస్సుప్రమాదంలో 50 మంది మృతి

డిసెంబరు 30 వ తేదీన పాట్నా సమీపంలో సోన్ డీకిపోతున్న ఒక బస్సు దారిలో ప్రమాదవశాత్తు ఒక చెట్టు గుద్దుకొని తుత్తునియలయినది. ఈ ప్రమాదంవల్ల 50 మంది ప్రయాణీకులు మరణించారు. అకస్మాత్తుగా పెట్రోలు టాంకు అంటుకోవడంవల్ల ఇంతటి ప్రమాదం జరిగినదని తెలుస్తున్నది.

## అమెరికాలో క్రిస్మస్ ప్రమాదాలు

క్రిస్మస్ పండుగ సందర్భంలో అమెరికాలో రోడ్డు ప్రమాదాలవల్ల 411 గురు మరణించారు. అగ్నిప్రమాదాలవల్ల 70 మంది ప్రాణాలు కోల్పోయారు. ఇతర ప్రమాదాలవల్ల ఇంకా 70 మంది చనిపోయారు.

## వైద్యపరీక్ష లేకుండా భీమా

1961 జనవరి 1 వ తేదీనించి వైద్యపరీక్షల అవసరం లేకుండానే భీమా చేసుకునే అవకాశం కలిగిస్తున్నారు. ముస్ముందుగా ఇది ప్రయోగాత్మకంగా అన్ని ప్రాంతాలలోను అమలు జరుపుతున్నారు.

## ఘనా, గినీ, మాలీల సమాఖ్యా అవతరణ

డిసెంబరు 25 తేదీన ఈమూడు దేశాల అధ్యక్షులు విదేశాలన్నింటిని కలిపివేసి ఒక సమాఖ్య ఏర్పాటు చేశారు.

ఈ మూడు దేశాలకు ఒకే విధమయిన ఆర్థిక ద్రవ్య విధానం రూపొందించాలని కూడా నిశ్చయించారు. ఘనా అధ్యక్షుడు, డాక్టరు క్వామేనుక్రుమా, మాలీ అధ్యక్షుడు మోడీబోకిటా, గినీ అధ్యక్షుడు సెకోటూరేల సమావేశానంతరం ఈ ప్రకటన వెలువడ్డది.

ఈమూడు దేశాలకు ఒక రాయబార ప్రాతినిధ్యాన్ని ఏర్పాటు చేయడానికి గూడా ముగ్గురు అధ్యక్షులు అంగీకరించారు.

## చిన్నయసూరి శతవార్షిక జయంతి

బాలవ్యాకరణంతో ఆంధ్ర విద్యార్థుల అదరాభిమానాలు చూరగొన్న పరవస్తు చిన్నయసూరి శతవార్షిక జయంతి వైభవంగా జరపాలని చెన్నపురి ఆంధ్రమహాసభ నిశ్చయించినది.

## లలిత కళలలో విద్యార్థి వేతనాలు

నాట్యము, సంగీతము, చిత్రలేఖనము మొదలయిన లలితకళలలో వరిష్ఠులయిన 23 మంది విద్యార్థులకు ఉపకార వేతనాలివ్వాలని భారతప్రభుత్వం నిశ్చయించినది. వీరందరికి నెలకు 250 రూపాయలు చొప్పున వేతనాలిస్తారు.

ఆంధ్రప్రాంతంలో హైదరాబాదునివాసి మహమ్మద్ జయాపూల్ హసన్‌కు ఏడాది ఈ విద్యార్థి వేతనం లభించినది. ఈయన పతారువాద్యంలో విశేషంగా కృషిచేశారు.

ప్రస్తుతం ఒక ఏడాది చివరకే పరిమితంచేసిన ఈ వేతనాలు ఆయావిద్యార్థుల అర్హతలనుబట్టి మరికొన్ని ఏళ్ళవరకుకూడా ఇవ్వాలని నిశ్చయించారు.

## ఉస్మానియాలో భారీ టెలిస్కోప్

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 48 అంగుళాల భారీ టెలిస్కోప్ అమర్చడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఇంత పెద్ద టెలిస్కోపు ఆగ్నేయాసియాలో ఎక్కడ ఇంతకుపూర్వం ఏర్పరచలేదని విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు డాక్టర్ డి. యస్. రెడ్డి అన్నారు.

Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by
S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty
Street, Madras-1. Editor : S. Sambhu Prasad.



మునాస్ మూవిటోన్ వారి

# దేవసుందరి

త్వరలో విడుదల

పూర్ణా రిలీజ్



# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | క్యాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజీ | | | |
| 2 రంగులు | ... | రు. 125/- | రు. 100/- |
| ఒకే రంగు | ... | రు. 100/ | రు. 90/- |
| 2 లేక 3 కవరు పేజీ | ... | | |
| ఒకే (నలుపు) రంగు | ... | 90/- | 75/- |
| లోపలి పేజీలు | ... | | |
| పూర్తి పేజీ | ... | 70/- | 60/- |
| అర్థ పేజీ | ... | 35/- | 30/- |
| పావు పేజీ | ... | 20/- | 15/- |

ప్రత్యేక స్థానములకు 25% అధికం.-

సం॥ నకు వరుసగా 12 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

* కవులు, కళాకారులు, రచయితలు మొదలైన వారి ప్రకటనలు ఒక కాలం ఇంచికి కేవలం రు. 2/- చొప్పున ప్రకటించబడును.

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12-00 |
| 6 మాసముల చందా | ... | రు. 6-00 |
| విడి ప్రతి | ... | రు. 1-00 |

మేనేజరు, భారతి,
మద్రాసు-1.